# ఆర్యకథామాల

( సంస్కృత పురాణాలలోని ప్రశస్త గాథలు )

సంకలనం :
కె. చంద్రశేఖరన్

అనువాదం :
రెంటాల గోపాలకృష్ణ

దక్షిణ భాషాపుస్తక సంస్థ సహాకారమున ప్రకటితము

ఉమా పబ్లిషర్స్,
విజయవాడ-1

First Edition - Nov. 1959 — 5,000 Copies.

# ARYA KATHAMALA

Selections from
ARYA CHARITRAM
( Tales from Indian Mythology )

Edited by
K. CHANDRASEKHARAN

Translated by
RENTALA GOPALAKRISHNA

Published under the auspices of
The Southern Languages Book Trust, Madras,
TELUGU - 41

Price Rs. 2-25

PUBLISHED BY
VUMA PUBLISHERS, VIJAYAWADA-1

Vysyaratna Printing Works, Vijayawada-1

# పీఠిక

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో జాతీయ భాషా పుస్తక సంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింప చేసింది. ఆ ప్రచురణల వలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ భాషలలోకి అనువాదం చేయించి ప్రచురింప జేస్తోంది. పాఠకులలో భిన్న భిన్న అభిరుచులకు తగినట్లు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నిక చేశాము. అందువల్ల, మానవ జీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహా నాయకుల జీవిత చరిత్రలు, వారు చేసిన ఘనకార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథపరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సుకోసం, అభ్యుదయంకోసం ఆ మహాపురుషులు ఏమి చేసినది, వారికి తామెంతగా ఋణపడి ఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించటానికి వారెన్నెన్ని పాట్లు పడినది ముందుతరాలవా రంతా తెలుసుకుని ఉండటం మంచిదిగద!

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం—ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీన కళా సంపదలను అభివర్ణించే గ్రంథాలు కూడా ఇందులో ఉండటం ముదావహం. నాటకకళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతావహము

లైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాసదాయకమైన భిన్న భిన్న విషయాలను గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవు. ఆ విధంగా ఇట్టి ప్రచురణలకు ముందు ముందు విస్తార ప్రచారం కలుగ గలదని నా విశ్వాసం.

దక్షిణ భారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకి అనువదింప జేయటం ఈ ద్వితీయ గ్రంథ పరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు, విద్యావంతులలో ఎక్కువమందిని వివిధ విషయాలను గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులుగా ఆకర్షించి, ఆ జ్ఞాన పిపాసను తృప్తిపరచడానికి యోగ్యమైన గ్రంథాలను కూడా వారికి అందజేసినట్లు అవుతుంది.

ఈ దక్షిణ భాషాపుస్తక సంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

మద్రాసు,
7-10-1958.

ఇట్లు,
డా॥ ఎ. లక్ష్మణస్వామి మొదలియార్,
వైస్ ఛాన్సెలర్,
మద్రాసు విశ్వవిద్యాలయం,

# ఉపోద్ఘాతము

భారతీయ పురాణాలు గ్రీస్, రోమ్ మొదలైన ప్రాచీనదేశాల పురాణాలను పోలినవి కావు. మన సంస్కృతిపైన, శిల్పకళపైన వాటి ప్రభావం గాఢమైనది. అంతేకాదు; ప్రపంచంలోని ఇతర మతాలకు చెందిన ప్రవక్తల సూక్తులవలెను, పవిత్ర గ్రంథాలవలెనుకూడా అవి మనకు ఉత్తేజం కలిగిస్తున్నవి. మరొక ముఖ్యమైన వైలక్షణ్యంకూడా ఈ కథలకు ఉన్నది. మన దేశంలో అతి ప్రాచీన కాలంనుండి ప్రజలు- చదువురానివారుకూడా పురాణ కాలక్షేపాలలోను, భాగవత ప్రదర్శనలలోను ఈకథలను అత్యంతాసక్తితో విని గ్రహిస్తూ వచ్చారు. ఈవిధంగా హిందూసమాజహృదయాన్ని దాదాపు పూర్తిగా ఆకట్టుకొన్న కథ లివి.

ఈ పురాణ కథలలో అస్వాభావికత ఉన్నప్పటికి, ఒక జాతి ఆలోచింపగల నైతిక, ఆధ్యాత్మిక శిఖరాలు వాటిలో స్ఫుటంగా అభివ్యక్త మవుతున్నవి. ఈ దేశంలోగాని, ఇతరదేశాలలోగాని ఆధునిక సాహిత్యంలో వీటితో సరితూగగల మానవ భావనా మకుటాలు ఎక్కడగాని ఉన్నవా అనిపించే ఉత్తమ కథాసాహిత్య మిది. అందువల్ల, పురాణగాథలను అల్లి బిల్లి కథలుగాను, కట్టుకథలుగాను, తోసివేయడం అనుచితమే కాదు; మన జాతీయ నైతిక, ఆధ్యాత్మిక అభ్యుదయాన్ని కించపరచుకొనడం కూడాను.

“యువకులను ఉత్తేజపరచగల ఉత్తమాదర్శాలతో కూడిన ఉదాత్త సారస్వతం భారతీయులకు లేకపోవడం విచారకరం”- అంటూ లార్డు కర్జన్ 1904 లో కలకత్తా విశ్వవిద్యాలయ పట్టభద్రుల సభలో చేసిన ప్రసంగంపై పెద్ద గాలిదుమారం చెలరేగింది. ఆ గవర్నర్ జనరల్ నాడు చేసిన అధిక్ష ప్రసంగంవల్ల కోపోద్దీపితులైన పలువురు ప్రముఖులలో చెన్నపట్టణవాసి శ్రీ వి. కృష్ణస్వామి అయ్యర్ గారొకరు. ఇతరు లందరు వైస్రాయిపై తీవ్ర విమర్శలు కురిపించడంతో సంతృప్తిపడ్డారు. శ్రీ కృష్ణస్వామి అయ్యర్

ప్రశాంతంగా ఆలోచించారు. మన పురాణాలన్నింటినుండి ఉత్తమ్హులదగ్గ ప్రబోధక కథలను ఎంచి విడిగా ప్రకటించడమే వైస్రాయి సవాలుకి సరియైన సమాధానమని నిశ్చయించుకున్నారు. ఆ విధంగా, ఆ ఘనత వహించిన వైస్రాయి ప్రసంగం ఎంత అనుచితమైనదో, ఎంత అసంబద్ధమైనదో నిరూపించడానికి ఆయనకు ఎంతోకాలం పట్టలేదు.

బహు విద్వాంసుల సహకారంతో ఆయన ఆయాస చేసిన కృషిఫలితంగా 1907 లో దాదాపు 700 పేజీల గ్రంథమొకటి ప్రకటితమయింది. అపార విజ్ఞాన ఖనియైన భారతీయ పురాణ సాహిత్యంలోనుండి 41 కథలను ఎంచి, సంస్కృత భాషలోనే యథామూలంగా "ఆర్యచరిత్రం" అనే ఆ గ్రంథంలో ప్రకటించారు. ఆ సంపుటం - సత్యసంధతకోసం తన సర్వస్వాన్ని ధారవోసిన హరిశ్చంద్ర చక్రవర్తి విషాదగాథతో ప్రారంభమయి, సర్వవ్యామోహాలను అధిగమించి, సత్యసౌశీల్యములే ఉత్తమ గుణాలని నిరూపించిన ఉదాత్త నాయకుని చరిత్ర అగు సంగ్రహ వాల్మీకి రామాయణంతో ముగుస్తుంది. మధ్యలో పవిత్రత, ధర్మం, భక్తి, గౌరవం, త్యాగం మొదలైన సుస్థిర ఆదర్శాలకోసం కృషిచేసిన పురుషులను, స్త్రీలను, జంతువులను గురించిన రసవత్కథ లున్నవి. భారతీయులకు ఈ కథలు వారి జీవన సంప్రదాయంలో, వారి విద్యావిధానంలో భాగాలు; బాల్యంనుండి వారు తమ వ్యక్తిత్వాన్ని రూపొందించుకొనడానికి ఉపయోగపడిన ప్రాథమిక పాఠాలు.

ఈ ఆర్యచరిత్రంలోని కథలలోనుండి కొన్ని కథలను ఎన్ని తెలుగు, తమిళం, కన్నడం, మళయాళ భాషలలో ప్రకటించడానికి దక్షిణ భాషా పుస్తక సంస్థ పూనుకొన్నది. ఈ కథలన్నీ సంస్కృత మూలంలోనుండి సరాసరిగా అనువదింపబడినవి. మూలంలోని స్వచ్ఛతా సరళతలు అనువాదాలలోనికి రావడం అరుదు. అయితే, దక్షిణభారత భాషలకు సంస్కృత భాషతో సన్నిహిత సంబంధం ఉన్నందువల్ల, ఈ అనువాదాలలో కూడా

మూలంలోని సౌరస్య సౌరభ్యాలు ఎక్కువ భంగపడవు. అసలు ఎన్నడో జరిగి ఉండవలసిన ఈ కృషి ఇప్పుడైనా జరుగుతూండడం ముదావహం.

వివిధ పురాణాలలో ప్రజలకు ఎక్కువగా పరిచితములు కాని ఉత్తమ కథలను మాత్రమే స్వీకరించాలనే ఉద్దేశ్యంతో ఆర్యచరిత్రలోని పదిహేను కథలు ఇందు ఎన్నికైనవి. సాంఘిక మర్యాదల విషయంలో ఆధునిక యుగానికి అనువర్తించని కేవల ప్రాచీన ఆదర్శాలను బోధించే కథలనుకూడా వదలివేశాము.

ఈ అనువాదంలో మూలాన్ని మార్పుచేయడానికిగాని ఆధునిక భావాలకు అనుగుణంగా మలచడానికి గాని ఏ విధమైన ప్రయత్నం లేదు. ఈ కథలన్నీ యథామూలంగా అనువదింపబడినవి. కథను కలపడానికి అక్కడక్కడ కొన్ని మాటలు మాత్రం చేర్చి ఉండవచ్చు. ఆర్యచరిత్రం సంకలనకర్తకు ఆ కథలన్నింటికీ ఆంగ్లానువాదాలను కూడా ప్రకటించాలనే అభిలాష ఉండేది. ప్రస్తుతం అందలి కథలను కొన్నింటిని దాక్షిణాత్యభాషలు నాల్గింటిలోను సమర్థులచే అనువదింపజేసి ప్రకటింపజేస్తున్నందున, ఆ అభిలాష కొంతవరకు సఫలమవుతున్నదని ఆనందిస్తున్నాను.

పాఠకులు - పెద్దలు, పిన్నలూ కూడా— ఈ కథలలో గల శాశ్వత మానవతా దృష్టినీ, కాలపరీక్షను పరదేశ ప్రభావాలను తట్టుకొని నిలబడగల సమగ్రతను గుర్తింపగలిగేయెడల ఈ ప్రయత్నం విఫలంకాదు.

మద్రాసు,
30-3-1959.

కె. చంద్రశేఖరన్.

# క థా సూ చి క





# 1. వ్యాధ కపోతవృత్తాంతము

శరతల్పగతుడైన భీష్మాచార్యులవారిని చూచి ధర్మరాజు— "ఓ తాతా! నీవు సకలశాస్త్ర విశారదుడవు. శరణాగత రక్షణవిధం ఎటువంటిదో నాకు ఎరిగించవలసినది."—అని అడిగాడు. అప్పుడు భీష్మాచార్యుడు ఈ ప్రకారంగా చెప్ప సాగాడు :

"పూర్వం ఒకప్పుడు కాలచోదితుడై, నీచాచారం కలవాడై, పక్షులన్నింటికీ కాలమృత్యువులా ఒక బోయ వాడు భూమిమీద సంచరిస్తూ ఉండేవాడు. వాడు కాకోలం వంటి నల్లని శరీరచ్ఛాయ, ఎఱ్ఱనికండ్లు, పొడుగాటి ముంగాళ్లు పొట్టిపాదాలు, పెద్దనోరు, పెద్దపెద్ద దవుడలు కలిగి పాపమే ఈ రూపంలో జన్మించిందా అన్నట్లుండేవాడు. వాడి కొక బంధువుగాని స్నేహితుడుగాని లేడు, మరిన్ని వాడు చేస్తున్న పాపకృత్యాలవల్ల బంధువులందరూ వాణ్ణి పరిత్యజించారు. బంధువులతో స్నేహంలేనివాణ్ణి ఇతరులు ఎట్లా ప్రేమిస్తారు? క్రూరకర్ములు, దురాచారులు, ఇతరప్రాణుల ప్రాణాలను తీసేవారు అయిన మానవులను సకలప్రాణులు పాములను జూచినట్లు చూస్తున్నవి. వాడు నిత్యం ఒక వలపట్టుకొని వనాలలో సంచరిస్తూ పక్షులన్నింటినీ చంపుతూ వాటిని విక్రయిస్తుండేవాడు. ఈ విధంగా చాలకాలం గడచింది.

అయినప్పటికీ వాడు తానుచేస్తున్నది అపక్రమమని ఎరిగినా, భార్యతో కలిసి తిరుగుతూ దైవయోగంవల్ల మహా[illegible] అపేక్షించక ఉంటూవచ్చాడు.

ఇట్లా ఉండగా ఒకనాడు ఆ బోయవాడు యథాప్రకారం వేటకై అడవికి వెళ్ళాడు. అప్పుడే పెద్ద గాలివాన వచ్చింది. ఆకాశమంతటా మేఘాలు ఆవరించుకొన్నాయి. ఫెళఫెళమంటూ భయంకరమైన ఉరుములు, మెరుపులు పుట్టాయి. ఒక్క క్షణంసేపట్లో ఓపలతోనిండిన సముద్రంలాగా ఆకాశంలో అంతటా మబ్బులు క్రమ్ముకొనివచ్చాయి. ఏనుగుతొండంలావు ధారలతో (కుంభవృష్టిగా) వర్షం కురవసాగింది. క్షణంసేపట్లో భూమి యావత్తూ జలమయమై పోయింది. ఆ సమయంలో ఆ బోయవాడు అక్కడక్కడ తిరుగుతూ స్మృతితప్పి చలిబాధకు తాళలేక గడగడ వణకపోసాగాడు. కాని ఆ అడివంతా నీటిమయమై పోయినందున వాడికి త్రోవ తెలియలేదు. ఎక్కడ ఎత్తో, ఎక్కడ పల్లమో తెలియడం లేదు. మరిన్ని, ఆ గాలివానదెబ్బకు పక్షులన్నీ చచ్చిపడిఉన్నాయి. సింహవరాహాది మృగాలన్నీ ఎత్తయిన ప్రదేశాలలో చేరి పడుకొనివున్నాయి. ఒకటేమిటి? భయంకరమైన ఆ గాలివానకు వనచరాలన్నీ భీతిల్లి – క్షుద్బాధచే సొమ్మసిల్లి ఉన్నాయి. అంతట కొంచెంసేపటికి ఆ బోయవాడిక చలిబాధ మిక్కుటమైంది. అవయవాలన్నీ కొంకర్లు పోతున్నాయి. నడవడానికీ, నిలుచోడానికీ కూడా ఓపికా శక్తి లేకపోయింది. అప్పుడు వాడికి ఒక ఆడకపోతపక్షి లభించింది. పాప మది చలిబాధకు కదలలేక – మెసలలేక ఒక

చోట పడిఉన్నది. ఆ బోయవాడు ఆ సగాన ఉండే కూడా ఆ కపోతి కనుపించగానే దానిని పట్టుకొని తన పక్షిపంజరంలో పడవేసుకొన్నాడు. పాపకర్ములైనవారు తాము ఆపదలలో చిక్కుకొన్నప్పటికీ, ప్రాణులకు ఆపద కలిగించకుండా ఊరుకోరు. పాపాత్ముడైన ఆ బోయవాడు తన పంజరాన్ని మోసుకొని, అతివేగంగా ఆ అడవిపక్షిని పట్టుకొనిపోతూ అడవిలో ఒకచోట నీలమేఘంలాగా నిశ్చలంగా ఉన్న ఒక పెద్ద మహా వృక్షాన్ని చూచాడు. ఆ మహావృక్షం విశాలశాఖలతో ఒప్పి, నానావిధాలైన పక్షులకు ఆశ్రయమై నిలుస్తూ, నివాసం కల్పిస్తూ, ఫలాలను ప్రసాదిస్తూ కోరినవారికి రక్షకమై, బ్రహ్మదేవుడు ఉపకారంకోసం సృష్టించిన సజ్జనుడిలా శోభిల్లుతున్నది.

అంతట కొంతసేపటికి ఆ గాలివాన వెలిసింది. ఒక్క ముహూర్తమాత్రంలోనే ఆకాశంలో మబ్బులన్నీ విడిపోయినాయి. మిలమిలలాడే నక్షత్రాలతో ఆకాశం, కలువలతో శోభిల్లుతున్న సరోవరంలా ప్రకాశించింది. బోయవాడా నిర్మల నీలాలనింగిని చూచాడు. ఇంకా తీవ్రమైన చలితో బాధపడుతూనే నలుదిక్కులా కలయచూచాడు. అప్పటికి అర్ధరాత్రి అయినట్లు అతనికి తోచింది. తన నివాస స్థలం అక్కడికి చాలాదూరమవడంవల్ల, ఇంటికి వెళ్ళలేనని చింతించి ఆ రాత్రి ఆ చెట్టుక్రిందనే ఉండడానికి నిశ్చయించుకొన్నాడు. చేతులు జోడించి—"మహావృక్షంపై నివసించే ఓ దైవతములారా! మిమ్ములను నిదే శరణుపొందుతున్నాను. ఇక్కడే – ఈ చెట్టుక్రిందఉన్న బండరాతిపై తల పెట్టుకొని

ఆకులు పరుచుకొని పడుకొంటున్నాను–'' అని నేమకొంటూ, బడలికచేత అక్కడనే పడుకొని నిద్రించాడు.''

## 2

ఈ విధంగాచెప్పి భీష్మాచార్యులవారు తిరిగీ ఇలా చెప్పనారంభించారు :—

''ఓ ధర్మరాజా! ఆ చెట్టుకొమ్మమీద [illegible] ఈకలుగల పక్షి ఒకటి [illegible]కాలంనుండి [illegible] నివాసంచేస్తున్నది. ఆనాడు వేటకుపోయిన ఆ పక్షి భార్య ఇల్లు వెడలిపోయింది. ఎప్పటివలె సంధ్యాసమయానికి [illegible] రాలేదు. అందువల్ల నా పక్షి చింతిస్తూ ఈ విధంగా [illegible] సాగింది.

''అయ్యో! ఇవాళ ఇంత పెద్దగాలివాన వచ్చిందే. ప్రొద్దుననగా పోయిన నాభార్య ఇంతవరకు ఇల్లుచేరలేదు. కారణం ఏమైయుంటుందో కదా? ఈ మహారణ్యంలో దాని కేమి కీడుసంభవించిందో కదా! అయ్యో! కొడుకులు, కోడండ్రు, మనుమలు, సేవకులు–ఎంతోమంది ఇంటినిండా ఉన్నారు. కాని, అది లేని ఈ నా ఇల్లు శూన్యంగా కనుపిస్తున్న దే! అయ్యో! భార్యలేని ఇల్లు నిరర్థకంకదా? ఇల్లాలులేని ఇల్లు ఇల్లుగాదు, అడవి! అయ్యో! రంగురంగుల తళతళలతో మెరిసిపోయే దాని శరీరం, ఎఱ్ఱనికండ్లు, మధురమైన దాని కంఠస్వరం– ఇవన్నీ జ్ఞాపకంవస్తున్నాయే! ఏంచేసేది? ఇప్పు డది రాకపోతే నా బ్రతుకు వ్యర్థమేకదా? ఆహా! దానికి

నా మీద ఎంత మక్కువ! నాకు ఆహారంపెట్టక తాను ఎన్నడూ తినేదికాదు. నేను స్నానం చెయ్యనిదే తాను స్నానంచేసేదికాదు. నేను నిలిస్తే తానూ నిలిచేది. నేను పడుకొంటే తానూ పడుకునేది. నా సుఖమే తన సుఖంగా, నా దుఃఖమే తన దుఃఖంగా చూచుకునేది. నే నెక్కడికైనా వెళుతుంటే ముఖం చిన్నబుచ్చుకునేది. నేను కోపగించుకొన్నప్పుడు ప్రియమైనమాటలుచెప్పి నన్ను శాంతపరిచేది. అది పతివ్రత. పతికి ప్రీతికలిగిస్తూ,పతియే గతి అని భావించేది. నాయందామె భక్తి, అనురక్తికలిగి, స్థిరచిత్తయై స్నేహంగా ప్రవర్తించేది. గుణవంతురాలైన భార్య లభించినట్లయితే వృక్షమూలంలోనైనా సౌఖ్యంతో సమానమవుతున్నది. అటువంటి భార్య లేనిచో భవనమైనాసరే అరణ్యం అవుతున్నది. పురుషునకు ధర్మార్థకామములందు సహాయపడేది భార్యతప్ప మరెవ్వరున్నారు! పరదేశగమనంలోకూడా భార్య పురుషుని అనుసరిస్తుంది. పురుషునకు పత్నియే పరమార్థమని పెద్దలు పలుకుతున్నారు. భార్యాహీనుడికి లోకయాత్ర సాగించడం ఎట్లాగ? ఈ దేహానికి ఒక కష్టమే వచ్చినా, ఒక నష్టమే వచ్చినా—తోడుగా ఉండేది అర్ధాంగియేకదా? రోగార్తుడైన భర్తకు భార్య ఔషధంలాంటిది. భార్యకు సాటియైన బంధువు, భార్యవంటిగతి వేరే లేనేలేదు. ధర్మం ఆర్జించేటప్పుడు ఉత్తమ పత్నికి మించిన సహాయులు మరెవరూ కనుపించరు. "పతివ్రత, ప్రియభాషిణి అయిన భార్య లేని ఇల్లు కీకారణ్యంతో సమానం. కనుక అటువంటి ఇల్లాలులేని ఇంట్లో ఉండడంకంటె అడవిలో ఉండడమే ఉత్తమం!—" అని

ఈరీతిగా ఆ మగపక్షి పెక్కుభంగుల విలపించింది—"అని వచించి భీష్మాచార్యుడు మరల ఇట్లా చెప్పసాగాడు:-

## 3

"ఓ ధర్మరాజా! ఆవిధంగా విలపిస్తున్న మగపక్షి సంతాప స్వరం విని ఆ బోయవాడి ఉచ్చులలో చిక్కిఉన్న ఆడపక్షి, "ఆహా! అదృష్టమంటేనా దేఅదృష్టం! నాభర్త ఇచ్ఛానువర్తినై ముఖప్రీతులు పలికేనాడు కానేకాదు. నేను లేనప్పటికీ నా మంచితనాన్ని ఈవిధంగా పొగడుతున్నాడు - భర్తచే పొగడ్తకెక్కని భార్యబ్రతుకూ ఒకబ్రతుకేనా? భర్తసంతోషిస్తే సమస్తదేవతలూ సంతోషిస్తున్నారు. అగ్నిసాక్షిగా వంమువల్లనే నాథుడు అర్థాంగికి పరమదైవమని చెప్పుట కాదు. భర్తకు ప్రతికూలంగా సంచరించే ఆడుది కార్చిచ్చుచే దగ్ధమైన పూదీగెలాగా భస్మమైపోతున్నది!–" అని పలువిధాలచింతించి తాను ఆబోయవాడి పంజరంలో బంధింపబడి ఉంటూకూడా, శోకార్తుడైఉన్న తనభర్తను చూచి ఈవిధంగా పలికింది :–

"ఓ ప్రియుడా! నీ కొరకు మంచిమార్గం చెప్తున్నాను, వినవలసినది–శరణాగతుడై వచ్చిన బోయవానిని నీవు రక్షించుము. ఈ పక్షులవేటకాడు నీ గృహంలో నివసించిఉన్నాడు. అంతే కాదు. చలిబాధను, ఆకలిబాధను సహింపలేకున్నాడు. కనుక ఇతనిని రక్షించుట ధర్మం. జగన్మాతఅయినగోవును, బ్రాహ్మణుని, శరణాగతుని—ఈ ముగ్గురినీ రక్షించనివారు ఒకవిధమైన పాతకం పొందుతున్నారు జాతిధర్మాన్ని అనుసరించిమన వృత్తి కపోతవృత్తి. జ్ఞానవంతుడవగు నీవంటివాడు అటువంటి

ఉత్తమధర్మాన్ని పాటించవలసిఉన్నది. గృహస్థుడైనప్పటికీ యథాశక్తి ధర్మం ఆచరించవలసిఉన్నది. ధర్మాన్ని అవలంబించినవారు దేహం త్యజించియు, అక్షయమైన పుణ్యలోకాలను పొందుతున్నారు. నీవు ద్విజశ్రేష్ఠుడవు. పుత్రవంతుడవు. కాబట్టి దేహాభిమానం విడనాడి, ధర్మార్థాలనుపూని ఇతని మనస్సు సంతోషమందేటట్లు సమ్మానించవలసినది. ఓ ప్రియ నాథుడా! నీభార్యనైన నాకోసం మనస్సులో ఎంతమాత్రం సంతాపంచెందవద్దు సుమా! నీ దేహయాత్ర సాగడానికై వేరొక భార్యను నీవు పరిగ్రహించవచ్చును—"అని ఈతీరుగా పంజరములోఉన్న ఆడుపక్షి పలికింది—" అని వచించి భీష్ముడు ఇంకా ఈ ప్రకారం చెప్పసాగాడు—

## 4

"ఓ, యుధిష్ఠిరా! తరువాత ఆ ఆడుపక్షి పలికిన ధర్మవాక్యాలు విని—మగపక్షి ఆ పలుకులు ఎక్కడనుంచి వచ్చాయా అని నీళ్ళునిండిన కళ్ళతో దిక్కులు కలయచూచింది. అప్పుడా చెట్టుక్రిందఉన్న బోయవాడు దానికికనుపించాడు. అంతట అది విధ్యుక్తంగా అతనిని పూజించింది. కుశలప్రశ్న పూర్వకంగా ఈరీతి పలికింది— "ఓయీ! ఇది నీ స్వగృహమని అనుకోవలసినది. నీవు సంతాపంచెందపనిలేదు. నీ కేం కావాలో అడుగు. ఆపని చేస్తున్నాను. నీవు మాకు అతిథివి, పగవాడైనా సరే అతిథిగావస్తే అతనిని గౌరవించాలి. తమను నరకడానికి వచ్చినవాడికైనాసరే చెట్లు తమనీడను ఇస్తున్నాయికదా! పంచయజ్ఞాలు నిత్యం చేసే గృహస్థుడికి శరణాగతుడైనవానికి ఆతిథ్యంఇవ్వడం అవశ్యకం. గృహస్థుడై ఉండీకూడా అజ్ఞానం

వల్లపంచయజ్ఞాలు చేయనివాడికి ఇహపరాలు —— రెండూ కలుగవు. కనుక నీకు కావలసినవి ఏమిటో చెప్పు ? నీవు చెప్పినవి చేస్తున్నాను. అయ్యా ! నీవు ఎంతమాత్రం దుఃఖించకు" ఈవిధంగా ఆ మగకపోతపక్షి పలికిన పలుకులు విని ఆ బోయవాడు—— "ఓ శకుంతోత్తమా ! నేను చలిబాధను తాళలేకుండా ఉన్నాను. ఈబాధనుంచి నన్ను కాపాడవలసినది——" అని కోరాడు?

అది విని మగకపోతం తనశక్తికొలది కొన్ని ఎండుపుల్లలనుపోగుచేసింది. తరువాత వెళ్ళి కాలినకొరవి ఒకటి తెచ్చింది. ఆకులుమండేట్లు మంటచేసింది—— "అయ్యా ! ఇక నీవు నిర్భయంగా ఈ మంటలో చలికాచుకొమ్ము" అని పలికింది. అంతట ఆ పక్షులవేటగాడు లేచివచ్చి మంటదగ్గర కూర్చున్నాడు. తనఇష్టంవచ్చినట్లు చలికాచుకొని ఒళ్ళంతా వెచ్చచేసుకొన్నాడు. అప్పటికతనికి మళ్ళీ ప్రాణాలు లేచి వచ్చాయి. పక్షినిచూచి "ఓ కపోతమా ! విధ్యుక్తమైన నీ ఆతిథ్యానికి ఎంతో సంతోషించాను. నాకిప్పుడు ఆకలిబాధమిక్కుటంగా ఉన్నది. కనుక ఏదైనా ఆహారం పెట్టవలసినది" అని అడిగాడు. అతని పలుకులు విని కపోతము "అయ్యా ! నీ ఆకలితీర్చడానికి తగిన ఆహారం ఏమీ నా ఇంట్లో లేదు. అడవిలో బతికే మేము, తత్కాలంగా లభించినవాటితో పొట్టనింపుకుంటామేకాని మునులలాగా మాకు నిలువ ఏమీ ఉండదు." అని వెలవెలబోయింది. (కర్తవ్యం తెలిసీకూడా చేసేదేమీలేక తనవృత్తిని నిందించుకోసాగింది.) ఇట్లా ఉండి ఆకపోతము మళ్ళీ ఒకగడియసేపటికి తెలివితెచ్చుకొని ఆ

బోయవానితో, "ఓయీ! ఒక్కక్షణంసేపు ఆగు. నీ ఆకలి తీరుస్తున్నాను." అని చెప్పింది. అంతట మళ్ళీ నిప్పుచేసింది. ఋషులు, పితృదేవతలు దైవతములు-వీరినిపూజించడంకంటె కూడా అతిథిపూజ అధికమైనదనియు, తన అతిథిపూజా పుణ్యమును స్వీకరించిదయచేసి తనను అనుగ్రహించ వలసినదనియు, ఆతనితో చెప్తూ, ఆ మగకపోతము మూడుమార్లు ఆ మండుతున్న అగ్నికి ప్రదక్షిణంకావించి, అందులో దూకి మరణించింది.

అప్పుడా ఆ బోయవాడు ఆ పక్షి ప్రదర్శించిన సాహసకార్యాన్ని చూచి ఆశ్చర్యచకితుడైనాడు "అయ్యో! నేనెంత తప్పుచేశాను! నా దుష్కార్యాలవల్ల అందరిచే దూషింపబడిన క్రూరుణ్ణనైన నేను ఎన్నెన్ని దుష్కర్మలు ఆచరించాను? నీతిమాలిన నేను ఎన్నో పాపం సంపాదించుకున్నాను." అని పశ్చాత్తాపంతో తన్ను తానే నిందించుకొంటూ దుఃఖించాడు" అని పలికి మళ్ళీ పశ్చాత్తాపంతో ఈప్రకారం చెప్పడం మొదలుపెట్టాడు.

"హా, పక్షిరాజా! అంటూ ఆ బోయవాడు ఆకలిచే బాధపడుతూ, నిప్పులో దూకి చనిపోయిన కపోతాన్ని ఉద్దేశించి—

"అయ్యో! నేను క్రూరుణ్ణి. వివేకంలేక దుష్కార్యం చేశాను. నాపాపాలకి అంతులేదు. అయ్యో! నేనెంత దుష్టుడను? ఎంత నీచుడను? ఎంత నమ్మకద్రోహిని? నాకోసం మహాత్ముడైన ఈ కపోతరాజు తన దేహాన్ని సమర్పించాడు. మహాపాపిని, క్రూరుడను అయిన నాకు ఇది ఉపదేశం. కనుక

నేను ఇప్పుడే భార్యాబిడ్డలను విసర్జించి, ప్రియమైన నా ప్రాణాలు విడుస్తాను. ఈ కపోతమే నాకు ధర్మోపదేశం చేసింది. ఇది నా పుణ్యం! ఇది మొదలుకొని నా దేహాన్ని సమస్తభోగాలనుంచీ మళ్ళించుకొంటాను. వేసవికాలంలో చెఱువు ఎండిపోవునట్లు క్రమక్రమంగా నా దేహాన్ని శోషింపు చేసుకొంటాను. పరలోకాన్ని పొందుతాను. ఎండ, వాన, ఆకలిదప్పులకు భయపడను. ఎండకు-చలికి శరీరాన్ని ఒడ్డుతాను. అనేకవిధములైన ఉపవాసాలతో నా శరీరాన్ని శుష్కింప చేసుకొంటాను. ఆహా! ఈ మహానుభావుడు అతిథికోసమై తన దేహాన్ని అర్పించాడు. కనుక ఇక నాకు ధర్మమే శరణ్యం. ప్రతివ్యక్తికీ ధర్మమే రక్షకమనడానికి ఈ కపోతం చూపించిన కృత్యమే తార్కాణం—" అని పలువిధాల చింతించాడు.

"ఓ ధర్మనందనా! ఈవిధంగా ఆ బోయవాడు చింతించి, మరణించ నిశ్చయించినవాడై తాను వెంట తెచ్చుకొన్న పక్షి పంజరాన్ని, కట్టెను, శలాకలను అక్కడే విడిచి పెట్టి వెళ్ళిపోయాడు-" అని తెలిపి భీష్ముడు ఇంకా ఇట్లా చెప్పసాగాడు :-

## 5

"ఓ ధర్మరాజా! ఆ విధంగా ఆ బోయవాడు వెళ్ళిపోయిన అనంతరం, ఆడకపోతం తన భర్తను తలుచుకొని దుఃఖంతో మొఱలిడింది—"ఓ నాథా! నీకు నాపై ఎంతో ప్రీతి ఉన్నది. అది నే నెప్పటికీ మరచిపోలేను. అనేకమంది కొమాళ్ళను కన్నప్పటికీ విధవయైన స్త్రీ, నివారింపరాని

శోకంలో మునిగిపోతున్నది. మగడు లేని మగువ దీనురాలై, బంధుజనులచేత పరాభవం వెళ్ళబుచ్చుతున్నది. ఓ ప్రియుడా! ఇంతకాలమునుంచీ నేను – మధురములై, స్నేహసూచకములైన నీ పలుకులచే ఆనందవిహారాల లాలింపబడుతూ, గౌరవింపబడుతూ వచ్చాను. నీతో కలిసి కొండగుహలలో, నదీప్రవాహాలలో, వృక్షాగ్రాలలో విహరించాను. ఆకాశసంచారం చేస్తూ నీతో కలిసి సుఖంగా ఉన్నాను. ఇదివరకు నేను ఏవి అనుభవించానో అవేవీ ఇక నాకు లభించవు కదా! (ఆడవాళ్ళకు తండ్రిగానీ, అన్న-దమ్ములుగానీ, కుమారుళ్ళుగానీ పరిమితంగా ఇచ్చేవారే కాని భర్తలాగా ఎవ్వరూ మిక్కుటంగా ఇవ్వరు కదా!) అటువంటి భర్తను ఏ భార్య పూజించకుండా ఉంటుంది? స్త్రీకి మగనివంటి ఆధారం లేదు. మగనిని పోలిన సుఖమూ మరొకటి లేదు. కావున సమస్త సంపదలను విడిచిపెట్టి ఉన్నవారైనాసరే, భార్య భర్తనే శరణుపొందవలెను. ఓ నాథుడా! నీవు లేని ఈ నా బ్రతుకు వ్యర్థం. పతివ్రత అయిన ఏ స్త్రీ భర్త లేకుండా జీవించగలుగుతుంది?——” అని పెక్కు భంగుల వాపోయిన ఆ కపోతి, మండుతున్న ఆ అగ్నిహోత్రంలో పడి ప్రాణం విడిచింది. అవిఘ్నంగా మరణించి తక్షణమే తన భర్తను కాంచగలిగింది. విమానంలో ఉండి, పుణ్యనిధులైనవారిచేత ప్రశంసితుడై, చిత్రమాల్యాంబరధరుడై, నానావిధభూషణ భూషితాంగుడై ఉన్న భర్తనుచూచి, అతనితోకూడా విమానం ఎక్కి ఆ ఆడకపోతం స్వర్గం అలంకరించింది. స్వర్గలోకంలో వారిద్దరూ తమతమ సుకృతకర్మలచే పూజింపబడుతూ

సుఖంగా కాలంగడిపారు''—అనిచెప్పి, భీష్ముడు మరల ఈ విధంగా చెప్పసాగాడు.

"ఓ యుధిష్ఠిరా ! ఆవిధంగా విమానారూఢులై ఉన్న ఆ పక్షిదంపతులను చూచి, అంతట ఆ బోయవాడు తానుకూడా అటువంటి తపస్సుచేతనే ఉత్తమగతినిపొంద నిశ్చయించినవాడై వెంటనే తపస్సుప్రారంభింపగోరి వెళ్ళిపోయాడు. స్వర్గకాంక్షచే ఆ బోయవాడు నిశ్చేష్టుడై, నిరాహారుడై, ఉపవాసాల కామవర్జితుడై బయలుదేరివెళ్ళి ఒకచోట ఒక సరస్సును చూచాడు. ఆ సరస్సు చాలా విశాలంగా ఉన్నది. తామరపూలతోను, సమస్తపక్షులతోను, చల్లనిజలంతోను కూడుకొని ఉన్నది. దప్పికగొన్నవాడు ఆ జలాన్ని చూచినంతమాత్రానే సంతుష్టుడగుతాడు. సందేహంలేదు.

ఆ బోయవాడు కటికి ఉపవాసాలుచేస్తూ ఆకలితో బాధపడుతున్నప్పటికీ— దానిని లక్ష్యపెట్టక సంతోషంతో ముందుకు క్రూరమృగాలు నివసించే మహారణ్యంలో ప్రవేశించాడు. వళ్ళంతా ముళ్ళుగుచ్చుకోగా అవయవాలన్నీ గీసుకొనిపోగా, నెత్తురుకారుతున్న దేహంతో, నరసంచారమన్నమాటలేని, క్రూరమృగాలకు ఆలవాలమైన ఆ అరణ్యంలో సంచరించడం మొదలుపెట్టాడు. ఆ మహాటవిలో గాలికి కదలిన పెద్దపెద్ద వృక్షాల పరస్పర సంఘర్షణవలన ఒక పెద్ద అనలంపుట్టింది. ఆ కార్చిచ్చు గాలికి అంతకంతకూ పెద్దదై, ప్రజ్వలించి, మహాగ్ని జ్వాలలతో ఆ అరణ్యాన్ని యావత్తూ తగులబెట్టడం మొదలుపెట్టింది. అప్పుడాబోయవాడు తనదేహాన్ని ఆఅగ్నిజ్వాలలకు ఆహుతికావించ నిశ్చయించుకొని–అందులోకి ఉరికాడు. తన

పాపాలన్నీ పోయి పవిత్రుడైపోయినాడు. తరువాత అతనికి ఉత్తమ గతి లభించింది. శోకరహితుడై స్వర్గం చేరుకొన్నాడు. అక్కడ ఇంద్రసృష్టి యందు సిద్ధ గంధర్వాదులు సేవిస్తూఉన్నట్లు అతన్ని సేవిస్తూఉన్నారు. ఈవిధంగా ఆకపోతము, కపోతి, బోయ వాడు—తమతమ పుణ్యకర్మలచే స్వర్గం పొందారు.

ఓ ధర్మరాజా! భర్తను అనుగమించిన స్త్రీలు ఈ కపోతి వలెనే స్వర్గసౌఖ్యాలు అనుభవించగలరు" అని భీష్మా చార్యులవారు, ధర్మరాజుకు వ్యాధ కపోత వృత్తాంతం వినిపించారు.

# 2. శ్రీ శుకచరిత్రము

శరతల్పగతులైన భీష్మాచార్యులవారు ధర్మరాజుతో ఈ ప్రకారం చెప్ప నారంభించారు :

ఓ, ధర్మనందనా! పూర్వం మేరుపర్వతశిఖరాన కర్ణికారం అనే వనంలో ఆదిశంకరుడు భయంకరములైన భూతగణాలతోకూడి యథేచ్ఛగా విహరిస్తున్నాడు. పర్వత రాజపుత్రి – పార్వతి ఆయనను ఎడబాయక కూర్చొని ఉన్నది. ఆ ప్రదేశంలోనే కృష్ణద్వైపాయనుడు దివ్యమైన తపస్సు ఆచరిస్తున్నాడు. అప్పుడాయన ఆత్మను యోగసమాధిలో ఉంచి, యోగధర్మపరాయణుడై ఉన్నాడు. ఓ ధర్మరాజా! ఆ మహాత్ముడు పుత్రునికోసం భావనపట్టి తపం సలుపు తున్నాడు. అంతట పరమశివుడు ఆయనతపస్సుకు, ఆయన భక్తికి మెచ్చాడు. ప్రసన్నుడై అనుగ్రహింపదలచాడు. ఆ

విధంగా అనుగ్రహించదలచినవాడై త్రినేత్రుడైన శంకరుడు కృష్ణద్వైపాయనునికి ప్రత్యక్షమైనాడు—"ఓయీ! నీ కోరిక ప్రకారం పృథివ్యాది పంచభూతాలతో సమానుడై, పరిశుద్ధుడైన ఒక కుమారుడు నీకు జన్మిస్తాడు"—అని పలికాడు.

అని తెలిపి భీష్ముడు మళ్ళీ చెప్పసాగాడు.

## 2

ఓ పాండవాగ్రజా! ఆవిధంగా సత్యవతీ పుత్రుడైన కృష్ణద్వైపాయనుడు మహేశ్వరునివలన వరంపొంది, ఒకసారి అగ్నిని పుట్టించదలచి అరణిని మథించాడు. అప్పుడు అరణినుండి శుకుడు ఉదయించాడు. ఓ ధర్మరాజా! ఆవిధంగా జన్మ మందిన శుకుడు, తన తండ్రివంటి శ్రేష్ఠమైన రూపసౌందర్యాలు కలవాడై, మహాతేజస్సంపన్నుడై వెలుగొందాడు. మహా యోగియై పొగలేనిఅగ్నిహోత్రంలా ప్రకాశించాడు. అప్పుడు నదులన్నిటిలోనూ శ్రేష్ఠమైన గంగానది ఆ మేరు పర్వతమును సమీపించినదై శుకుని స్నానంచేయించింది. ఓ కురువంశ శ్రేష్ఠా! తరువాత మహాత్ముడగు ఆ శుకునికోసం అంతరిక్షం నుండి ఒక దండము, కృష్ణాజినము అతడున్నచోట భూమిపై పడినాయి. అప్పుడు అప్సరసలు ఆడారు, గంధర్వులు పాడారు. శుకుడు అట్లా జన్మించినవెంటనే శంకరుడు పార్వతితో వచ్చి అతనికి యథావిధిగా వడుగుచేశాడు. తరువాత దేవేంద్రుడు అత్యద్భుతము, దివ్యము అయిన ఒక కమండలాన్ని, వస్త్రాలను ప్రేమతో అతనికి సమర్పించాడు. ఓధర్మరాజా! అప్పుడు హంసలు, సారసములు, శతపత్రములు, చిలుకలు ఆ శుకయోగికి

ప్రదక్షిణం కావించాయి. తరువాత మహామేధావంతుడైన శుకుడు వ్రతనిష్ఠుడై సమాధిలో ఉంటూ అక్కడే ఉండిపోయినాడు. ఓ పాండవాగ్రజా! పుట్టిన వెంటనే అతనిని తండ్రివలెనే వేదాలు, రహస్యాలతోను, సంగ్రహాలతోను ఆశ్రయించాయి. తరువాత అతను వేదవేదాంగ భాష్యవేత్త అయి ధర్మాన్ని ఎంచుకొని బృహస్పతులవారిని తనకు గురువుగా కోరుకొన్నాడు. ఆయనవద్దనుండి వేదాలు, వేద రహస్యాలు ససంగ్రహంగా పఠించాడు. ఇతిహాసాలను, రాజశాస్త్రాలను సంపూర్ణంగా చదివాడు. ఆవిధంగా చదివి గురువుకు దక్షిణనొసంగి, సమావర్తనం ఒనర్చినాని మహాముని అయినాడు. బ్రహ్మచర్యంచేపట్టి సమాధినిష్ఠుడై, ఉగ్రమైన తపస్సాధనను ప్రారంభించాడు. ఆవిధంగా మహాతపస్వి అయినటువంటి శుకుడు బాల్యంనుంచే దేవతలను, మహర్షులను శాసించగలిగి, తన జ్ఞానంచేత, తపోబలంచేత సన్మంత్ర గోచరుడై వెలుగొందసాగాడు. కాని మోక్షధర్మాన్ని ఆశ్రయించిన ఆ మహాత్మునకు గృహస్థాశ్రమాది ధర్మాలయందు బుద్ధిపోక అవి ఎంతమాత్రం రుచింపకపోయెను.

అని పలికి భీష్ముడు ధర్మరాజుతో తిరిగి ఇట్లా చెప్పసాగాడు :

## 3

ఓ ధర్మరాజా! ఆవిధంగా శుకుడు మోక్షాపేక్ష కలవాడై, శ్రేయోభిలాషియై ఎంతో వినయంతో తండ్రి దగ్గరికి వెళ్ళి నమస్కరించాడు.

"ఓ భగవంతుడా! నీవు మోక్షధర్మాలన్నీ ఎరిగినవాడవు. కనుక నా చిత్తానికి పూర్తిగా శాంతిచేకూర్చే జ్ఞానం ఏమిటో తెలుపవలసినది" అని ప్రార్థించాడు.

అప్పుడు మహర్షి అయిన వ్యాసుడు కుమారుని పలుకులు విని—

"నాయనా, కుమారా! అనేకవిధములైన శాస్త్రాలను మోక్షశాస్త్రాన్ని తెలుసుకొమ్ము" అని చెప్పాడు.

శుకుడు తండ్రిఆజ్ఞ శిరసావహించి యోగశాస్త్రాన్ని, కాపిలమైన సాంఖ్యమును సంపూర్ణంగా తెలుసుకొన్నాడు. తరువాత వ్యాసమహర్షి, తన కుమారుని బ్రహ్మవర్చస్సుతో నున్నవాడై, బ్రహ్మతుల్యుడై మోక్షశాస్త్రములు అన్నింటిలోనూ ప్రజ్ఞావంతుడైనాడని గ్రహించాడు—

"నాయనా, కుమారా! ఇక నీవు మిథిలానగరాన్ని పరిపాలించే జనకమహారాజువద్దకు వెళ్ళవలసినది. ఆయన నీకు మోక్షధర్మాలన్నీ ఉపదేశించగలడు—" అని చెప్పాడు.

అంతట శుకుడు తండ్రి ఆజ్ఞప్రకారం ధర్మనిష్ఠను, మోక్షపదమును తెలుసుకొనదలచి జనకునివద్దకు ప్రయాణమైనాడు. అతను వెళ్ళేటప్పుడు వ్యాసుడు—

"నాయనా! నీవు జనకునివద్దకు గర్వంలేక మనుష్యమార్గాననే పోవలసినది. నీ యోగప్రభావంతో ఆకాశమార్గాన పోవద్దుసుమా! సుఖాన్ని ఎంతమాత్రం కోరకు. వినయంగా వెళ్ళు. పుత్రమిత్రాదులగు విశేషపదార్థాలను కోరకు. యాజ్యుడైన ఆ జనక మహారాజువద్ద అహంకారం చూపకు. ఆయన ఇష్టప్రకారం ప్రవర్తించు. ఆ విధంగా

చేస్తేనే ఆయన నీ సంశయాలు తీరుస్తాడు. ధర్మజ్ఞుడు, మోక్ష వేత్త, నాకు యాజ్యుడు అయిన ఆ జనకుడు ఏది తెలుపు తాడో దానిని నిస్సందేహంగా ఆచరించవచ్చునని నా ఉద్దేశ్యం''— అని బోధించాడు.

తండ్రి పలుకులు విని ధర్మాత్ముడైన శుకముని, మిథిలానగరానికి వెళ్ళాడు. తానుతలచిన అర్థాన్నే స్మరించు కొంటూ, ఆ భారమునేవహిస్తూ, ఆత్మారాముడై, ప్రసన్నుడై మిథిలాపురిని చేరుకొన్నాడు. కాని పురద్వారం ప్రవేశించ బోగా అక్కడున్న ద్వారపాలకులు అతనిని అడ్డగించి కఠి నపు మాటలాడి లోనికి పోనివ్వలేదు. అయినప్పటికీ శుకుడు కోపించక అక్కడే నిలుచున్నాడు. ఎఱ్ఱని ఎండలో నడచి వచ్చినందుకు అతనికి తాపంకాని, అలసటకాని, ఆకలి దప్పులుకాని కలుగలేదు. అంతట ద్వారపాలకులలో ఒకడు దుఃఖమనస్కుడై, మధ్యాహ్నపు సూర్యునివలె ప్రకాశిస్తున్న శుకునిచూచి గౌరవించి, యథావిధి చేతులు జోడించి నమ స్కరించాడు. ఆయనను తీసుకొనివెళ్ళి రాజభవనంలోని రెండవ కక్ష్యలో ప్రవేశపెట్టాడు. అప్పుడు శుకుడు అక్కడ కూర్చొని, ఎండను–నీడను ఒకటిగా తలుస్తూ, తేజోవంతుడై మోక్ష ధర్మాలనుగురించే చింతించసాగాడు. ఆ విధంగా రెండు గడియలసేపు గడిచింది. తరువాత రాజమంత్రి ఒకా యన వచ్చాడు. శుకునకు నమస్కరించి ఆయనను మూడవ కక్ష్యలో ప్రవేశపెట్టాడు.

అని తెలిపి భీష్ముడు ఇంకా ఈ రీతిగా చెప్పసాగాడు :–

ఓ, యుధిష్ఠిర మహారాజా! తరువాత జనకుడు, మంత్రులు అంతఃపుర స్త్రీలు కొలుస్తూ వెంటరాగా, పురోహితుని ముందిడుకొని, తగిన ఆసనమును, నానావిధములైన రత్నాలను పట్టించుకొని, తన శిరస్సున అర్ఘ్యపాత్రను ఉంచుకొని గురుపుత్రుడైన శుకయోగివద్దకు వెళ్ళాడు. అప్పుడు అనేకరత్నాలతో అలంకరించబడి, చక్కని ఆస్తరణములు కలిగి, మంగళప్రదమై, సమృద్ధిగల ఒక ఆసనమును పురోహితుడు పట్టుకోగా, తానుకూడా దానిని పట్టుకొని గురుపుత్రుడైన శుకునకు సగౌరవంగా సమర్పించాడు. అప్పుడు శుకుడు దానిపై ఆసీనుడైనాడు. అంతట జనకుడతనిని శాస్త్రోక్తంగా పూజించి పాదాలు కడిగి, పిమ్మట అర్ఘ్యాన్ని, ఒక ఆవును సమర్పించాడు. మంత్రయుక్తమైన ఆ పూజను శుకుడు యథావిధిగా ప్రతిగ్రహించాడు. జనకుని గౌరవించి, క్షేమ సమాచారాలు అడిగి తెలుసుకొన్నాడు. తరువాత అతని అనుజ్ఞపొంది జనకుడు తన పరిజనులతో నేలమీద కూర్చున్నాడు. అంజలి ఘటించి శుకుని కుశలప్రశ్నలడిగాడు.

అనంతరం —"స్వామీ! తాము ఇప్పుడు ఇక్కడికి విచ్చేయడానికి కారణమేమిటి?" అని అడిగాడు.

అది విని శుకయోగి —"ఓ, రాజా! నీకు శుభమగుగాక! మా నాయనగారు నాతో —'కుమారా! [illegible] యాజ్యుడు, ధర్మార్థ విశారదుడు, విదేహాధిపతి అయిన 'జనకుడనే ప్రసిద్ధవ్యక్తి ఒకాయన ఉన్నాడు. నీకు సంశయా

లేమైనా ఉన్నట్లయితే ఆయనవద్దకు వెళ్ళు. ప్రవృత్తి విషయంలోకానీ, నివృత్తివిషయంలోకానీ నీకుగల సంశయాలన్నీ ఆయన తీర్చగలడు' అని చెప్పాడు. అది విని నేను నాయనగారి ఆజ్ఞప్రకారం మిమ్మల్ని కొన్ని విషయాలు అడగాలని వచ్చాను. ధర్మజ్ఞులలో శ్రేష్ఠుడవైన ఓ, జనక మహారాజా! నాకు ధర్మాలు ఉపదేశించడానికి తామే అర్హులు. కావున అడుగుతున్నాను. ఇహలోకంలో బ్రాహ్మణుడు ఏంచెయ్యాలి? మోక్షస్వరూపం ఎటువంటిది? అది ఏవిధంగా పొందవచ్చు? అది, జ్ఞానంవల్ల లభిస్తుందా? లేక దానిని తపస్సుతో సాధించవచ్చునా? తెలియచెప్పండి మహాత్మా!"– అని అడిగాడు.

అప్పుడు జనకుడు ఈ విధంగా చెప్పాడు:

"ఓ మహనీయుడా! పుట్టినది మొదలుకొని బ్రాహ్మణుడు ఏంచెయ్యాలో చెప్తాను విను. నాయనా! బ్రాహ్మణుడు ఉపనయనం చేసుకొని వేదాధ్యయనం ఒనర్చాలి. తపస్సుచేతగాని, గురుశుశ్రూష చేతగాని, బ్రహ్మచర్యం చేతగాని, దేవతలయొక్క పితృదేవతలయొక్క, ఋణం తీర్చుకోవాలి. అసూయారహితుడై ఉండాలి. వేదాధ్యయనం పూర్తిఅయిన పిమ్మట గురుదక్షిణ ఇచ్చి అతని సెలవు గైకొని సమావర్తన మొనర్చాలి. తరువాత గృహస్థధర్మాన్ని స్వీకరించి స్వభార్యారతుడై ఉండాలి."

అంతట శుకుడు మళ్ళీ ఈవిధంగా అడిగాడు:

"ఓ, రాజా! జ్ఞానము, విజ్ఞానముకలిగి, హృదయంలో సుస్థిరమైన ద్వంద్వరాహిత్యం కలవాడుకూడా మొదట

మూడు ఆశ్రమములలోనూ క్రమంగా ప్రవర్తించవలసి ఉన్నదా ? ఈ విషయమే నేను మిమ్మల్ని ముఖ్యంగా అడుగుతున్నాను. దీనిని నాకు తెలుపవలసినది. మీరు చెప్పేది వేదాలను అనుసరించి ఉండాలిసుమా."

అందులకు జనకుడు ఈరీతిగా ప్రత్యుత్తరం ఇచ్చాడు :

"ఓ, మహర్షీ ! జ్ఞానము – విజ్ఞానము, ఈ రెండింటినీ తెలుగనిచో ముక్తి లభించనే లభించదు. జ్ఞానం లభించేది గురువుగారి అనుగ్రహం ఉంటేనే కాని కలుగదు. జ్ఞానం ఒక పడవ. ఆ పడవ నడిపేవాడు గురువు. జ్ఞానం లభించిన పిదప, కృతకృత్యుడై సంసారసాగరాన్ని దాటి ఉపయుక్తమైన ఆ రెండింటినీ విడువవచ్చును. లోకాలకూ కర్మలకూ విచ్ఛిత్తి కలుగకుండా ఉండగలందులకై పూర్వులచే నాలుగు ఆశ్రమముల ధర్మాలుగా ఆచరించబడినవి. ఆ క్రమం ప్రకారం శుభాశుభ కర్మలు ఆచరించి వానిని విడువగా, అనేక జన్మాలకు మోక్షం లభిస్తున్నది. ఆవిధంగా అనేక జన్మలలో ఇంద్రియాలను సంస్కరించుకొంటూ రాగా, పరిశుద్ధాత్ముడై మొదటి ఆశ్రమంలోనే మోక్షం పొందవచ్చును. ఆరీతిగా పరిశుద్ధాత్ముడై ఫలసిద్ధుడై, ముక్తుడైనవానికి అభీష్టసిద్ధికోసం తక్కిన మూడు ఆశ్రమములతో పనేమున్నది ? కనుక రాజసాన్ని, తామసాన్ని వర్జించాలి. సాత్వికమార్గం చేపట్టి ఆత్మచే ఆత్మను తెలుసుకోవాలి. సర్వభూతములందు తనను, తనయందు సర్వభూతములను కాంచగలుగుతూ నీటిలో చేపమాదిరి దేనినీ అంటక సంచరించాలి. ఇంద్రియార్థాలను విడిచి, సంగరహితుడై, ద్వంద్వాలకు అతీతుడై, శాంతి పొందినచో, అతను

పక్షిలాగా స్వైరపోయి పారలౌకికసుఖా లనుభవిస్తున్నాడు. ఏవైతే మోక్షశాస్త్ర నిపుణులైన బ్రాహ్మణులచేత ధారణ కావించబడుతున్నాయో, అవి యయాతి తెలిపిన గాథలు ఈ విషయంలో వున్నాయి. వాటిని తెలుపుతాను వినవలసి నది. ఎవడు ఒకనిని చూచి భయపడడో, ఏవనిని చూచి ఒకడు భయపడకుండా ఉంటాడో, వాడే బ్రహ్మ మనబడు తున్నాడు. మరిన్ని ఎవడు రాగద్వేషాలులేక మనోవాక్కాయ కర్మలచేత సమస్త భూతములందునూ పాపభావం పొందక కుండా ఉంటున్నాడో వాడే బ్రహ్మత్వము నొందుతున్నాడు. ఎవడు సుఖదుఃఖాలను, స్తుతినిందలను సువర్ణాయాసాలను సమానంగా చూడగలుగుతున్నాడో అతనికి అప్పుడే బ్రహ్మ త్వము ప్రాప్తిస్తున్నది. తాబేలు తన అవయవాలను ఎట్లు బయటికి ప్రసరింపచేసి, మళ్ళీ లోపలకి ఉపసంహరించుకొం టున్నదో అదే విధంగా యతి అయినవాడు తన ఇంద్రియా లను మనస్సుచే నియమబద్ధం చేసుకోగలగాలి. చీకటితో నిండిఉన్న గృహాన్ని దీపంతో ఏవిధంగా చూడగలుగు తామో, ఆవిధంగా బుద్ధి అను దీపంతో ఆత్మను చూడాలి ఓ బుద్ధిమంతుడా !

ఇవన్నీ నీలో నాకు కనుపిస్తున్నాయి. నీవింకా ఏదైనా తెలుసుకోదలుచుకొంటే, అడుగు, చెప్తాను. ఓ, బ్రహ్మర్షీ! నీవు నీ తండ్రిగారి అనుగ్రహంవలన, నీ అభ్యాస బలంవలన, ఇంద్రియాలను జయించినావని నాకు తెలిసింది. ఆ మహా త్ముని కృపవలననే నాకున్నూ దివ్యజ్ఞానం కలిగింది. దాని వల్లనే నిన్ను తెలుసుకోగలిగాను నాయనా. నీ విజ్ఞానం

అధికమైనది. నీగతి అధికమైనది. నీ ఐశ్వర్యమూ అధికమై నదే. కాని వాటన్నింటినీ నీవు తెలుసుకోలేకుండా ఉన్నావు. నీవు బాల్యంలో ఉన్నందువల్లనో, లేక సంతోషాలు పొందినందువల్లనో, కాక మోక్షం కలుగదనే భయంవల్లనో నువ్వు కావలసినంత విజ్ఞానంకలిగిఉండికూడా దానివిషయం తెలుసుకో జాలకుండా ఉన్నావు నాయనా! ఎవరైనాసరే, పరిశుద్ధమైన ఆత్మతో ప్రయత్నంచేసి మానవంటినావవలన సంశయాలు తీర్చుకొని, హృదయగ్రంథులనువిడిచి ఆ శ్రేష్ఠమైన స్థానాన్ని ఆశ్రయిస్తాడు. మరి నీవో– విజ్ఞానవేత్తవు, స్థిరబుద్ధివి, ధీరుడవు. దేనిపైనా ఆసక్తి లేనివాడవు. కనుక అటువంటి ప్రయత్నంతో పనిలేకుండానే నీవు ఆ పరమాత్మను పొందగలుగుతున్నావు! సుఖదుఃఖాలు నీకు సమానం. నీకు లోభత్వం లేదు. ఆట పాటలంటే నీకు ఉత్సుకత లేదు. రాగమన్నది నీకెన్నటికీ కలుగదు. బంధువులపట్ల స్నేహబంధాలు ఏవీ నీకు లేవు. అన్యులు భయపడే సమయాలలోకూడ నీవు భయపడవు. ఓ, మహాత్మా! నీవు మట్టినీ– బంగారాన్నీ సమానంగా చూడగలిగినవాడవని గ్రహించాను. అంతేకాదు. నశించనిది, రోగరహితమైనది, విద్వాంసులు పొందదగినది అయిన ఉత్తమ మార్గాన్ని నీవు ఆశ్రయించి ఉన్నావని తెలుసుకొన్నాను. ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! బ్రాహ్మణునకు కావలసినదేమిటో విన్నావు. మోక్షస్వరూపం ఎట్లాంటిదో తెలుసుకొన్నావు.”

ఈవిధంగా చెప్పి భీష్ముడు మళ్ళీ చెప్పసాగాడు :

# 5

ఓ ధర్మరాజా! ఆవిధంగా శుకయోగి జనకుని పలుకులు విని, పరిశుద్ధాత్ముడు కృతనిశ్చయుడు అయి, మనస్సును ఆత్మయందు నిలిపాడు. బుద్ధిచేత ఆత్మను కాంచినవాడై, కృతకృత్యుడు, సుఖి, శాంతుడు అయి మౌనంగా ఉత్తరాభిముఖుడై వెళ్ళి హిమవత్పర్వతం చేరుకొన్నాడు. అక్కడ వేదాధ్యయనం చేయసాగాడు. అప్పుడు దేవర్షి అయిన నారదుడు వేదార్థాన్ని తెల్సుకోదలచినవాడై శుకయోగిచెంతకు ఏతెంచాడు. అంతట శుకుడు నారదుని పూజించాడు. తరువాత నారదుడు శుకయోగిని చూచి—

"నాయనా! ధర్మజ్ఞా! నేను నీకు ఏవిధంగా శ్రేయస్సు కలిగించగలనో తెలియచెప్పవలసినది-" అని ప్రీతితో పలికాడు. అది విని శుకుడు- "మునీంద్రా! ఈలోకానికి హితమైనది ఏదో దానిని నాకు ఎరిగించవలసినది-" అని కోరాడు.

అప్పుడు నారదమునీంద్రుడు ఈవిధంగా చెప్పసాగాడు:

"నాయనా! తత్త్వజిజ్ఞాసువులు, భావితాత్ములు అయిన ప్రాచీన ఋషులకు భగవంతుడైన సనత్కుమారుడు బోధించిన విషయాన్ని నీకిప్పుడు చెప్తున్నాను, వినవలసినది- విద్యవంటి నేత్రంలేదు. సత్యంవంటి తపస్సులేదు. రాగంవంటి దుఃఖంలేదు. త్యాగంవంటి సుఖమూ మరొకటిలేదు. మనస్సును పాపకర్మలనుండి మళ్ళించడం, పుణ్యాలు ఆచరించే స్వభావం కలిగిఉండడం, సద్వృత్తి అవలంబించడం, సదాచారం కలిగిఉండడం – ఇవే లోకానికి హితం కూర్చే

ఉత్తమధర్మాలు. దుఃఖకరమైన మానుషత్వాన్ని పొంది దానియందే ఆసక్తుడై ఉండేవాడు మోహంలో పడిపోతున్నాడు. దుఃఖవిముక్తికి అది సాధనం కాజాలదు. సంగమే దుఃఖకారణం. సంగత్వం ఉన్నదే – అది మోహజాలాన్ని వృద్ధిచేయడమేకాక, బుద్ధిని స్థిరంగా ఉంచదు. మోహజాలంలో చిక్కుకొన్నవాడు ఇహంలో పరంలోకూడా దుఃఖం అనుభవిస్తున్నాడు. శ్రేయస్సు కోరేవాడు ఎప్పుడూ, శ్రేయస్సును చెరచడానికి యత్నించే కామక్రోధాలను సదా ఉపాయాల చేత పరిత్యజించవలసి ఉన్నది. క్రోధంనుంచి తపస్సునూ, మాత్సర్యంనుంచి లక్ష్మినీ, మానావమానాలనుంచి విద్యనూ, అజాగ్రత్తనుంచి ఆత్మనూ చెడకుండా ఎల్లప్పుడు రక్షించు కోవలసిఉన్నది. సత్యం పలకడం శ్రేయోదాయకం. సత్యం కన్నా హితవచనం శ్రేష్ఠం. మిక్కిలి భూతహితమైనది ఏదో, అదే సత్యమని నా అభిప్రాయం – ఎవడు సమస్త మునూ పరిత్యజిస్తున్నాడో, వాడే నిరాశుడు. వాడే నిష్పరి గ్రహుడు, వాడే నిరారంభుడు, వాడే విద్వాంసుడు, పండి తుడు. ఎవడైతే ఇంద్రియాలను తన వశంచేసుకొని, ఇంద్రి యార్థాలకు చిక్కకుండా, శాంతాత్ముడు, నిర్వికారుడు, సమాహితుడు అయి, ఇంద్రియాభిమానదేవతలను కూడినిన్నీ, విడిచినిన్నీ ప్రవర్తిస్తున్నాడో—వాడు, సంగవిముక్తుడై అనతి కాలంలోనే ముక్తిని పొందుతున్నాడు. ఏ ప్రాణినీ హింసించ రాదు. సర్వభూతదయగలిగి ప్రవర్తించాలి. ఈమానవజన్మ ఎత్తి – దేనితోకూడా వైరం పెట్టుకోరాదు. నాయనా! నీవు పరిగ్రహాన్ని పరిత్యజించి జితేంద్రియుడవుకమ్ము. ఇహపరా

లలో భయంలేనిదీ, శోకంలేనిదీ అయినస్థానం ఆశ్రయించు. భోగాలు ఆశించనివారికే సుఖం ప్రాప్తిస్తున్నది. కావున భోగాలు పరిత్యజించు. వాటిని పరిత్యజించావా దుఃఖం నుండీ, తాపంనుండీ విముక్తుడవగుతున్నావు. దుర్జయాలను జయించడంచుకొన్నవా దేవత్వైనాసగే, తపోనిత్యుడు, దాంతుడు, మూని, నియతాత్ముడు కావాలి. సంగం కలిగించేవాని పట్ల అనాసక్తి ఉండాలి. కేవలం పుణ్యకర్మలు ఆచరించే వాడికి దేవత్వం కలుగుతున్నది. పాపపుణ్యాలు రెండూ ఆచరించేవాడికి మానవజన్మ లభిస్తున్నది. కేవలం పాపకర్మలు చేసేవాడు అధోగతిని పొందుతున్నాడు. అట్లా అధోగతి పాలైన వాడికి ఏదీ వశంలోఉండదు. జీవుడు నిరంతరం మృత్యుజరాదుఃఖాలచే వెంటాడబడుతూ సంసారంలో మ్రగ్గిపోతున్నాడు. నాయనా! ఆవిషయం నీవు తెలియకున్నావేం? జంతువులు ఎల్లప్పుడూ భార్యాపుత్రాది కుటుంబమునందు ఆసక్తికలనై నశించిపోతున్నాయి. అప్పుడు వాటికి బురదగుంటలోపడిన అడవిఏనుగుల దురవస్థ వాటిల్లుతున్నది, పెద్ద పెద్ద వలలలో చిక్కుకొని నీళ్ళనుండి బయటికి తీయబడి, భూమిమీదపడి దుఃఖంచే చేపలమాదిరి, మోహజాలంలో చిక్కుకొని పరితపిస్తున్న జంతువులను చూడు. విశ్రాంతి తీసుకొనే టందుకు చోటులేక, పట్టుకొనడానికి ఆధారం ఏమీలేక, త్రోవచూపేవాడూ లేక, దారిబత్తెమూలేక, ఒంటరిగా నీవు అంధకారంతోకూడిన అడవిమార్గాన ఏవిధంగా ప్రయాణం చెయ్యగలవు నాయనా? పరలోకానికి వెళ్ళేటప్పుడు ఎవ్వడూ నీకు తోడురాడు. నీవు చేసుకొన్న సుకృత, దుష్కృతాలు

మాత్రమే నీవెంట వస్తున్నాయి. గ్రామాలలో నివసించటం ఉన్నదే – అది బంధించే త్రాడువంటిది. సుకృతం కలిగినవాడు ఆ త్రాటిని త్రెంచుకొంటాడు. దుష్కృతం చేసినవాడు దానిని త్రెంచుకోలేడు. ఈ శరీరమే ఒక ఇల్లు. ఎముకలే దానికి స్తంభాలు. స్నాయువులే కట్టుత్రాళ్ళు. రక్తమాంసాలు దానికి పూసిన పూత. చర్మమే ఆ ఇంటికి కప్పు. అది మలమూత్రాలవల్ల కలిగిన దుర్గంధంతో నిండివుంటుంది. జర, దుఃఖాలు దానిని ఆవరించి ఉంటాయి. అది రోగాలకు చోటు. అది వ్యాధులతో కూడుకొన్నది. రజోగుణం కలది, అశాశ్వతమైనది.

భూతాలకు నిలయమైనది. కనుక ఆ ఇల్లు విడిచిపెట్టదగినది. ఈ జగత్తు యావత్తూ, మహత్తుచేత పృథివ్యాది పంచభూతాలచేత కలిగింది. మహత్తు అనేది పరమునిచే కలిగింది. సర్వకాల సర్వావస్థలయందునూ సకల భూతాలనూ తనయందే చూచేవానికి శక్తి నశించదు. మోహజనితాలైన నానావిధ క్లేశాలనూ జ్ఞానంచే గడచినవాడు సర్వభోగాల సంయోగం పొందకుండా నశించడు. అతను లోకంలో బుద్ధిప్రకాశం కలిగి లోకమార్గాన్ని నిందించడు. మోక్షవేత్త అయినవాడు – కర్తకానట్టిన్నీ, మూర్తిరహితమైనట్టిన్నీ పరమాత్మయే జీవాత్మయందు నిలిచిఉంటాడని తెలుసుకొంటున్నాడు. ఎవడు తన కర్మలవలన దుఃఖపడుతున్నాడో వాడు, తన దుఃఖాలను తొలగించుకోడానికై జంతుహింస చేస్తున్నాడు. అటువంటివాడు మళ్ళీమళ్ళీ జన్మలెత్తుతూ, ఇంకా ఇంకా కర్మలాచరిస్తున్నాడు. అంతేకాదు. అతను మోహం

మూర్ఖుడు దుఃఖాలనే సుఖాలని భావిస్తూ, అపథ్యం చేసిన రోగిలాగా పదేపదే పరితపిస్తున్నాడు. అతను మథించవలసిన వస్తువులా తాడించబడినా, నొప్పబడినా, తన కర్మానుగతమైన యోనిని ఆశ్రయించి జన్మిస్తూ ఉంటాడు. అధిక శ్రమపడుతూ సంసారంలో చక్రంలా పరిభ్రమిస్తూ ఉంటాడు. నాయనా! నీవు బంధముక్తుడవు. కర్మనివృత్తి కలవాడవు. అనేకులు నియమం వలన, తపోబలం వలన, క్రొత్త బంధాలను త్రెంచుకొని బాధాశూన్యము, సుఖజనకము అయిన సిద్ధిని పొందారు నాయనా!"-

అని తెలిపి నారద మునీంద్రుడు మళ్ళీ ఈ విధంగా చెప్పసాగాడు :-

## 6

"ఓ పుత్రా, ఇంకా చెప్తాను, విను. శోకంలేనిది, శోకనాశకమైనది, శాంతికరమైనది, శుభప్రదమైనది అగు శాస్త్రాన్ని విన్నట్లయితే, బుద్ధి ఏర్పడి, సుఖం పొందుతున్నాడు. వేలాది శోకాలు, వందలాది భయాలు ప్రతినిత్యం మూర్ఖుడైన వానివద్దకే చేరుతాయి కాని, పండితుని చెంతకు చేరలేవు. కనుక అనిష్టాలు పరిహారం అయ్యేటందుకు నీకు కొన్ని విషయాలు చెప్తాను, విను. ఎవడు బుద్ధిని వశం చేసుకొంటున్నాడో, వాడు సుఖపడుతున్నాడు. అనిష్టప్రాప్తి, ఇష్టవియోగం అల్పబుద్ధులైన మానవులకు మానసిక దుఃఖాలను కలిగిస్తున్నాయి. దుఃఖం పోవడానికి, చింతించకుండా ఉండటం ఒక్కటే మందు. చింతించినందువల్ల అది చెడనూ చెడదు, పెరగనూ పెరగదు. మానసిక దుఃఖాన్ని జ్ఞానంవల్ల, శారీరక

దుఃఖాన్ని మందులవల్ల పోగొట్టుకోవలసిఉన్నది. ఇదే ప్రజ్ఞా
శక్తి. కనుక పసిపిల్లలతో సమానం కాకూడదు. యౌవనము,
రూపం, జీవితం, ద్రవ్యసమూహం, ఆరోగ్యం, ప్రియసహ
వాసం – ఇవన్నీ అనిత్యాలు. కనుక పండితుడైనవాడు వీటి
యందు ఆసక్తి చెందడు. దేశానికంతటికీ కలిగిన దుఃఖంలో
తానొక్కడు దుఃఖించకూడదు. దుఃఖించక దానిని తొల
గించేమార్గం ఏదైనా ఉన్నట్లయితే దానిని చెయ్యాలి. మాన
వుడికి తన ఆయుర్దాయంలో సుఖంకంటె దుఃఖమే ఎక్కువ.
ఎవడు సుఖదుఃఖాలు రెంటినీ పరిత్యజిస్తున్నాడో వాడే బ్రహ్మ
త్వం పొందుతున్నాడు. అటువంటివాడికోసం పండితులైన
వారుచింతించరు. నాయనా! వయస్సు అనేది–ఒక్క క్షణమైనా
కూడా నిలువకుండా పోతుంటుంది. తన శరీరమే శాశ్వతం
కానప్పుడు ఇక ఏది శాశ్వతమని భావిస్తాడు? ధనధాన్యాలని
ఖర్చుపెట్టేటప్పుడు ఎంతో కష్టంకలుగుతుంది. వాటిని కాపా
డేటప్పుడూ కష్టమే. ఇక వాటిని సంపాదించేటప్పుడు కలిగే
కష్టం అంతా – ఇంతాకాదు. కనుక ఈ ధనధాన్యాలు నాశ
నమైపోతున్నాయని చింతించకూడదు. ధనవిషయంలో అనేక
విశేషావస్థలు పొందుతూకూడా మూర్ఖులు తృప్తిపడరు.
తన్మూలంగా నశించిపోతారు. మరి పండితులున్నారు చూశావా
నాయనా! వారు ఎల్లప్పుడూ సంతుష్టులైఉంటారు. వృద్ధి
పొందేవి ఏవీకూడా క్షీణించకుండా ఉండవు. పెరుగుట విరు
గుటకొరకే. సంయోగాలన్నీ వియోగాలుపొందేవే! జీవి
తానికి చివరకు మరణమే గతి. దురాశకు అంతుఅన్నది లేదు.
సంతుష్టి ఒక్కటే పరమసుఖం. కనుక సంతోషం ఒక్కటే

పుణ్యఘనమని పండితులు భావిస్తారు. అధ్యాత్మప్రియుడై పూర్ణుని, దేనియందూ అపేక్షలేక, నిరామిషుడై, తన ఆత్మనే తనకు సహాయంగా చేసుకుని ఎవడు సంచరిస్తున్నాడో వాడే సుఖిస్తున్నాడు నాయనా!''

అని తెలిపి నారదుడు, శుకయోగితో మళ్లీ ఈప్రకారం చెప్పసాగాడు :

# 7

"నాయనా! స్వభావసిద్ధంగా ప్రయత్నించేవాడికి నాశనం అన్నది లేదు. ప్రియమైన తనదేహాన్ని జరామరణ రోగాలనుండి కాపాడుకోవలసి ఉన్నది. శారీరక మానసిక వ్యాధులు, దృఢధనుర్ధరులు ప్రయోగించిన తీక్షణమైన బాణాలలాగా దేహాలను పీడిస్తాయి. రాత్రింబవళ్ళు అనేవి - మానవుల ఆయువును పట్టుకొని నదీప్రవాహాలలా ప్రవహించి పోతాయేకాని వెనక్కు మళ్ళవు. వృద్ధాప్యం అనేది లేనట్టి సూర్యభగవానుడు పదేపదే ఉదయిస్తూ, అస్తమిస్తూ సమస్త భూతాల సుఖదుఃఖాలను పక్వం చేస్తున్నాడు. ఎల్లప్పుడూ తమకు తెలియకుండానే సంప్రాప్తమయ్యే ఇష్టానిష్టరూపాలైన మానవుల భావాలను రాత్రులు తీసుకొని పోతుంటాయి. ఒక్కొక్కడు ఏ పనీచేయక, కదలకుండా కూర్చుని ఉండే, లక్ష్మీసంపన్నుడౌతున్నాడు. ఇంకొకడు ఎంతో ప్రయత్నించి, కర్మలు చేసినీ పొందవలసినదానినికూడా పొందలేడు. దీనిని ఏమంటావు? దీనిని స్వభావసిద్ధంగా పురుషుని తప్పని అంటామా? వేటగానికి చిక్కి నడవలేని క్షుద్రమృగాలవలె,

వ్యాధిగ్రస్థులైన నరులు లేచి తిరగడానికికూడా శక్తిలేకుండా ఉంటున్నారుకదా! రోగపీడితులైనవారు ఎంతెంతో ధనం వ్యయం చేస్తున్నప్పటికీ వైద్యులు వారి వేదనలను తొలగించలేకుండా ఉంటున్నారు. ఇంతే ఎందుకూ? శాస్త్రంలో నిపుణులై, బుద్ధికుశలులై, అనేక దివ్యౌషధాలు సంపాదించుకొని ఉన్న వైద్యులే వేటగాండ్రకు చిక్కిన మృగాలలాగా రోగాలపాలై పోతున్నారు. ఆ వైద్యులే కషాయాలు త్రాగి, లేహ్యాలు తిని, పెద్దపెద్ద ఏనుగులచే విరువబడిన వృక్షాల మాదిరి జరాపీడితులై బాధపడుతున్నారు! ఇక ఈ భూమి మీద రోగపీడితములైన మృగాలకు, పక్షులకు చికిత్సచేసేవాళ్ళెవరు? సాధారణంగా మృగాలకు, పక్షులకు రోగపీడ రాకుండానే ఉంటుంది! పశువులను పశుభక్షకులు ఆక్రమిస్తున్నారు. అట్లాగే రోగాలున్నూ భయంకరులు, సహింపరానివారు, ఉగ్రతేజులు అయిన రాజులనే ఆక్రమిస్తున్నాయి. ఈవిధంగా జగత్తు యావత్తూ మొఱపెట్టుకునేటందుకుకూడా శక్తిలేక మోహశోక పరిప్లుతమై కాలప్రవాహంలో పడిపోతున్నది. కనుక కర్మతో కూడుకొన్న ప్రాణులు ధనంచేతగాని, రాజ్యంచేతగాని, కఠోరమైన తపస్సుచేతగాని తమ స్వభావాన్ని తప్పించుకోలేవు. సమస్త జనులుకూడా ఇంకా ఇంకా ఉన్నతమైన స్థానాలనే పొందగోరుతారు. అందుకు తమ తమ శక్తికొలది ప్రయత్నంకూడా చెయ్యవచ్చు. చేసినప్పటికీ అది నెరవేరదు. అప్రమత్తులు, ప్రౌఢులు, శూరులు, విక్రమవంతులుకూడా, ఐశ్వర్యంతో మదించి, మధుపానమత్తులై వళ్ళు తెలియకుండా ఉన్నవారిని కొలుస్తారు.

కొందరికి సుఖాలు వారికి ప్రయత్నించకుండానే మళ్లుతుంటాయి. ఇంకా కొందరికి శ్రమిస్తున్నా తమకు చిక్కదు. కర్మానుసక్తులైన వాళ్ళలో ప్రతి ఫలితంలో ఎంతో భేదం కనుపిస్తున్నది. కొందరు పల్లకీలలో ఎక్కి - ఊరేగుతుంటే మరికొందరు దాన్ని మూపున పెట్టుకొని మోస్తారు. ప్రతి ఒక్కరూ అభివృద్ధి కావాలనే కోరుకుంటారు. కాని వారిలో నే కొందరు సుఖాల్లో తేలిపోతుంటే, కొందరు కాలినడకను పోతూ ఉంటారు. కొందరు భార్యలు చనిపోగా, భార్యాహీనులై ఉంటారు. ఇంకా కొందరికి వంద లాది భార్యలుంటారు. ఈవిధంగా నరులు క్రమంగా సుఖ దుఃఖాలు పొందుతున్నారు. ఇది ఇంకొక విషయం. దీన్ని చూసి నాయనా ! దీనిని చూచి నీవు మోహపడవు. ధర్మా ధర్మాలు పరిత్యజించు. సత్యాసత్యాలు విడిచిపెట్టు. సత్యా సత్యాలను విడిచి, దేనితో ఏది విడిచిపెట్టదగునో దానితో దాన్ని విడిచిపెట్టు. ఓ ఋషిపుంగవా ! పరమరహస్యమైన ఈ విషయాలను నీకు తెలియపరచాను. వీటివల్లనే దేవతలు మానవలోకాన్ని విడిచి స్వర్గలోకం పొందారు.”

ఈవిధంగా నారదుడు తెలిపిన విషయాలు శుకుడు విన్నాడు. విని, ఎంతో బుద్ధిశాలిఅయిన శుకుడు, ధీరుడై మనస్సులో ఆలోచించికూడా ఒక నిశ్చయానికి రాలేకపోయి నాడు, - భార్యాపుత్రులవల్లనా దుఃఖం అధికం. విద్యలు అభ్యసించడంవల్లనా శ్రమ అధికం. ఇక అల్ప దుఃఖము, అధికఫలము అయిన శాశ్వతస్థానం ఏది ? - అని ఒక్క గడియసేపు ఆలోచించాడు. ఆలోచించి పరావరజ్ఞుడైన శుకుడు, ధర్మంలో ఉత్తమమైనదై, నిశ్శ్రేయాన్ని కలిగించి

ఉత్తమగతి పొందాలని నిశ్చయించుకొన్నాడు. తాపసోత్తముడు ఈవిధంగా చింతించాడు :

"నేను దుఃఖంలేకుండా ఉత్తమగతిని ఎట్లా పొందగల గలుగుతాను ? బహుళ కర్మ సంకటమైన ఈ సంసార సాగరంలో పడకుండా, నేను ఎట్లా పునరావృత్తిని పొందుతాను ? పునరావృత్తి కలుగని ఉత్తమభావమే నేను కోరుకుంటు న్నాను. సర్వసంగపరిత్యాగినై, నిశ్చల మనస్కుడనై ఎక్కడ నా చిత్తం శాంతి పొందుతున్నదో అట్టి స్థానానికి పోతాను. అక్షయుడను, అవ్యయుడను అయి శాశ్వతమైన ఏ స్థానంలో ఉండదలచానో అది యోగం అభ్యసించకుండా లభ్యంకాదు. అదే పరమగతి. జ్ఞానికి కర్మబంధాలు కొంచెమైనా ఉండవు కనుక యోగం అవలంభిస్తాను. గృహంలాంటి ఈ దేహాన్ని విడిచి, వాయుభూతుడనై, తేజోరాశి అయిన సూర్యునిలో ప్రవేశిస్తాను. సూర్యునిపొందిన జీవుడికి, చంద్రునిలా క్షీణత్వం రాదు. చంద్రుడు తన పుణ్యం నశించగానే దేవగణాలతో భూమిపైబడి మళ్ళీ తన స్థానానికి పోతున్నాడు. చంద్రుడికి వృద్ధిక్షయా లున్నాయి. అది తెలుసుకొన్నవాడ నగుటచేత అటువంటి బ్రతుకు నాకక్కరలేదు. మరి సూర్యుడు అట్లా కాదు. ఉల్బణములైన తన కిరణజాలంచేత లోకాలకు జ్ఞానం ప్రసాదిస్తున్నాడు. తేజస్సులన్నింటినీ తానే తీసుకొంటు న్నాడు.

క్షీణించిపోని మండలం అతనిది. కనుక తేజస్సంపన్ను డైన సూర్యభగవానుని చేరుకోవాలని నాకు బుద్ధిపుడుతు న్నది. ఇందులో ఏ శంకలేని అంతరాత్మతో దుర్ధర్షుడనై

ఉంటాను. సూర్యమండలంలో ప్రవేశించి, నా ఈ కళేబరం విడిచి, ఋషులతోకూడా దుస్సహమైన సౌర తేజస్సును పొందు తాను. ఇంక ఈ వృక్షాలు, ఏనుగులు, పర్వతాలు, భూమి, ఆకాశం, దిక్కులు, దేవతలు, దానవులు, గంధర్వులు, పిశా చులు, నాగులు, రాక్షసులు, మొదలైన నా సందర్శితవర్గానికి, ఇంకా అక్కడి భూతాలదగ్గరను సెలవుతీసుకొని సూర్యమండ లంలో ప్రవేశిస్తాను. సందేహంలేదు. ఓ సమస్త దేవతాలారా! మహాత్ములతోకూడా మీరందరూ నా యోగశక్తిని తిలకిం చండి.''– అని ఈవిధంగా నిశ్చయంతో పలికి శుకయోగి లోకఖ్యాతిగన్న నారదమునీంద్రులు వెళ్ళిపోవడానికి సెలవు ఒసంగి, తాను ఆయనవద్ద అనుజ్ఞగైకొని, అనంతరం తండ్రి వద్దకు వెళ్ళాడు.

ఆవిధంగా శుకుడు, మహాత్ముడైన కృష్ణద్వైపాయనునికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి, ఆయన అనుజ్ఞ అడిగాడు.

అప్పుడు మహానుభావుడైన వ్యాసుడు శుకుని పలు కులు విని సంతసించి "నాయనా! కుమారా! కొంచెంసేపు ఆగు తండ్రీ. నీ మూర్తిని నా కనులారా కాంచి ఆనందించ నివ్వు నాయనా!'' అని పలికాడు.

కాని ఏ ఆపేక్షా, ఎవరిమైనా స్నేహములేని శుకయోగి సంశయరహితుడై, మోక్షాన్నే కాంక్షిస్తూ, తండ్రిని విడిచి పెట్టి పయనమై వెళ్ళిపోసాగాడు. ఆవిధంగా బయలుదేరి సిద్ధ గణాలతో సేవింపబడుతున్న కైలాస శిఖరానికి వెళ్ళిపోయి నాడు–

అని చెప్పి భీష్మాచార్యుడు మరల ఇట్లా అన్నాడు:

ఓ, ధర్మరాజా ! ఆవిధంగా వ్యాసులవారి కుమారుడైన శుకయోగి కైలాసపర్వత శిఖరం అధిష్ఠించాడు, అక్కడ నిర్జనమైన, ఏ ప్రతిబంధకమూలేని ఒక ఏకాంత ప్రదేశంలో కూర్చున్నాడు. శాస్త్రీయంగాను, ఆచారప్రకారమున్ను యోగం అవలంబించి క్రమక్రమంగా పాదాలు మొదలైన అవయవాలయందు ఆత్మను ధరించాడు. సూర్యోదయ ఉదయిస్తున్న సూర్యభగవానునకు ఎదురుగా కాళ్ళు, చేతులు ముడుచుకొని వినీతుడై ఉన్నాడు. అప్పుడు అక్కడ ఒక పక్షి గాని, ఒక చప్పుడుగాని, ఒక వస్తువు కనుపడడంగాని లేదు— అంతా నిశ్శబ్దంగా, శూన్యంగా ఉన్నది. అతీతంగా [illegible] తుడైన శుకయోగి యోగాన్ని ఉపక్రమించాడు. అప్పుడు అతనికి ఆత్మదర్శనమైంది. అతను సర్వసంగపరిత్యాగి అయి ఆ పరమాత్మను సందర్శించాడు. మందహాసం చేశాడు. మళ్ళీ ఆ శుకయోగి మోక్షమార్గం లభించడానికై యోగం పట్టి మహాయోగీశ్వరుడై, ఆకాశాన్ని అతిక్రమించి వెళ్ళాడు. అంతట నారదులవారికి ప్రదక్షిణం చేసి ఆయనకు తన యోగవిధానాన్ని ఈ తీరుగా తెలిపాడు.

“ఓ నారదమహర్షీ ! మోక్షమార్గంచూచాను. ఇంక ఆ మార్గంలో ప్రవర్తిస్తాను. ఓ తపోధనా ! నీకు శుభమగు గాక ! ఓ తేజస్సంపన్నా ! నీ అనుగ్రహంవలన నేను ఇష్టమైన గతిని పొందుతాను”— ఈ విధంగా తెలిపి, శుకుడు నారదులవారికి నమస్కరించి, ఆయన అనుజ్ఞగైకొని, యోగమును ఆశ్రయించినవాడై ఆకాశానికి ఎగిరాడు. ఆవిధంగా

ఎగిరి వాయుభూతుడై, గరుత్మంతునిలాగా, వెలుగొందు తున్న బ్రాహ్మణశ్రేష్ఠుడైన శుకయోగి వాయువేగ మనో వేగాలు కలిగినవాడని సమస్త ప్రాణులూ తెలుసుకొన్నాయి. తరువాత అతను ముల్లోకాలనూ బ్రహ్మభావనతో తలపోస్తూ దీప్తమైన సూర్యాన్ని ఆశ్రయించి, సూర్యాగ్నులతో సమానుడై ఏకమనస్కుడై పోసాగాడు. అప్పుడు స్థావరజంగమాత్మకమైన సమస్త ప్రపంచమూ అతనిని శాంతునిగా, నిర్భయునిగా చూచింది. తరువాత దేవతలు పూలవాన కురిపించారు. యథాశక్తిగాను, యథావిధిగాను అతనిని పూజించారు. గంధర్వులు, అప్సరోగణాలు అతన్ని చూచి పరమాశ్చర్యచకితులైనారు. ఆ విధంగానే ఋషులు, సిద్ధులు ఎంతో ఆశ్చర్యం చెందారు.

"తపస్సిద్ధి పొందినవాడై అంతరిక్షంలో సంచరిస్తున్న ఇతడు ఎవరు? తన అధఃకాయంనుండి ఊర్ధ్వదృష్టిని సారిస్తూ పైకి వస్తున్నాడు, ఎవరబ్బా!" అని ముక్కలి సంభాషించారు. తరువాత ధర్మాత్ముడైన శుకుడు ముల్లోకాలలో ప్రసిద్ధుడై, సూర్యునిచూస్తూ, తూర్పుముఖంగా, మౌని లాగు వెళ్ళాడు. అప్పుడు ఆకాశం అంతటా శబ్దాన్ని పూరిస్తూ వస్తున్న మునిని అప్సరసలు చూచారు. విస్మయం చెందారు భ్రాంతిచెందినారు. వారిలో పంచచూడ మొదలైనవారు కన్నులు తెరిచి —

"ఈ దైవతం ఎవ్వరు? ఇతడు ఉత్తమగతిని పొంది ఉన్నాడు. సుసిద్ధుడు, నిస్పృహుడై ఇటు వస్తున్నాడు. సందేహం లేదు"—అనుకొన్నారు.

తరువాత శుకుడు ఊర్వశి, పూర్వచిత్తి [illegible] అప్సరసలు ఎల్లప్పుడూ నివసించే మలయపర్వతానికి [illegible]ళ్ళాడు. ఆ ఇరువురు అప్సరసలూ బ్రహ్మర్షిసమానుడైన శుకుని చూచి మిక్కిలి ఆశ్చర్యచకితులైనారు.

"ఆహా! వేదాభ్యాసనిరతుడైన యీ [illegible] ముని మనోనిశ్చయం ఎంతటిది? స్వల్పకాలంలో [illegible]నిలా అంతరిక్షంలో సంచరిస్తున్నాడే! ఇతను [illegible] వల్లనే యిటువంటి ఉత్తమగతిని పొందాడు. [illegible]ను. ఇతడు గొప్ప తపస్వి, పితృభక్తుడు. [illegible] ప్రియమైన కొడుకు. ఎల్లప్పుడూ మనస్ఫూర్తిగా యితన్ని ప్రేమించే తండ్రి యితన్ని ఎట్లా వొదిలిపెట్టాడబ్బ!"—అని ఊర్వశి ఆశ్చర్యంగా పలికింది.

ఆ పలుకులు విన్నాడు శుకయోగి. [illegible] వేత్త అయినందున ఆ మాటలలోని అర్థాన్ని మనస్సులో నిలుపుకొన్నాడు. సమస్తదిక్కులు [illegible]. కొండలతోను, వనాలతోను, అరణ్యాలతోను నిండివున్న భూమి; ఆకాశం, నదులు, సరస్సులు అన్నీ అతనికి [illegible]. సమస్తదేవతలూ గౌరవపురస్సరంగా చేతులు జోడించుకొని శుకుని రాకకోసం నిరీక్షిస్తున్నారు. అప్పుడు శుకుడు వారందరినీచూచి యీవిధంగా పలికాడు:

"మా నాయనగారు నన్ను వెంబడించి 'ఓ శుకా!' అని పిలిచినట్లైతే మీరంతా జాగరూకులై ఉండి ఆయన పిలుపుకు బదులుపలకండి. నాపట్ల స్నేహవాత్సల్యం చూపి యీ పనిమాత్రం చెయ్యండి"—

అని విని సమస్తదిక్కులు, నదులు, సముద్రాలు, పర్వతాలు—శుకునితో—

"ఓ బ్రాహ్మణోత్తమా! నీ ఆజ్ఞానుసారమే చేస్తాము"—అని బదులు చెప్పాయి.

భీష్మాచార్యులవారు ఈవిధంగా చెప్పి తరువాత మళ్ళీ చెప్పసాగారు :

# 9

ఓ యుధిష్ఠిరమహారాజా! గొప్ప తపస్సంపన్నుడైన శుకయోగి ఆ విధంగా పలికి, చతుర్విధాలైన దోషాలను పోగొట్టుకొని, సిద్ధిని పొందుటకై మళ్ళీ బయలుదేరాడు. అయిదువిధాలైన రజోగుణాన్ని, ఎనిమిది రకాలైన తమోగుణాన్ని విడిచిపెట్టి, తరువాత బుద్ధిశాలి అయిన శుకుడు సత్వగుణాన్నిసహితం త్యజించాడు. అది ఎంతో అద్భుతమనిపించింది! తరువాత అతడు పొగలేని నిప్పులాగా ప్రజ్వలిస్తూ, నిత్యము, నిర్గుణము లింగరహితము అయిన బ్రహ్మపదాన్ని చేర్చి వెళ్ళాడు. ఆ సమయంలో ఉల్కాపాతం కలిగింది. దిక్కులు దహించుకొనిపోయినాయి. భూకంపం పుట్టింది. అది అందరికీ అత్యద్భుతమై చూపట్టింది. చెట్లు కొమ్మలను విడిచిపెట్టాయి. కొండలు శిఖరాలను వదిలిపెట్టాయి. పిడుగుల చప్పుడుతో హిమవత్పర్వతం బద్దలైనట్లు తోచింది. సూర్యుడు ప్రకాశించలేదు. అగ్ని ప్రజ్వలించలేదు. సముద్రాలు, నదులు కలతచెందాయి. వాసవుడు రససుగంధభరిత

మైన జలాన్ని వర్షించాడు. ఆ దివ్యపరిమళాన్ని వహిస్తూ పవిత్రమైన వాయుదేవుడు వీచాడు. ఆ తరువాత శుకుడు దివ్యమైనట్టిన్ని, హిమవత్పర్వతానికీ-మేరుపర్వతానికీ సంబంధించినట్టిన్నీ, శ్వేతవర్ణం-పీతవర్ణం కలిగినట్టిన్నీ, ఆ రెండు రంగులూ కలిసి వెండి, బంగారుమయమైన [illegible] పొడుగు-వెడల్పు గలవైన రెండు శిఖరాలు కనుపించగా వాటిని చూస్తూ, వాటికి ఉత్తరదిక్కుగా శంకలేని చిత్తంతో ముందుకు పోసాగాడు. ఓ ధర్మనందనా! అప్పుడా రెండు శిఖరాలు వేగంగా చీలికలైనట్లు కనుపించి, మహా అద్భుతాన్ని కలిగించాయి. పిమ్మట శుకుడు ఆ రెండుశిఖరాలనుంచి చాలా త్వరగా వెళ్ళాడు. ఆ పర్వతం అతని ముందుగమనానికి ఎట్టి అవరోధం కలిగించలేదు. తరువాత ఆకాశంలో దేవతల ధ్వని అధికంగా కలిగింది. అట్లాగే అక్కడున్న గంధర్వులు, ఋషులు పెద్ద ధ్వనులు పుట్టించారు. ఆవిధంగా శుకుడు దాటిపోయినడను. పర్వతం రెండు చీలిక లవటంచూచి అంతటా 'మేలు మేలు' అన్న మహాధ్వని కలిగింది. ఓ యుధిష్ఠిర మహారాజా! అప్పుడు శుకుడు దేవతలు, గంధర్వులు, ఋషులు, యక్షులు, రాక్షసులు, విద్యాధరులు – మొదలైనవా రందరి చేత పూజింపబడినవాడై, అంతరిక్షం అంతటా దివ్యమైన పూలవానలతో నిండగా ప్రకాశించసాగాడు. తరువాత అతను అతిరమ్యము, పూలచెట్లతో అందగించునది అయిన గంగానది పైభాగంనుంచి వెడుతూ దానిని చూచాడు. ఆ గంగానదిలో అప్సరస స్త్రీలు మిక్కిలి అభిరతితో జలక్రీడ లాడుతున్నారు. వస్త్రాలు విడిచిఉండీకూడా వారు శూన్యంగా

దిగంబరుడై వెళుతున్న శుకయోగీంద్రుని చూచి సహస్రం సిగ్గుపడకుండా ఉన్నారు.

అప్పుడు వ్యాసమునీంద్రుడు, తన కుమారుడు ఉత్తమ గతిని ఆశ్రయించి, వాయుపథాన్ని దాటి అంతరిక్షమార్గాన పోతూఉండడం చూచాడు. కొడుకుపై ఉండే మమకారాన్ని విడువలేని ఆ మహాత్ముడు తన ప్రభావంతో బ్రహ్మీభూతుడై ఉన్న కుమారుణ్ణి తాను ఒక మహాయోగగతిని అవలంబించి వెంబడించాడు. అందువలన ఆవ్యాసమహర్షి ఒక్కనిముషం సేపట్లోనే శుకయోగిని కలుసుకోగలిగాడు. శుకుడు వెళ్ళిన మార్గంలో ఆ పర్వతం రెండు చీలికలై ఉండటంచూచాడు. అప్పుడు అక్కడఉండే ఋషిపుంగవులు తన కుమారుని అద్భుతకార్యాన్ని ప్రశంసించగా విన్నాడు. అట్లా విని వ్యాసుడు "ఓ, శుకుడా! అని బిగ్గరగా గొంతెత్తి అరచాడు. అప్పుడు శుకయోగి, తన తండ్రిగొంతు ముల్లోకాలలోనూ ప్రతిధ్వనించడం విన్నాడు. తాను సర్వగతుడు, సర్వాత్ముడు, సర్వతోముఖుడు అయినందున ఆ తండ్రి పిలుపుకు 'ఓ' అని బదులుపలికాడు. తరువాత 'ఓ' అనే అదే నాదాన్ని వ్యాపింపచేస్తూ స్థావర జంగమాత్మకమైన ప్రపంచం ధ్వనిస్తూ బదులుపలికింది. ఆనాటినుంచీ ఇప్పటిదాకా కొండగుహలలో పలికిన శబ్దాలు ఆ శుకుని ధ్వనికి ప్రతిధ్వనిలాగా కనుపిస్తున్నాయి. ఆ రీతిగా శుకయోగి తన ప్రభావంచూపి అంతట అంతర్హితుడైనాడు.

శబ్దాది గుణరహితుడై పరమపదాన్నిపొందిన, మహాతేజోనిధి అయిన కుమారుని ప్రభావంచూచి, అతన్నే తలుచు

కుంటూ వ్యాసమునీంద్రుడు ఆ కొండపై చేస్తున్నాడు. [illegible] నాడు. అప్పుడు గంగానదిలో జలక్రీడలాడుతున్న [illegible] రసస్త్రీలు అక్కడికి వచ్చారు. వ్యాసుడు [illegible] కొండను నీళ్ళలో మునిగాడు. [illegible] కొన్నాడు. ఆ కాంతలు అనిష్టంగా సంభ్రమంతో [illegible] చూచి వ్యాసుడు, అంతలకు కారణం తాన [illegible] ముక్తత; తన సక్తత అని గ్రహించుకొన్నాడు. [illegible] కాని కొడుకుమీద ప్రీతిమాత్రం [illegible]. అప్పుడు వ్యాసమహర్షి వద్దకు, గంధర్వులు, [illegible] సేవిస్తూ వెంటరాగా, త్రిశూలపాణి భగవంతుడు శంకరుడు అరుదెంచాడు. ప్రసన్నచిత్తంతో [illegible] వ్యాస మహర్షిని ప్రియవచనాలతో ఓదార్చాడు.

"ఓయీ, వ్యాసుడా! పూర్వం నీవు [illegible] సమానమైన పరాక్రమంగల కొడుకు కావాలని కోరావు. నీ తపస్సుకు మెచ్చి నీవు కోరిన వరం ఇచ్చాను. నీకు [illegible] లక్షణాలుగల కుమారునే అనుగ్రహించాను. ఆ విధంగా నావరంవల్ల జన్మించి, తేజోవంతుడు, శుచి, జితేంద్రియుడు అయి ఎవ్వరికీ ప్రాప్యంచని ఉత్తమగతిని పొందాడు. జితేంద్రియులైన దేవతలకు కూడా అతనిగతి దుర్లభం. ఓ మహర్షీ! అటువంటివాడికోసం చింతిస్తావు దేనికి? అటువంటి కుమారుని నీవు కన్నందున నీకీర్తి, కొండలు, సముద్రాలు ఉన్నంత కాలం నిలుస్తుందిసుమా! ఓ మునీంద్రా! నా అనుగ్రహం వల్ల నీ కొడుకుతో సమానమైన ఛాయను నీవు ఎల్లప్పుడూ చూడగలుగుతావు. ఆ నీడ ఈ లోకంలో నిన్ను విడువకుండా

నీకు ... సాగుతూంటుంది!"– అని మహేశ్వరుడు తనం
తాను దానమిచ్చి ఓదార్చగా, వ్యాసుడు ఊరడిల్లాడు. తన కుమారుని గోల్పోయిన దుఃఖమంతా పూర్తిగా మనసులోనుంచి వెనక్కు మరలిపోయినాడు.

భరతవంశంలో శ్రేష్ఠుడవైన ఓ ధర్మరాజా! శుకుని జన్మచరిత్ర ఎట్లాంటిదో నీకు సవిస్తరంగా చెప్పాను, ఇక నిన్ను నన్ను అడుగవలసిన దేమున్నది? దీనిని చెప్పిన ఆయన నారదమహర్షి నాకు చెప్పాడు. మహాయోగి అయిన వ్యాస మహర్షి శిష్యులందరికీ అధ్యాపనప్పుడు ప్రసంగవశాత్తూ తెలుపుతూ వచ్చాడు. మోక్ష ధర్మోపదేశాలలో కూడిన ఈ పుణ్యచరిత్రను ఎవరు జ్ఞాపకం ఉంచుకొంటున్నారో వారు, శాంతిమంతులై, ఉత్తమగతిని పొందగలుగుతున్నాడు."

అని శ్రీ భీష్మాచార్యుడు ధర్మరాజులవారికి ఎరింగించాడు.

---

# 3. గురుభక్తి మహిమ

## (ఉపమన్యు కథ)

ఆయోదధౌమ్యుడనబడే ధౌమ్యుడికి ఉపమన్యువు అనే ఒక శిష్యుడున్నాడు.

ఉపాధ్యాయులవారు అతనిని పిలిచి – "నాయనా! ఉపమన్యూ! నీవు వెళ్ళి పశువులను మేపుకొనిరమ్ము" అని చెప్పి పంపారు.

ఉపాధ్యాయులవారు చెప్పినట్లే ఉపమన్యువు పశువులను కాచాడు. అతను పగలంతా పశువులను మేపుకొని సాయంత్రంవేళకు గురువుగారి ఇంటికి చేరుకొన్నాడు. ఉపాధ్యాయులవారి ఎదుట నిలుచుని ఆయనను ప్రణమిల్లాడు. ఉపమన్యువు చాలా పుష్టిగా - బలిసి ఉండటం చూచి ఉపాధ్యాయులవారు -

"అబ్బాయీ! ఉపమన్యూ! నీవు ఏ వృత్తి చేసి పొట్ట నింపుకొంటున్నావు? చూడబోతే నీవు బాగా బలిసి ఉన్నావే!" అని అడిగారు.

అందులకు ఉపమన్యువు, తన గురువులవారిని చూచి -

"అయ్యా! నేను భిక్షాటనంచేసి పొట్ట నింపుకొంటున్నాను." అని బదులు చెప్పాడు. అందుకు ఉపాధ్యాయుడు -

"అబ్బాయీ! ఉపమన్యూ! ఇకమీదట నీవు నాకు చెప్పకుండా భిక్షను ఉపయోగించుకోకూడదు" అని పలికాడు.

ఉపమన్యువు - 'అట్లాగే' నని పలికి మామూలుప్రకారం భిక్ష ఎత్తుకొనివచ్చి, ఆ విషయం గురువులవారికి నివేదించాడు. అప్పుడు ఉపాధ్యాయుడు అతని భిక్షనంతా తాను తీసుకొన్నాడు. అందులకు ఉపమన్యువు సరేనని చెప్పి, మళ్ళీ తాను పశువులను మేపడానికై వెళ్ళాడు. ఆవిధంగా పగలంతా పశువులను మేపి, ప్రొద్దుకూకేవేళకు గురువుగారి ఇంటికి చేరుకొన్నాడు. గురువుల ఎదుట నిలువబడి ఆయనకు

నమస్కరించాడు. అప్పటికీ ఉపమన్యువు పుష్టిగా - బలిసి ఉండటం చూచి ఉపాధ్యాయుడు -

"నాయనా! ఉపమన్యూ! నీవు అడిగి తెచ్చుకొన్న భిక్ష యావత్తూ - నీకు లేకుండా నేనే తీసుకొంటున్నాను కదా! మరి ఇప్పుడు నీవు ఎట్లా జీవిస్తున్నావు? నీ శరీరం ఏమాత్రం చిక్కినట్లు కనుపించడం లేదే!"- అని అడిగాడు.

అప్పుడు ఉపమన్యువు గురువుగారినిచూచి—"స్వామీ! మొదట అడిగి తెచ్చుకొన్న భిక్ష తమకు ఇచ్చివేస్తున్నాను. మళ్ళీ రెండవసారి వెళ్ళి నేను భిక్ష యెత్తుకొంటున్నాను. దానితో పొట్ట నింపుకొంటున్నాను!" అని చెప్పాడు.

అందులకు ఉపాధ్యాయుడు మళ్ళీ—

"అబ్బాయీ! ఇది న్యాయమైన గురుకుల వృత్తి కాదు. నీవు, భిక్ష యెత్తుకొని బ్రతుకుతూ తక్కినవారి జీవనోపాధికి భంగం కలిగిస్తున్నావు. కనుక నీ వీ విధంగా ప్రవర్తిస్తే లోభివి అయిపోతావు"—అని పలికాడు.

అప్పుడు ఉపమన్యువు—"అట్లాగే స్వామీ! ఇక మీదట భిక్ష యెత్తను"—అని బలికి మళ్ళీ మామూలుగా గోవులను కాయబోయినాడు.

ఆవిధంగా పశువుల మేపుకొని మరల గురువుగారి ఇంటికి వచ్చి, ఆయన ఎదుట నిలుచుని నమస్కరించాడు. అప్పటికీ అతను బలిసియే ఉండడంచూచి ఉపాధ్యాయుడు యీ విధంగా అడిగాడు—

"నాయనా! ఉపమన్యూ! నీ భిక్ష యావత్తూ నేనే తీసుకొంటున్నాను. మళ్ళీ నీవు రెండవ తడవ భిక్ష యెత్తడం

లేదు. అయినప్పటికీ నీవు ఏమాత్రము చిక్కిపోలేదు. మరి ఎట్లాజీవిస్తున్నావు నాయనా?"—

గురువుగారు అడిగిన ప్రశ్నకు ఉపమన్యువు—"స్వామీ! నేను ఈ ఆవులపాలతో బ్రతుకుతున్నాను"—అని చెప్పాడు.

అప్పుడు ఉపాధ్యాయుడు—"అబ్బాయి! ఇది తగిన పనికాదు. ఈ ఆవులపాలు త్రాగమని నేను నీకు అనుజ్ఞ ఇవ్వలేదు"—అని పలికాడు.

అందులకు ఉపమన్యువు—"చిత్తం, అట్లాగే చేస్తానండి స్వామీ. పాలు త్రాగనులెండి"—అని ఒట్టుపెట్టుకొని మళ్ళీ ఆలమందను మేపడానికై వెళ్ళాడు. వెళ్ళి యథావిధిగా ఆవులను మేపుకొని తిరిగి సాయంత్రానికి ఇల్లుచేరి గురువుగారికి నమస్కరించాడు.

అప్పుడు ఉపాధ్యాయుడు అతడింకనూ పుష్టిగానే వుండడం చూచి—"అబ్బాయీ! ఉపమన్యూ! నీవు తెచ్చుకొంటున్న భిక్ష నాకే యిస్తున్నావు. రెండవసారిన భిక్ష యెత్తడంలేదు. పాలుకూడా త్రాగటంలేదు. అయినప్పటికీ నీవు మనిషివి వరిముల్లువాసికూడా తగ్గలేదు. మరి ఇప్పుడు ఏం తిని ఉంటున్నావు?"—అని ప్రశ్నించాడు.

అందులకు ఉపమన్యువు ఉపాధ్యాయులవారితో సవినయంగా—"అయ్యా! ఈ ఆవుదూడలు తల్లుల పొదుగులో పాలుత్రాగేటప్పుడు బయటికి నురుగు వెళ్ళగ్రక్కుతున్నాయి. ఆ నురుగుత్రాగి బ్రతుకుతున్నాను!"—అని సమాధానం చెప్పాడు.

అప్పుడు ఉపాధ్యాయుడు మళ్ళీ అతనితో—

"అబ్బాయీ! నీవు ఈ రీతిగా ప్రవర్తించి నోరులేని దూడల జీవనానికి భంగం కలిగిస్తున్నావు. ఇకమీదట నీ వా నురుగుకూడా త్రాగకూడదు"— అని పలికాడు.

అందులకు ఉపమన్యువు—"చిత్తం-అలాగే, త్రాగను"— అని ప్రతిజ్ఞచేసి మళ్ళీ ఆవులను కాయబోయినాడు.

గురువుగారు నిషేధించడంవలన ఉపమన్యువు భిక్ష తినడంలేదు. రెండవతడవ భిక్ష ఎత్తడంలేదు. పాలు త్రాగడం లేదు. నురుగునూ్నా ఉపయోగించడంలేదు. ఆ విధంగా ఉపమన్యువు నిరాహారుడై గోవులను కాస్తూవచ్చాడు.

ఇట్లావుండగా ఒకనాడు అతనికి అడవిలో మిక్కిలి ఆకలి బాధ కలిగినది. ఆబాధకు తాళలేక అతను అక్కడ కనుపించిన జిల్లేడాకులను తిన్నాడు. ఉప్పు, చేదు, కారం, కటువు అయి జీర్ణమయ్యేసమయంలో అతివేడిని, తాపాన్నిపుట్టించే ఆ జిల్లేడాకులు తినడంవలన ఉపమన్యుకు కళ్ళుపోయి గ్రుడ్డివాడైనాడు. ఆ విధంగా గ్రుడ్డివాడై దారీ-తెన్నూ తెలియకుండా తిరుగుతూ ఒకచోట ఒక బావిలో పడినాడు.

అంతట ప్రొద్దుక్రుంకింది. ఇక్కడ ఉపాధ్యాయుడు ఉపమన్యువు ఇంకా యిల్లుచేరకుండా ఉండడంచూచి తన శిష్యులను పిలిచాడు—"నాయనలారా! ఉపమన్యుని జీవనోపాధులన్నింటిని నేను వద్దని నిషేధించాను. కాబట్టి వాడికి నామీద కోపం వచ్చివుంటుంది. కాబట్టి ప్రొద్దుననగా వెళ్ళి ఇంతవరకూ ఇల్లుచేరలేదు. ఇప్పుడు మనం వానిని వెదకాలి—"

అని చెప్పి శిష్యులను వెంటతీసుకొని అరణ్యానికి వెళ్ళాడు. అక్కడ అతనిని వెదకుతూ —

"నాయనా! ఉపమన్యూ! ఎక్కడున్నావు [illegible], [illegible] రా నాయనా!"— అని బిగ్గరగా గొంతెత్తి పిలిచాడు.

ఉపాధ్యాయులవారి పిలుపు, నూతిలో పడి ఉన్న ఉపమన్యువుకు వినిపించింది. అతనుమళ్ళీ బిగ్గరగా గొంతెత్తి—

"అయ్యా! నేను నూతిలో పడి ఉన్నాను—" అని అరిచాడు.

అందులకు ఉపాధ్యాయుడు మళ్ళీ— "నువ్వు నూతిలో ఎట్లా పడ్డావు?" అని అడిగాడు.

అప్పుడు ఉపమన్యువు— "జిల్లేడాకులు తిని, గ్రుడ్డివాడి నయ్యాను. అటు-ఇటు తిరుగుతూ కళ్లు కనుపించక నూతిలో పడినాను—" అని బదులు చెప్పాడు.

అంతట ఉపాధ్యాయుడు— "నాయనా! అశ్వినీదేవతలను స్తోత్రంచెయ్యి. వారు దేవవైద్యులు. నీకు తిరిగి మళ్ళీ కళ్ళు వచ్చేటట్లు చేస్తారు—" అని సలహా చెప్పాడు.

అప్పుడు ఉపమన్యువు, గురువులు చెప్పినప్రకారం అశ్వినీదేవతలను ఋక్కులతో స్తుతించడం మొదలుపెట్టాడు:

"ఓ అశ్వినీదేవతలారా! మీ ఇరువురిగుణాలను వర్ణించడానికి, మిమ్ములను స్తుతించడానికి నాకు శక్తి చాలదు. నేను కళ్ళులేనివాడను. దారి తెలియక ఎంతో బాధపడుతున్నాను. దుర్గమమైన ఈ కూపంలో పడిపోయాను. మిమ్ములను శరణు వేడుకొంటున్నాను. ఇక మీరే నాకు దిక్కు—" అని ఈ

విధంగా ఉపమన్యువు పెక్కు-భంగుల అశ్వినీదేవతలను స్తోత్రం చేశాడు.

అప్పుడు అశ్వినీదేవతలు ఉపమన్యుని స్తోత్రానికి మెచ్చి అక్కడికి వచ్చారు.

"నాయనా! నీ స్తుతికి సంతోషించాం. ఇదిగో, అపూపము. దీనిని భక్షించు. నీకు మేలు చేస్తుంది-" అని పలికారు.

అంతట ఉపమన్యుడు- "మహాత్ములారా! మీవచనం వ్యర్థంకాదు. అయినప్పటికీ మా గురువర్యులతో చెప్పకుండా నేను అపూపమును భక్షించజాలను" అని చెప్పాడు.

అంతట అశ్వినీదేవతలు అతనితో —

"నాయనా! ఇంతకుముందు మీ గురువుగారు ఈ విధంగానే మమ్మల్ని స్తుతించారు. మేము మతనికి అపూపం ఒసగాం. అతను తన గురువర్యులకు నివేదించకుండానే దానిని భక్షించాడు. కనుక నీ ఉపాధ్యాయుడు చేసినట్లుగానే నీవున్నూ చేయవలసినది-" అని వచించారు.

అందులకు ఉపమన్యువు వారినిచూచి —

"మహాత్ములారా! ఈ విషయంలో అశ్వినీదేవతలైన మిమ్మల్లను మళ్ళీ వేడుకొంటున్నాను. నేను మా గురువర్యులకు నివేదించక ఈ అపూపమును ఎంతమాత్రం ఉపయోగింపజాలను-" అని ప్రార్థించాడు.

అప్పుడు అశ్వినీదేవతలు —

"నాయనా! నీ గురుభక్తికి మేము ఎంతో సంతోషించాము. నీ గురువుగారికి ఉక్కుదంతా లున్నాయి. నీకు బంగా

రపు సంతానాలు ఉండగలవు. నీకు మళ్ళీ కళ్ళు రాగలవు. సకల శ్రేయములున్నూ పొందగలవు–" అని వరం ఒసగాడు.

అంతట ఉపమన్యువుకు మళ్ళీ కళ్లువచ్చాయి. వెంటనే అతను అక్కడనుంచి తన ఉపాధ్యాయులవారివద్దకు వచ్చాడు. ఆయనకు నమస్కారంచేసి జరిగిన విషయమంతా చెప్పాడు. అప్పుడా గురువర్యులు శిష్యుని భక్తికి సంతసించినవారై —

"నాయనా! ఉపమన్యూ! అశ్వినీదేవతలు చెప్పినట్లుగా నీకు సకల శ్రేయస్సులూ సమకూడగలవు. సమస్త వేదాలూ, సకల ధర్మశాస్త్రాలూ నీలో ప్రకాశించగలవు–" అని పలికాడు.

---

## 4. అజగరోపాఖ్యానము

అంతట జనమేజయునకు వైశంపాయను డీవిధంగా చెప్ప దొడగాడు ;

ఉగ్రధన్వులగు పాండవులు వృషపర్వుడనే రాజర్షి ఆశ్రమంనుండి మరలివచ్చి, అనేక అద్భుతాలకు ఆలవాల మగు ఆ వనంలో నివసిస్తున్నారు. అట్లా ఉండగా వారిలో ధనుష్పాణియు, బద్ధఖడ్గుడు అయిన భీమసేనుడు దేవగంధర్వ సేవితమై, అత్యంతరమణీయమై అలరారుచున్న ఆ వనమంతయు కాంచాడు. దేవర్షులకు, సిద్ధులకు, అప్సరసలకు నిలయమైన హిమవంతప్రాంతములను చూచాడు. బహుళచ్ఛాయ ములై, మనఃప్రీతిదములై, నయనానందకరములై, హిమసం

స్పర్శ కోమలములై, నిత్యం పుష్పఫల సమృద్ధములై, చకోర కోకిలాది శకుంతసంతాన సేవితములై శోభిల్లుతున్న వృక్షా లను అందంను తిలకించాడు. నైమాల్యనుణి సన్నిభములు, హంసకారండ వాయుతములు, హేమసంకాశములు అయిన జలములతో నిండిఉన్న కొండయేఱులను, మేఘములవలలో ఉన్నట్లు హరిచందన మిశ్రములైన దేవదారు వనాలను అవ లోకించాడు. మహాబలుడగు భీమసేనుడు మహవనాలలందు అనేక మృగముల వెంటపడ్తులుచూ, మృగములను, వరాహ ములను, మహిషములను, కనుపించినవాటిని కనుపించినట్లుగా సంహరిస్తూ సంచరించసాగాడు. వందమంది ఒక్కసారిగా వచ్చి పైబడినప్పటికీ నిలువరించుకోనజాలిన మహాబలుడగు భీమసేనుని వేగానికి వృక్షాలన్నీ ఒక్కసారిగా పెకలింప బడినాయి. స్వపరాక్రమవ్యోతకములగు నినాదాలతో అతడా ప్రదేశాలను, వనాలను నింపివేశాడు. అతని అడుగులకు కొండ గుహాలలోని మహాసత్త్వసంపన్నములగు ఏనుగులు, సింహాలు కూడా అదరి, బెదరి గుహాలనుండి బయటికి వచ్చాయి. కొన్ని పారిపోయినాయి. మరికొన్ని కదలలేక అక్కడనే నిలిచిపోయినాయి. పెద్ద పెద్ద సర్పాలు సహితం జరజర ప్రాకి పోయినాయి.

అంతట ఆ పర్వత గుహాంతరాళమున ఇంతమించు కొండంత శరీరమును, నాల్గు కోఱలును, గుహాసదృశమగు వక్త్రమును కలిగి పసుపుపచ్చని మిసిమిని విరజిమ్ముతూ బుస్సు బుస్సని బుసలు విడుస్తూ సర్వభూతములకు వెరపు పుట్టిస్తూ

అజగరమనే మహాసర్పం ఒకటి భీమసేనుని కంట పడింది. అంతట ఆ సర్పం భీముని చెంతకు ప్రాకి బలిమినై అతని భుజములను చుట్టివైచింది. ఆ మహానాగం భీమసేనుని గాత్రం స్పృశించి నంతనే అతను స్పృహ తప్పిపోయినాడు. పదివేల ఏనుగుల బలం ఆచికొనిన భీముడు ఆ భుజగగ్రాహానికి వశీకృతుడైనాడు. అవయవం కదుపుటకు కూడా [illegible] నాడు. అంతటి బలం ఏమైపోయిందో తెలియదు. దాని పట్టు వదలించుకోడానికై భీమసేనుడు ఎంతో పెనగులాడాడు. కాని అతని ప్రయత్నమంతా వ్యర్థమైపోయింది. తనకుగల [illegible] బలం అంత స్వల్పకాలంలో వ్యర్థమైపోయినందులకు భీమసేనుడు మిక్కిలి విస్మయం చెందాడు. ఆ సర్పంతో ఈ విధంగా పలికాడు :

"అయ్యా! నీ వెవడవు? నన్ను నీవు ఏం చెయ్య దలచుకొన్నావు? నేను పాండవుడను. ధర్మరాజు [illegible] వాడను. నా పేరు భీమసేనుడు. పదివేల ఏనుగుల బలంగల నేను ఇప్పుడు నీ కీ విధంగా వశుడనైనాను. సింహ వ్యాఘ్ర వరాహ మహిషము లెన్నో వెనుక నా వేగానికి తాళలేక నేల కొరిగాయి. రాక్షసులు, పిశాచులు, పన్నగులు ఎందరో నా వేగాన్ని నిలువద్రొక్కుకొనలేక పోయినారు. ఇదేమిటి? నేను ఎంతగా పెనగులాడి నప్పటికీ నీ పట్టు వదలించుకో లేకుండా ఉన్నానే! ఇంతటి శక్తి నీ కెట్లా వచ్చింది? ఏమైనా వరదానంచే లభించిందా? లేక మరి యే విద్య అయినా నేర్చావా నీవు? నీచే నా బలమంతా నిరుపయోగ మవటం, విచారించి చూస్తే, మానవులు పరాక్రమవంతు లన్నమాట

అసత్యమని నాకు తోస్తున్నది"— అని ఈవిధంగా భీమ సేనుడు పలుకుతుండగానే ఆ సర్పం తన పడగనంతా విప్పి అతని శరీరం చూస్తూ చుట్టివైచింది. అతని భుజములను మాత్రం వదలివేసింది.

అంతట ఆ సర్పం భీమసేనునితో ఈవిధంగా అన్నది: "ఎంతో కాలంగా ఆకలితో అలమటిస్తున్న నాకు పారణగా నిన్ను దేవతలు నాకు నిర్దేశించారు. ఈ సర్పరూపం నా కెట్లా వచ్చిందీ నీకు చెప్పదలచుకొన్నాను. మహాత్ముల శాపమే నన్నీస్థితికి తెచ్చింది. నహుషుడను ప్రసిద్ధుడగు రాజన్న పేరు నీవు వినే ఉంటావు. అతడు నీకు, నీ పూర్వులకును పూ పూర్వుడు. ఆయువు వంశాన్ని నిలవబెట్టిన పుత్రుడను ఆ నహుషుడనే నేను. అగస్త్యులవారి శాపం, బ్రాహ్మణావ మానం, నన్నీస్థితికి తీసికొని వచ్చాయి. నా విషయంలో దైవం ఎట్లా ప్రతికూలమైనాడో పరికించు. మరి ఇప్పుడు నీవు నాకు లభ్యమైనావు. నీవు నాకు దాయాదివి. ప్రియదర్శనుడవు. అయినప్పటికీ నిన్ను నేను నా అవసరానికి ఉపయో గించుకోనున్నాను. విధివిధానం ఎట్లా ఉన్నదో చూడు! ఏనుగుకానీ, మహిషంకానీ – ఏదైనాసరే, నాచే పట్టుబడిన దేదీ ఇంతవరకుూ ఎన్నడూ ముక్తినొంది ఉండలేదు. ఇక ముందు ఉండబోదుకూడా. ఇది నాకు దేవత లిచ్చిన వరం. తిర్యగ్యోనిస్థమైన సర్పంచే పట్టువడినానని నీవు చింతించపని లేదు. విమానంనుండి భ్రష్టుడనై భూలోకానికి పడిపోతున్న నేను – మునిసత్తము డగు ఆ అగస్త్యుని, నా శాపానికి అంత మెప్పుడని అడిగాను. అంత కరుణకోపి అగు అగస్త్యుడు నాపై

ఇంచుక జాలిగొని – కొంతకాలం గడచిన పిమ్మట నీకు మోక్షం లభిస్తుందని పలికాడు. అంతట నేను భూమిపై పడిపోయాను. కాని జరిగిన వృత్తాంతం మాత్రం సంస్కార రూపమున నా మనస్సులో నిలచి ఉన్నది. నీ వడిగిన ప్రశ్న లకు విచక్షణాయుతంగా ఎవడు ప్రత్యుత్తరం ఇస్తున్నాడో వాడే నీకీ జన్మమునుండి మోక్షం ప్రసాదించగలడని ఆ మహర్షి నాతో చెప్పాడు. 'నీవు పట్టుకొన్నచో ఎంతటి బల వంతుడికైనాసరే తక్షణం సత్త్వం క్షీణిస్తుంది. అది అనువుగా గొని ఆ జంతువును ఆహారంగా గైకొనవచ్చు' నని దయా శీలురగు ఆ బ్రాహ్మణులు పలికిన పలుకులు ఇప్పటికీ నా కిప్పుడు జ్ఞాపకం ఉన్నాయి. ఇంకేమున్నది ? నరక ప్రాయమగు ఈ సర్పజన్మం ఎత్తి కదల్లేక-మెదల్లేక దీనినుండి విముక్తి పొంద డం ఎట్లాగ అని, అనుకూలమగు అవకాశంకొఱకు ఎదురు- తెన్నులు చూస్తూ కాలం వెళ్ళబుచ్చుతున్నాను'' – అని ఈవిధంగా సర్పం చెప్పిన మాటలు విని, మహాబాహువగు భీమసేనుడు ఆ భుజంగంతో మరల ఈరీతిగా పలికాడు :

''ఓ సర్పరాజా ! నీపై నాకెట్టి కోపమున్నూ లేదు. నా బలాన్నికూడా నిందించుకొనడంలేదు. మానవుడికి సుఖ దుఃఖాలు వచ్చినప్పుడు, ఆపదలు సంభవించినప్పుడు, మనస్సును క్లేశపెట్టుకొని ప్రయోజనంలేదు. పురుషకారంచే దైవాన్ని ఎవడు వంచించగలుగుతాడు ? దైవమే బలీయ మనీ, పురుషార్థం నిరర్థకమనీ నాకు తోస్తున్నది. భుజ వీర్యముపైనసే ఆధారపడిన, నాకు దైవోపహతిచే ఎటు వంటి అవస్థ సంప్రాప్తించిందో చూడు ! నేను ఈవిధంగా

అయినాననికూడ నాకు బెంగలేదు. రాజ్యభ్రష్టులై, అర ణ్యాలపాలయిన నా సోదరుల పరిస్థితి నాకు దుఃఖం కలి గిస్తున్నది. ఈ హిమవత్పర్వతారణ్యాలు ఎన్నెన్నో యక్ష రాక్షస సంకులమై ఉన్నాయి. నేను కనుపించనిచో నా సోదరులు నాకొఱకు వెదకుతూ అల్లాడిపోతారు. నేను మరణించుట విని ధర్మశీలురగు నా సోదరులు హతాశు లవుతారు. రాజ్యకాంక్షి అగు దుర్యోధనునిచే పలుబాధ లకు లోనవుతారు. కాని నాకొక్క ధైర్యం ఉన్నది. సర్వాస్త్ర విదుడు, దేవగంధర్వ రాక్షసులకుకూడ అప్రధృష్యుడు అయిన అర్జును డున్నాడు. అతడు ఇంద్రునిసహితం స్థాన భ్రంశము నొందింపగల సమర్థుడు. అట్టి అర్జునుడికి, సమస్త లోకానికీ విరోధి, దంభమోహపరాయణుడు అయిన దుర్యో ధనుడు ఒక లెక్క-కాదు. కాని ఎల్లప్పుడూ మాకు శుభము లెప్పుడౌదవునా అని ఎదురు-తెన్నులు చూస్తున్న మా తల్లి ఉన్నదే-ఆమె నా ఈ పరిస్థితి తెలిసి ఎంతగా వాపోతుందో కదా! నేను లేకుండాపోయినట్లయితే, ఆమె నాపై పెట్టు కొన్న ఆశలన్నీ నిష్ఫలములే కదా? నకులుడు, సహదేవుడు నా బాహుబలంచే ఎల్లప్పుడూ సురక్షితులయి ఉన్నారు. ఇప్పుడు నేను వారివద్ద ఉండకపోవటంవల్ల వారి ఉత్సాహ మంతా అడుగంటుతున్నది. వారి బలపరాక్రమాలకు తగిన రాణింపులేకుండా పోతున్నది, అయ్యో, ఏంచెయ్యను?"- అని ఈ తీరుగా భీమసేనుడు, పెక్కు- భంగుల విలపించాడు. కాని ఆ భుజంగం పట్టునుండి మాత్రం తప్పించుకోలేక పోయి నాడు.

ఇక ఇక్కడ ధర్మరాజు అనేక దుర్నిమిత్తములను పొడగాంచి అస్వస్థచిత్తుడైనాడు. కాకి వెనుకనుండి 'కాకా' అని అరుస్తూ ఆతనికి సమీపంగా ఎగిరింది. అంతలో ఆతని కుడిభుజం పదేపదే అదరసాగింది. అతని వామచరణం సంచలించింది. గుండె అదేపనిగా కొట్టుకొనసాగింది. ధర్మజుడు అంతులేని ఆందోళన చెందాడు. ద్రౌపదిని కాంచి భీముడు ఎక్కడున్నాడని అడిగాడు. ఇల్లువెడలి చాల సేపైనను ఇంకనూ మరలి రాలేదని ఆమె బదులు చెప్పింది. వెంటనే ధర్మరాజు ఆశ్రమంనుండి బయల్వెడలి భీమసేనుని వెదక నారంభించాడు. తూర్పుదిశగా నడుస్తూ చచ్చి పడిఉన్న అనేక మృగ సమూహాలను, సింహ నిచయాలను చూచాడు. భగ్నములై పడిఉన్న అనేక వృక్షాలను విలోకించాడు. అవి భీముని వీరవిహార చిహ్నాలని గుర్తించాడు. ఆ గుఱుతులను అనుసరించి పోసాగాడు. పోయిపోయి ఒక కొండగుహను చూచాడు. అంతట ఆకులులేని చెట్లతో వ్యాపించిఉన్న దిన్నీ, రాళ్ళు, ద్రోణులు, పొట్టికొమ్మలు, ఊషలుగల గుల్మ ద్రుమాకులతో కప్పబడినదిన్నీ అయిన ఆ పర్వతగుహాయందును భుజగేంద్రునిచే చేష్టలు దక్కిఉన్న భీముని కాంచాడు. ఆ విధంగా సర్పంయొక్క పడగచే చుట్టుకొనబడిన ప్రియ సహోదరుని కాంచి యుధిష్ఠిరుడు -"అయ్యో! ఇటువంటి ఆపద నీకెట్లా వాటిల్లింది? పర్వతమంత పెద్ద ఆకారంగల ఈ పన్నగోత్తము డెవ్వడు?" అని అడిగాడు. అంతట భీమసేనుడు అగ్రజునకు యా వద్వృత్తాంతం సంగ్రహంగా ఎరింగించాడు.

అప్పుడు ధర్మరాజు సర్పరాజును చూచి -

"అయ్యా! విక్రమసంపన్నుడైన నా తమ్ముని వదలి పెట్టవలసినది. నీ ఆకలి తీరేటందుకు వేరొక ఆహారాన్ని సమర్పించుకొంటాము" అని ప్రార్థించాడు.

అందులకు సర్పరాజము—"ఈ రాజపుత్రుడే నాకు ఆహారం అవుతున్నాడు. ఇవాల్టికి నీవు ఇంటికివెళ్ళు— రేపటిదినం నీవు కూడా నాకు ఆహారం కావచ్చును. నేనున్న ప్రాంతాలకు ఎవరు వస్తున్నాడో వాడే నాకు ఆహారం అగునట్లు నాకు వరం ఉన్నది. నేడు నేను ఇతనిని విడువను. వేరొకరు నాకు అక్కరలేదు—" అని సమాధానం చెప్పింది.

అప్పుడు యుధిష్ఠిరుడు ఆ సర్పరాజమును మరల ఈ రీతిగా ప్రశ్నించాడు –

"అయ్యా! నీవు దేవతలలో ఒకడవా? దైత్యుడవా? పన్నగుడవా? నీ సత్యమైన రూపాన్ని నాకు ఎరింగించవలసినది. నీవు భీమసేనుని ఏల చుట్టుముట్టావు? నేను ఏంచేస్తే నీవు సంతసించనున్నావు? నీకు దేనిని ఆహారంగా సమర్పిస్తే ఇతనిని విడిచిపెడతావు?"

అందులకు సర్పము ఈవిధంగా సమాధానం చెప్పింది—

"నేను నహుషుడనే రాజును. నీకు పూర్వుడను. ఆయువునకు అయిదవ కుమారుడను. అనేక క్రతువులు చేశాను. అధ్యయనం ఒనర్చాను, ఇంద్రియాలు నిగ్రహించుకొన్నాను. కదనరంగంలో పరాక్రమం చూపాను. మూడులోకముల ఐశ్వర్యాన్ని చూరగొన్నాను. ఆ ఐశ్వర్యంవలన నా దర్పానికి అవధిలేకుండా పోయింది. వేయిమంది బ్రాహ్మణోత్త

ములు నా పల్లకీని మోసే బోయీలైనారు. నా కన్నులు పొరలు కమ్మాయి. నేను వారిని ఎంతో అవమాన పరిచాను. అప్పుడు అగస్త్యుడను ఋషి నన్ను శపించగా, నాకీ సర్పత్వం సంప్రాప్తించింది. కాని పూర్వజన్మసంస్కారం నశించలేదు. ఇప్పుడితను నాకు సకాలంలో ఆహారంగా లభించాడు. కావున నేను ఇతనిని విడువను. ఇంకొకటి నా కవసరంలేదు. కాని నే నడిగిన ప్రశ్నలకు తృప్తికరంగా సమాధానం చెప్ప గలిగితివేని, నేను నీసోదరుని విడిచిపుచ్చుతాను."

అంతట యుధిష్ఠిరుడు ఈవిధంగా పలికాడు –

"సర్పరాజా! నీవు అడగదలచుకొన్న ప్రశ్నలను యథేచ్ఛగా అడగవలసినది. నా శక్తికొలది సమాధానం చెప్ప ప్రయత్నిస్తాను."

అప్పుడు సర్పం ఈరీతిగా అడిగింది –

"ఓ యుధిష్ఠిరుడా! బ్రాహ్మణు డనగా ఎవ్వరు? ప్రపంచంలో తెలిసికొనదగినది ఏది?– వీటికి నీవు చెప్పే సమాధానాలనుబట్టి నీ బుద్ధికుశలతను ఊహించుకొంటాను."

అందులకు యుధిష్ఠిరుడు ఈవిధంగా బదులు పలికాడు–

"ఓ సర్పరాజా! నీవడిగిన ప్రశ్నలకు సమాధానం చెపుతున్నాను వినవలసినది – సత్యం, దానం, క్షమ, శీలం, అనృశంస్యం, తపస్సు, దయ– ఇవి ఎవరిలో కన్పిస్తున్నాయో అతనే బ్రాహ్మణు డని చెప్పబడుతున్నాడు. దేనిని పొంది మానవుడు శోకమునకు లోనుకాడో, అట్టి సుఖ దుఃఖ రహిత

మయిన బ్రహ్మమే తెలిసికొన దగినది. దీనికి నీవేమంటావో తెలిసికొనగోరుతున్నాను.''

అంతట సర్పం ఇట్లా పలికింది –

''అవుతే మరి, శూద్రులలోకూడ నా నృశంస్యము, అక్రోధము కనుపిస్తున్నాయి. అంతేకాదు. చాతుర్వర్ణముల వారికీ లక్ష్యభూతమై, సత్యమై, ధర్మవిషయమునకూడ పరమ ప్రమాణమై ఒప్పు వేదజ్ఞానంకూడ శూద్రులలో గోచరిస్తున్నది. అప్పుడు వర్ణాలను ఏర్పరచడం ఏవిధంగా సాధ్యం అవుతుంది? ఇక ఈ సుఖేతరమును, దుఃఖరహితమును అగు పదార్థం. ఏదో అది అవేద్యం అనిచెప్పావు. అటువంటిపదార్థం లోకంలో నాకు అగుపించుటలేదే! ఓ యుధిష్ఠిరుడా! దీనికేం సమాధానం చెపుతావు?''

అప్పుడు ధర్మరాజు మరల ఈ విధంగా ప్రత్యుత్తరం ఒసగాడు –

''ఓ పన్నగ శ్రేష్ఠుడా! నీ వడిగిన అర్థం చెపుతున్నాను, వినవలసినది– శూద్రునిలో ఈ గుణా లున్నట్లయితే అతడు శూద్రుడుకాడు. బ్రాహ్మణునిలో ఈ గుణాలు లేనట్లయితే అతను బ్రాహ్మణుడు కాడు. ఈగుణాలు ఎవనియందు గోచరిస్తున్నాయో అతడే బ్రాహ్మణశబ్ద వాచ్యుడు. ఇవి లేనివానిని శూద్రుడనే చెప్పవలసి ఉన్నది. ఇక నీ రెండవ ప్రశ్న విషయమై నీకు కలిగిన శంక నిజమే అని స్థూల దృష్టికి అనిపిస్తుంది. కాని లోకంలో శీతాభావములే ఉష్ణత్వాన్ని, తదభావములే శీతత్వాన్ని గుర్తిస్తున్నట్లుగా, సుఖాభావముచే దుఃఖాన్ని, దుఃఖాభావముచే సుఖాన్ని గుర్తించ వీలవుతు

న్నది. కాని పరమార్థమున కేవలం సుఖమనిగాని, కేవలం దుఃఖమనిగాని లోకంలో లేదు. కాబట్టి సుఖైకభాగమున్ను, దుఃఖరహితమున్ను అగు తత్త్వ ముండుట అసంభవంకాదు."

అప్పుడు సర్పం యీరీతిగా పలికింది—"ఓ రాజా! విదితవేద్యుడవైన నీ వచనాలు విన్నపిమ్మట భీమసేనుని భక్షింప బుద్ధిపుట్టడంలేదు"—అని ఈవిధంగా పలికి భీముని తన పట్టునుండి విడిచిపుచ్చింది.

అంతట యుధిష్ఠిరుడు ఇట్లా అన్నాడు—"అహీంద్రా! నీవు వేదవేదాంగపారంగతుడవు. ఏ కర్మ ఆచరిస్తే మానవు డికి సద్గతి లభిస్తుందో అనుగ్రహించి నాకు తెలుపవలసినది."—

అందులకు సర్పం ఇట్లా బదులుచెప్పింది—"ఓ రాజా! ఎవడు సత్పాత్రదానం చేసి, ప్రియవచనాలు పలికి, సత్యం వచించి, అహింసా నిరతుడై ఉంటున్నాడో - వాడు సద్గతి పొందగలడని నా అభిప్రాయం."—

అంతట ధర్మరాజు మరల ఈరీతిగా అడిగాడు :—

"ఓ సర్పశ్రేష్ఠుడా! అట్లా అవుతే—దానం, అహింస, సత్యనిరతి, ప్రియభాషణము—వీటిలో యేది మిన్న? చెప్ప వలసినది."—

అందులకు సర్పం ఇట్లా సమాధానం చెప్పింది :—

"ఓ రాజా! దానం, అహింస, సత్యనిరతి, ప్రియభాష ణము—వీటిలో ఏ ఒక్కటీకూడా ఎక్కువని చెప్పడానికి వీలు లేదు. కార్యగౌరవాన్ని బట్టి వాటిని నిర్ణయించవలసి వుంటుంది. ఒకప్పుడు అహింసకును, మరొకప్పుడు దానము

నకును, కార్యగౌరవాన్ని బట్టి ప్రాధాన్యము యేర్పడుతూ వుంటుంది.

అప్పుడు ధర్మరాజు మరల ఇట్లా ప్రశ్నించాడు :—

"అయ్యా ! ఇంతటి బుద్ధిమంతుడవగు నీకు మోహం ఎట్లా దాపురించింది ?"—

అందుకు సర్పం ఈవిధంగా బదులు చెప్పింది :—

"ఓ రాజా ! ఎంతటి ప్రజ్ఞావంతుడుకూడ సుఖాలు మరగినట్లైతే—మోహం అతనిని విజితుణ్ణిచేస్తుంది. నా విషయమే చూడు ! ఐశ్వర్యమదంవల్లనే కదా నేను పతితుడనయ్యాను. సత్పురుషుడవైన నీవంటివానితో సంభాషణం చేసి నా శాపానికి అవసానదశను పొందాను. దివ్యవిమానంలో లోకాలన్నీ సంచరించే నాకు దూరదృష్టి నశించిపోయింది. త్రైలోక్యవాసులైన బ్రహ్మర్షులు; దేవ, యక్ష, రాక్షస, కిన్నరులుకూడ నాకు పన్నులు చెల్లించుకొన్నారు. నా దృష్టిపథంలో ఎవడు పడినాసరే, వాడి శక్తి ఆ క్షణంలోనే క్షీణిస్తున్నది. అది నా దృష్టిబలం. బ్రహ్మర్షి సహస్రము కూడ నా పల్లకిమోసే దుర్గతికి వచ్చారు. ఆ దుర్నీతియే నా యీ భ్రంశమునకు హేతువు. ఒకనాడు అగస్త్యుడు నా శిబికను మోస్తుండగా నా పాదం ఆయన శిరస్సుకు తగిలింది. అప్పుడతను క్రుద్ధుడై నన్ను సర్పరూపం పొందమని శపించాడు. ఆ శాపంవలన వెంటనే విమానంనుండి అధోలోకమున పడుతూ, అప్పుడే శాపవిముక్తి వేడాను. అంతట అగస్త్యుడు నా యందు దయదలచి 'నీ యీ అహంకారానికి ఫలం అవసానము నొందగనే—నీవు యథాస్థితి పొందగల'వని

పలికాడు. అంతటి ఉత్తమవంశంలో జన్మించి, ఇట్టి స్థితిని పొందిన నాకు ఒక్క విషయం యదార్థంగా తోస్తున్నది. సత్యము, దమము, దానము, అహింస, ధర్మనిష్ఠ—ఇవే నరు లకు ఉత్తమస్థితిని సాధించిపెడతాయి. జాతిగాని, కులంగాని యందు ఉపకారికాదు. ఓ రాజా! నీకు శుభమగుగాక! ఇదుగో నీ తమ్ముడు భీమసేనుడు. నీతో సంభాషించడంవల్ల నాకు దివ్యరూపం సంప్రాప్తించింది. ఇక నేను వెళ్లు తున్నాను”—అని ఈ విధంగా పలికి నహుషచక్రవర్తి శాప విముక్తుడై అజగరదేహం విడిచి దివ్యరూపం ధరించి మరల స్వర్గానికి వెళ్ళిపోయాడు.

ఓ జనమేజయా! అంతట యుధిష్ఠిరుడు తన తమ్ముడైన భీమసేనుని విడిపించుకొని ధౌమ్యునితో మరల తన ఆశ్రమా నికి ఏగుదెంచాడు. జరిగిన వృత్తాంతమంతా అచ్చటి వారలకు నివేదించాడు. అక్కడున్న మునులు భీముని ఇక అట్టి సాహ సాలకు దిగవలదని మందలించారు. పాండవులు నిర్భయులుగా భీమసేనుని తగిన అన్నపానాదులతో తృప్తినొందించారు”— అని వైశంపాయనుడు జనమేజయునకు అజగరోపాఖ్యానం వినిపించాడు.

— —.

# 5. కృతఘ్నోపాఖ్యానము

భీష్మాచార్యులవారు ధర్మరాజుతో ఈవిధంగా చెప్ప సాగారు :

పూర్వం ఒకప్పుడు, మధ్యమదేశీయుడైన ఒక బ్రాహ్మణుడు భిక్షాటనంకోసం ఒక గ్రామానికి వెళ్ళాడు. ఆ గ్రామం ధనసమృద్ధమై ఉండడం చూచి ఆచారవంతుడుకాని ఆ బ్రాహ్మణుడు ఆ గ్రామంలో ప్రవేశించాడు. అక్కడ చాలా ధనవంతుడు, సర్వవర్ణధర్మజ్ఞుడు, సత్యసంధుడు, దాత అయిన ఒక దస్యుడు నివసిస్తున్నాడు. భిక్షాటనార్థం వెళ్ళిన బ్రాహ్మణుడు ఆ సంపన్నగృహస్థుని ఇంటికి వెళ్ళి తనకు ఉండడానికి చోటు, వార్షికభిక్ష ఇవ్వవలసిందని కోరాడు. అప్పుడా గృహస్థు గౌతము డను పేరుగల ఆ బ్రాహ్మణునకు క్రొత్త బట్టలున్నూ, భర్తలేని ఒక యువతిని సమర్పించి అతని కుటుంబానికి అవసరమైన సహాయం చేస్తూ వచ్చాడు. ఆవిధంగా ఆ బ్రాహ్మణుడు తన కుటుంబంతో అనేక సంవత్సరాలు ఆ శబర గ్రామంలో నివసించాడు. శబరులతో కలిసిపోయి పక్షులను, మృగాలను వేటాడుతూ నిర్దయుడై జీవహింసచేస్తూ వచ్చాడు. చివరకా గౌతముడు తన బ్రాహ్మణత్వాన్ని పూర్తిగా కోల్పోయి తానొక శబరునివలె సంచరించ సాగాడు.

తరువాత కొంతకాలానికి ఆ గ్రామానికి మరొక బ్రాహ్మణుడు వచ్చాడు. అతను జటాజినధరుడు. స్వాధ్యాయపరుడు. గుణవంతుడు. మితభోజనం చేసేవాడు. అతనిది కూడా గౌతముని దేశమే. పైగా గౌతమునకు మిత్రుడు,

సహాధ్యాయి. అందువలన ఆ బ్రాహ్మణోత్తముడు ఆ నిషాదుల గ్రామానికి వచ్చి, తన స్నేహితుడైన గౌతముని వెతుకుతూ తుదకు అతని ఇంటికి వెళ్లాడు. అదే సమయానికి గౌతముడు విల్లు, అమ్ములు, చేతపట్టుకొని, హంసలు మొదలైన పక్షులను చంపి మూపున పెట్టుకొని, నెత్తు రోడిసిలు కారుతున్న ఒకనితో ఇంటికి వచ్చాడు. ఆ స్నేహితు లిద్దరూ ఇంటి వాకిట్లో తారసిల్లారు. తన స్నేహితుడైన గౌతముని చూచి ఆ వచ్చిన బ్రాహ్మణుడు గుర్తు పట్టాడు.

"ఏమోయీ! నీ స్వస్థలం మధ్యమదేశమే కదా? నీ పేరు గౌతముడు గదూ? అయ్యో! ఉత్తమ బ్రాహ్మణ వంశంలో పుట్టిన నీవు ఈవిధంగా దొంగలతో కలిసి జంతు హింస చేస్తున్నావా? మీ పూర్వీకులంతా వేదం చదువుకున్నవాళ్ళు. ప్రఖ్యాతులు. వాళ్ళను. ఒక్కసారి జ్ఞాపకం తెచ్చుకోవయ్యా. అయ్యో! అటువంటి ఉత్తమ వంశంలో పుట్టిన నీవు చివరకిట్లా కులభ్రష్టుడవైనా వేమయ్యా? ఇప్పుడైనా నీ శీలం, నీ ఆచారం జ్ఞాపకం తెచ్చుకొని ఇక్కడి నుంచి రావలసినది" అని బోధించాడు.

ఆ విధంగా తన మేలుకోరి చెప్పిన స్నేహితుని పలుకులు విని గౌతముడు దుఃఖించాడు.

"ఓ స్నేహితుడా! నాకు చదువా రాదు. ధనమూ లేదు. ఇక నాకు ద్రవ్యం ఎట్లా లభిస్తుంది? అందుకని ఈ గ్రామం చేరి ఈ విధంగా అయినాను. ఇప్పుడు నీ దర్శనం వలన నా జన్మ సార్థకమైంది. నీ వీ రాత్రికి ఇక్కడే ఉండ

వలసినది. రేపటిరోజు మన ఇద్దరంకలిసే వెళ్ళిపోదాము''- అని బకుడు పలికాడు.

అంతట ఆ బ్రాహ్మణునికి దయకలిగింది. ఆ రాత్రి గౌతముని ఇంట్లోనే పడుకొన్నాడు. కాని గౌతముడు ఎంత ప్రార్థించినా అతని ఇంట్లో ఏమీ ముట్టుకోలేదు. భోజనం చెయ్యలేదు. పచ్చిగంగ త్రాగలేదు -

అని తెలిపి భీష్ముడు మళ్ళీ చెప్పసాగాడు :

## 2

ఓ, ధర్మరాజా ! ఆవిధంగా ఆ రాత్రి గడచింది. మరునటి రోజున ఆ బ్రాహ్మణుడు తన త్రోవన తాను వెళ్ళడానికై ప్రయాణమైనాడు. గౌతముడుకూడా అక్కడనుంచి బయలుదేరి వెళ్ళి సముద్రతీరం చేరవలె చేరుకున్నాడు. అక్కడొక వర్తకుల గుంపునుచూచి తానున్నూ ఆ గుంపుతో కలిసి సముద్ర ప్రాంతానికి సాగిపోతున్నాడు. మార్గమధ్యంలో ఒక చోట మదించిన ఏనుగు ఒకటి వచ్చి ఆ వర్తకుల గుంపుపై పడింది. వర్తకులంతా భయభ్రాంతులై బెదరి-చెదరి, ఎవరికి తోచినట్లు వారు నలుదిశలకూ పారిపోయినారు. అప్పుడు గౌతముడు ఒంటిగా మిగిలిపోయినాడు. జీవితాశతో ఉన్న అతనికి దిక్కూ తెన్నూ కనుపించలేదు. చివరకతను ఒంటరిగా ఉత్తరదిశనుపట్టి పోయిపోయి, ఒక వనం చేరుకొన్నాడు. ఆ వనంలో దిక్కూ - మొక్కూ కానక ఒంటిగా తిరుగ

సాగాడు. అక్కడనుంచి సముద్రతీరం చేరేమార్గం అతనికి అగుపించలేదు. ఆ విధంగా పోతుండగా అతనికి ఒక చోట మనోహరమైన ఒక ప్రదేశం కనుపించింది. అక్కడ పూల చెట్లు, పండ్ల చెట్లు అనేకంగా ఉన్నాయి. అన్ని కాలాలలో సమృద్ధిగా పండే మామిడి, మొదలైన ఫలవృక్షాలతోను, యక్ష కిన్నరులతోను నిండి ఆ ప్రదేశం ఒక నందనవనంలాగా శోభిల్లుతున్నది. సాలవృక్షాలతోను, తాలవృక్షాలతోను, తమాలములతోను, చీకటి మ్రాకులతోను, చందనపు చెట్ల తోను కూడిన గిరిప్రస్థములందు పరిమళ భరితములైన ప్రదే శాలలో నానావిధములైన పక్షులు కిలకిలారావములు చేస్తు న్నాయి. ఒకచోట మనుష్యులవంటి ముఖాలుకల గానించే పక్షులు, భూలింగపక్షులు మొదలైనవి బిగ్గరగా కూస్తు న్నాయి. ఈ దృశ్యాలన్నీ కంటూ, ఈ శబ్దాలన్నీ వింటూ గౌతముడు సాగిపోతున్నాడు.

అంతట ఆ బ్రాహ్మణ భ్రష్టునకు ఒకచోట బంగారంపు ఇసుకనేలతో, సమంగా, ఎటుచూచినా నల్చదరంగా ఉన్న ప్రదేశం ఒకటి కనుపించింది. ఆ ప్రదేశంలో ఒక మఱ్ఱిచెట్టు ఉన్నది. అది అనేకములైన పెద్ద పెద్ద కొమ్మలతోను, ఊడల తోను ఒక గొడుగులాగా, గుమ్మటంలాగా అలరారుతున్నది. ఆ చెట్టు మొదట హరిచందనోదకంతో తడుపబడి, దివ్యకుసు మములతో కూడి ఉన్నది. అనేకములైన పూలచెట్లతోను, తీగెలతోను ఆవృతమై ఉన్న ఆ మహావృక్షాన్ని చూచి, గౌతముడు వెళ్ళి ఆ చెట్టుమొదట్లో కూర్చున్నాడు. అప్పుడు సుగంధాలు వెదజల్లుతూ చల్లని– మెల్లని గాలులు వీచాయి.

అతని శరీరమంతా చల్లబడింది. అతను విశ్రాంతిపొంది అక్కడ సుఖనిద్ర చెందాడు.

తరువాత ప్రొద్దుకూకింది. సంజ కెంజాయిలు అంతటా అలుముకొన్నాయి. అప్పుడు బ్రహ్మదేవునకు ఆప్తమిత్రుడు, నాడీజంఘుడు రాజధర్ముడు అను పేరుగలవాడు అయిన ఒక బకరాజు బ్రహ్మసభకు వెళ్ళి అక్కడనుంచి మరలి, తన నివాస మగు ఆ మర్రిచెట్టుచెంతకు విచ్చేశాడు. మహాసూపురాములు తాల్చినవాడు, దేవకన్య కుమారుడు, తేజోవంతుడు అయిన ఆ ఖగరాజును చూచి గౌతముడు ఆశ్చర్యపోయాడు. ఆకలి దప్పులచే పీడించబడుతూ, దానిని చంప నిశ్చయించుకొన్న వాడై లేచాడు. అప్పుడు బకరాజు అయిన రాజధర్ముడు గౌతముని చూచి —

"ఓ బ్రాహ్మణోత్తమా? నీ వెవరివాడవు? నీకు కుశలమేకదా? నీ రాకవలన నాగృహం పావనమైంది. సూర్యుడు అస్తమించిన అసురసంధ్యవేళ ఇది. ఈపూట నీవు నా ఇంటికి అతిథివైనావు, కనుక నేనిచ్చే సత్కారాలు పొంది పూజితుడవై రేపు వెళ్ళుదువుగాని—" అని పలికాడు.

ఈవిధంగా తెలిపి భీష్ముడు మళ్ళీ ఇట్లు చెప్పసాగాడు—

## 3

ఓ, ధర్మరాజా! మధురములైన ఆ రాజధర్ముని మాటలు విని గౌతముడు అలరి, ఆశ్చర్యమొంద సాగాడు.

అంతట ఆ బకరాజు మరల - "అయ్యా! నేను కశ్యపప్రజాపతి కుమారుడను. నా తల్లి దాక్షాయణి. నీ విప్రుడవుగా ఇంటికి అతిథిగా వచ్చావు" అని పలికాడు. తన విద్యుక్తధర్మాన్ని అనుసరించి గౌతముని తగురీతిగా సత్కరించాడు. అతని కొరకు పుష్పమయమైన ఆసనంవేసి కూర్చుండబెట్టి, గంగానదిలో ఉండే పెద్దపెద్ద చేపలను తెచ్చి ఆహారంగా సమర్పించాడు. గౌతముడది కడుపార తిని సంతుష్టుడైనాడు. అంతట బకరాజు తన రెక్కలతో విసరి అతనికి సేదతీర్చాడు. రాజధర్ముడు, నీ కులగోత్రాదులు ఏవి-అని అడిగినప్పటికీ గౌతముడు అవేవీ చెప్పక తన పేరుమాత్రం చెప్పి ఊరకొన్నాడు. తరువాత రాజధర్ముడు, మంచి మంచి పూలతో ఆకులతో దర్భలని పాన్పు ఒకటి అమర్చగా గౌతముడు దానిపై సుఖంగా పడుకొన్నాడు.

అప్పుడు రాజధర్ముడు - "ఓయీ, గౌతమా! నీవి విక్కడికి ఏంపనిమీద వచ్చావు?" అని అడిగాడు.

అందులకు గౌతముడు - "ఓ మహాపక్షీ! నేను ధన హీనుడను. సముద్రప్రాంతానికి వెళ్ళదలచినవాడనై ఇటు వచ్చాను" అని బదులు చెప్పాడు.

అది విని రాజధర్ముడు - "అయ్యా! అందుకు నీవు చింతించవద్దు. నీకు కావలసినంత ధనం నేను ఇస్తున్నాను. దానిని గైకొని కృతార్థుడవై వెళ్ళవచ్చును. పారంపర్యం, దైవికం, కామ్యం, మైత్రం - అను నాలుగువిధాలుగా ధనం సిద్ధిస్తుందని బృహస్పతులవారు చెప్పిఉన్నారు. నీ విప్పుడు

నాకు మిత్రుడవు. కనుక నావలన నీకు అర్థసిద్ధి కలుగుతుంది" అని పలికాడు.

గౌతము డది విని సంతుష్ట హృదయుడైనాడు. ఆ రాత్రి గడచింది. తెల్లవారింది. అప్పుడు రాజధర్ముడు గౌతముని చూచి—

"ఓయీ! ఇక్కడికి మూడు ఆమడల దూరంలో నా కొక ఆప్తమిత్రుడున్నాడు. అతని పేరు విరూపాక్షుడు. నీ వీ త్రోవనే వెళ్ళి అతన్ని దర్శించావా నీవు అడిగినవన్నీ అతను ఇస్తున్నాడు. అతను మహోదాత్త, సందేహంలేదు" అని చెప్పాడు. అంతట గౌతముడు సంతోషించి అతను ఒసగిన అమృతం వంటి పండ్లు ఆరగిస్తూ బయలుదేరి వెళ్ళాడు. చందనపుచెట్లు, అగరుచెట్లుగల ఆ త్రోవన త్వరత్వరగా పోయి పోయి, పర్వతప్రాకారాలతో ఒప్పుతున్న మేరువ్రజ మనే ఆ విరూపాక్ష రాక్షసుని పట్టణం చేరుకొన్నాడు. ఆ రాక్షస రాజుకు తన వృత్తాంతం యావత్తూ ఎరుకపరచాడు. అప్పుడు విరూపాక్షుడు తన సేవకులను పిలిచి – "సేవకులారా! నా స్నేహితుడు పంపిన అతిథి ఒకడు ద్వారంవద్ద వేచిఉన్నాడు. మీరు తక్షణం వెళ్ళి అతనిని తోడ్కొని రండి" అని ఆజ్ఞాపించాడు. అంతట సేవకులు వెళ్ళి గౌతముని తీసుకొనివచ్చి రాక్షసరాజు సమక్షంలో నిలువబెట్టారు. గౌతముడు, మహాశ్చర్యంతో ఆ రాక్షసరాజును చూస్తూ నిలుచుండిపోయాడు.

అని చెప్పి భీష్ముడు తిరిగీ ఈవిధంగా చెప్ప నారంభించాడు:—

ఓ, ధర్మరాజా! తనవాత్త రాక్షసప్రభువైన విరూపాక్షుడు గౌతముని ఉచితాసనంపై కూర్చుండచేసి నీ వెవ్వడవని అడిగాడు. గౌతముడు తన గోత్రంమాత్రమే తెలిపి ఊరకొన్నాడు. అప్పుడు విరూపాక్షుడు బ్రహ్మవర్చస్సు లేనట్టివాడు, స్వాధ్యాయహీనుడు అయిన గౌతముని చూచి కేవలం గోత్రమాత్రుడేనని తలచి – "ఓయీ! నీ పేరేమిటి? బ్రాహ్మణత్వం సంపాదించే నీ గోత్రం ఏమిటి? బిడియపడకుండా నిజం చెప్పవలసినది" అని అడిగాడు.

అందులకు గౌతముడు, "ఓ రాక్షస రాజా! నేను మధ్యమదేశవాసినగు బ్రాహ్మణుడను. నేను శబరగ్రామంలో నివసిస్తున్నాను. ఒక విధవరాలిని పెండ్లాడాను – ఇదే నా చరిత్ర" అని బదులు పలికాడు.

ఓ, యుధిష్ఠిరా! అప్పుడా విరూపాక్షుడు గౌతముని పలుకులు విని, "అయ్యో, నే నిప్పుడేం చేసేది? ఇది నా సుకృతానికి హేతువవుతుందా? ఇతడు జాతిచే బ్రాహ్మణుడు. మహాత్ముడైన నా మిత్రుడికి మిత్రుడై ఉన్నాడు. కశ్యపప్రజాపతి కుమారుడైన ఆ రాజధర్ముడు ఈ బ్రాహ్మణుని సత్కరించచవలసినదని నావద్దకు పంపాడు. రాజధర్ముడు ఎల్లప్పుడూ నాకు ఆశ్రితుడు, బంధువు, సోదరుడు, హితుడు. కనుక అతనికి ప్రియమైనందున నేను ఇతన్ని ఆదరిస్తాను. ఇవాళ కార్తీక పౌర్ణమి. నా ఇంట వెయ్యమంది బ్రాహ్మణులు భుజిస్తారు. వారిలో ఇతనూ ఒకడు. తినిపోతాడు. అందరితోపాటు ఇత

నికీ ధనం ఇస్తాను. పైగా ఇవాళ పుణ్యదివసం. ఇతడా అతిథినని వచ్చాడు. అదీకాక ఇతనికి కొంత ధనం ఇవ్వాలని ఇదివరకే సంకల్పించాను. కనుక ఇక, ఇప్పుడు శంకించడం, చింతించడం ఉచితంకాదు'' అని తనలోతాను తలపోసి, ఒక నిశ్చయానికి వచ్చాడు.

తరువాత వెయ్యిమంది బ్రాహ్మణోత్తములు స్నానాలు చేసి, అలంకృతులై, నారబట్టలు కట్టుకొని వచ్చారు. విరూపాక్షుడు వారందరినీ ఆదరించి యథావిధిగా సత్కరించాడు. ఆ వెయ్యిమంది బ్రాహ్మణులకు వేరువేరుగా దర్భాసనాలు వేయించాడు. వారిని కూర్చుండబెట్టి తిల దర్భోదకాలచే వారిని పూజించాడు. ఆ బ్రాహ్మణులలో కొందరు విశ్వేదేవులుగాను, కొందరు పితృదేవతలుగాను ఉండి గంధ పుష్పాక్షతలతో అర్చించబడుతూ చంద్రులవలె ప్రకాశించారు. తరువాత వజ్రాలు తాపిన బంగారు పాత్రలనిండా నెయ్యి, తేనె, మొదలైన పదార్థాలన్నీ సమర్పించబడినాయి. ఆవిధంగా ఆ రాక్షసరాజు గృహంలో ప్రతి ఆషాఢ, మాఘ పౌర్ణమీ తిథులందు మృష్టాన్న భోజన దానాదులు ఒసగబడుతూ ఉంటాయి. మరిన్నీ ఆ విరూపాక్షుడు శరత్కాలం అయిపోయే సమయాన రత్నాలు బ్రాహ్మణులకు దానమిచ్చేవాడు.

తరువాత ఆ బ్రాహ్మణులంతా భోజనంచేసినపిదప, విరూపాక్షుడు వారికి దక్షిణలు ఇవ్వడానికై వెండి, బంగారం, రత్నాలు, మణులు, ముక్తికాలు, వజ్ర వైడూర్యాలు - తెప్పించి సభామండపంలో రాసులుగా పోయించాడు.

"ఓ బ్రాహ్మణోత్తములారా! సిటిలో మీకు కావలసినవాని నెల్ల పరిగ్రహించండి. మరిన్నిమీరు భోజనపాత్రలనుకూడా తీసుకొని వెళ్ళండి-" అని ప్రార్థించారు.

అది విని ఆ బ్రాహ్మణులు పరమానందభరితులై తమకు ఇష్టమొచ్చినవన్నీ పరిగ్రహించారు. అప్పుడు విరూపాక్షుడు-

"ఓ భూసురులారా! ఇవాళ సూత్రం రాక్షసులు నివారింపబడినారు. కనుక మీరు ఇవాదినం వారివలన ఏ భయమూ లేక, స్వేచ్ఛగా వెళ్ళండి. ఆలస్యం చెయ్యకండి-" అని పలికాడు.

అంతట ఆ విప్రులంతా ఎవరిత్రోవన వారు పోసాగారు. గౌతముడుకూడా విరూపాక్షు డొసగిన బంగారపు మూటను మోయలేక మోస్తూ, నడవలేక నడుస్తూ, మెల్ల మెల్లగా ప్రయాణంచేసి మళ్ళీ బకరాజున్న మఱ్ఱివృక్షం చెంతకు చేరుకొన్నాడు. కాని అతను చాలా డస్సిపోయినాడు. మిక్కిలి ఆకలిబాధతో శోషవచ్చి ఆ చెట్టుక్రింద కూలబడ్డాడు. తరువాత రాజధర్ముడు వచ్చి, తన రెక్కలతో విసరి అతనికి బడలిక తీర్చాడు. పూజాపురస్సరంగా భోజనం పెట్టి సంతుష్టిపరచాడు. గౌతముడు సుఖంగా విశ్రాంతి తీసుకొని -

"ఆహా! ఈ బంగారంమూట చాలా బరువుగా ఉన్నది. లోభమోహాలు పీడిస్తాయనికూడా భయపడక ఈ ధనం స్వీకరించాను. కాని నాకిప్పుడు దారిలో భోజనానికి ఏమీ లేదుకదా! ఏం తిని ప్రాణాలు నిలుపుకోగలను?" అని చింతించినవాడై, ఏమీతోచక, తుదకు కృతఘ్నుడైన గౌత

ముడు — "మాంసపు ప్రోగులా ఉన్న ఈ బకరాజు నా ప్రక్కన ఉండగా ఆహారంకోసం చింత దేనికి? దీనిని చంపి పట్టుకొని శీఘ్రంగా వెళ్ళిపోతాను" — అని నిశ్చయించుకొన్నాడు.

ఈ రీతిగా తెలిపి భీష్ముడు మళ్ళీ చెప్పసాగాడు :

## 5

ఓ, ధర్మరాజా! అప్పటికే బకరాజయిన రాజధర్ముడు తనరక్షణార్థం ఒక కొరివిని తనప్రక్కన పెట్టుకొని నమ్మకంతో సుఖనిద్ర చెందాడు. తరువాత విశ్వాస ఘాతకుడైన ఆ గౌతముడు మెలుకువతో ఉండి, మండుతున్న ఆ కొరివితో నిద్రిస్తున్న రాజధర్ముని పలుమార్లు కొట్టి చంపాడు. ఆ విధంగా చంపి మిక్కిలి సంతోషించాడేకాని తన కామహోత్తముడు చేసిన మేలు కొంచెమైనా స్మరించలేదు. ఓ, ధర్మనందనా! అంతట ఆ కృతఘ్నుడు రాజధర్ముని రెంట్రుకలన్నీ ఊడబెరికి, అతన్ని నిప్పులోపెట్టి కాల్చాడు. తరువాత తనబంగారపు మూటతో కలిపి దానినికూడా భుజాన పెట్టుకొని, భారంగా ఉన్నప్పటికీ ఆలస్యంచేయక ప్రయాణమై త్వరత్వరగా వెళ్లిపోసాగాడు.

ఇక, అక్కడ దానవరాజైన విరూపాక్షుడు, రాత్రి కావడంచూచి తన కుమారుని పిలిచాడు.– "అబ్బాయీ! మిత్రుడైన. రాజధర్ముడు ఇవాళ నాకు కనుపించనే లేదు. ప్రతి నిత్యం అతను పూర్వ సంధ్యలలో బ్రహ్మదేవుని సేవించడా

నికై వెళ్లి తిరిగి వచ్చేటప్పుడు నన్ను చూడకుండా పోయే వాడుకాదు. కాని రెండు రాత్రులబట్టీ అతని దర్శనమేనాకు దుర్లభమై పోయింది. కుమారా! ఎందుకోకాని నా మనస్సు కలవరపడుతున్నది. కనుక నీవు తక్షణమే వెళ్ళి అతన్ని వెదక వలసినది. స్వాధ్యాయ శూన్యుడు, బ్రహ్మ వర్చస్సు లేని వాడు అయిన ఆ బ్రాహ్మణాధముని విషయంలో నాకు అనుమానంగా ఉన్నది. వాడక్కడికివెళ్ళి అతని కేమైనా హాని చేశాడేమో నన్న సంశయం కలుగుతున్నది. వాడు దురాచారుడు, దుర్బుద్ధికలవాడు. వాడి ఆకారాన్ని చూస్తేనే తెలుస్తున్నది. వాడు క్రూరకర్ముడనీ, దయా దాక్షిణ్యాలు లేనివాడనీ, నీచుడగు దస్యుడనీ నాకు తోస్తున్నది. వాణ్ణి చూచినప్పటి నుంచీ నామనస్సు మనస్సులో లేదు.

నాయనా! నీవు వెంటనే రాజధర్ముని ఇంటికివెళ్ళి అతని క్షేమ సమాచారం తెలుసుకొని రావలసినది—'' అని చెప్పి కొడుకును పంపించాడు.

అంతట ఆ దానవ కుమారుడు కొందరు రాక్షసులను వెంటతీసుకొని రాజధర్ముని నివాసానికి వెళ్ళి, అక్కడ అతని కంకాళాన్నిచూచి హయ్యో-మొర్రో అని దుఃఖిస్తూ పరుగు పరుగున మరలివచ్చి ఆ వృత్తాంతం తండ్రికి ఎరిగించాడు. అప్పుడు విరూపాక్షుడు తక్షణమే ఆ గౌతముని వెదకి పట్టుక రమ్మని అనేకమంది రక్కసులకు ఆజ్ఞఇచ్చి పంపాడు. వారు వెళ్ళి గౌతముని చుట్టు ముట్టారు. అతన్ని పట్టుకొని, రెక్కలూడిఉన్న రాజధర్మునితో సహా తెచ్చి రాక్షసరాజుముందు పెట్టారు. అప్పుడందరూ దుర్మరణంచెంది ఉన్న రాజధర్ముని

చూచి మిక్కిలి దుఃఖించాడు. విరూపాక్షుడు తన మంత్రులతో కలిసి అనేక విధాల చింతించాడు. దురాత్ముడగు ఆ గౌతముని అందరూ దూషించ సాగారు. పట్టణంలో ఆబాల గోపాలము నిశ్చేష్టులై ఉన్నారు.

తరువాత ఆ దుష్టుని వధించమని రాక్షసరాజు తన కుమారుని ఆజ్ఞాపించాడు. అతని మాంసం అందరూ భక్షించాలని రక్కసుల నియోగించాడు. కాని మహాపాపిఅయిన గౌతముని భక్షించడానికి వారెవరూ ఒప్పుకోలేదు:-

"మహాప్రభో! ఇతన్ని దస్యులకు అప్పగించ వలసినదే కాని, మేము తినము. దయచేసి మమ్ముల నిర్బంధించకండి మహారాజా!" అని పెక్కుభంగుల ప్రార్థించారు. రాజు అందులకు అంగీకరించి- "ఓరీ! శీఘ్ర తక్షణమే తీసుకొనిపోయి ముక్కలు ముక్కలుగా నరికి దస్యులకు ఇవ్వండి!-" అని ఆజ్ఞాపించాడు. వారు ఆ విధంగానే చేశారు, కాని, దస్యులు కూడా అతనిని భక్షించడానికి సమ్మతించలేదు. మాంసభక్షణ చేసే జంతులేవీకూడా కృతఘ్నుని తినడానికి ఒప్పుకోవు. ఓ యుధిష్ఠిరా! బ్రహ్మహత్య చేసినవారికీ, సురాపానం చేసిన వారికీ, సువర్ణం దొంగిలించిన వాడికీ, వ్రతభంగం చేసిన వాడికీ- ప్రాయశ్చిత్తం ఉన్నది కాని కృతఘ్నుని పాపానికి మాత్రం ప్రాయశ్చిత్తం లేనేలేదు. మిత్రద్రోహం చేసిన వానిని, కృతఘ్నుని—క్రవ్యాదులు ముట్టరు సరికదా, క్రిములు కూడా ముట్టవు !

అని బీష్ముడు మళ్ళీ ఈ ప్రకారం చెప్పసాగాడు:

౮

ఓ, ధర్మరాజా! ఆ తరువాత విరూపాక్షుడు తన మిత్రుడైన రాజధర్ముడికి చితి ఏర్పాటు చేయించాడు. దానిని రత్నాలతోను, వస్త్రాలతోను, చందనగంధాది పరిమళ ద్రవ్యాలతోను అలంకరించి, అందు అతని కళేబరాన్ని ఉంచి, ప్రజ్వలింపచేసి ప్రేతకార్యం నెరవేర్చాడు. అప్పుడు పైనుండి కామధేనువు క్షీరం వర్షించింది. క్షీరమిశ్రితమైన కామధేనువు నోటి నురుగు ఆ రాజధర్ముని చితిపై పడగానే, అతను ఎప్పటివలె జీవించి విరూపాక్షుని దగ్గరికి వచ్చాడు. అప్పుడు దేవేంద్రుడు ఆ రాక్షసరాజు పట్టణానికి అరుదెంచి—

"ఓ దానవరాజా! నీమూలంగా ఇతడు మళ్ళీ జీవించాడు. పూర్వం ఒకప్పుడు ఈ రాజధర్ముడు బ్రహ్మసభకు వెళ్ళడం మానాడు. అందుకు బ్రహ్మ కోపించి శపించాడు. ఆ శాప ఫలితంగానే ఇత నీ విధంగా గౌతమునిచే దుర్మరణం పొందవలసి వచ్చింది. మళ్ళీ ఆ బ్రహ్మదేవుడే ఇప్పుడితనిని బ్రతికించాడు—" అని తెలియచేశాడు.

తరువాత రాజధర్ముడు. దేవేంద్రుని చూచి నమస్కరించాడు– "ఓ సురనాథా! నీకు నాపై అనుగ్రహం ఉన్నట్లయితే నామిత్రుడైన ఈ గౌతముని బ్రదికించ వలసినది–" అని ప్రార్థించాడు. అందుకు, దేవేంద్రుడు సంతోషించి అమృత వర్షం కురిపించి గౌతముని మళ్ళీ బ్రతికించాడు. గౌతముడు ఎప్పటివలె సువర్ణ భాండముతో లేచివచ్చాడు. అప్పుడు రాజధర్ముడు, గౌతముని కౌగలించుకొని, ధనంతో

సహా అతనిని పంపించివేశాడు. తాను యథాప్రకారం బ్రహ్మ సభకు వెళ్ళి, అక్కడ గౌరవం పొందాడు. తరువాత గౌతముడు తన శబరగ్రామానికి వెళ్ళిపోయాడు.

ఓ, ధర్మరాజా! ఇది కృతఘ్నోపాఖ్యానం; దీనిని నీకు తెలిపాను—"

అని భీష్మాచార్యులవారు ధర్మరాజుకు చెప్పాడు:

---

# 6. శిబి చరిత్రము

రోమశమహర్షి, ధర్మరాజులవారికి ఈ విధంగా చెప్పసాగాడు :

ఓ, ధర్మరాజా! ఇది భృంగతుంగపర్వత మని చెప్పాను కదా ! ఇక్కడే వితస్త, జల, ఉపజల అనే నదులు యమునా నదికి ఇరుప్రక్కలా ప్రవహిస్తున్నాయి. ఇది మహర్షులకు నెలవు. ఈ చల్లని, నిర్మలోదకాలలో స్నానాలు చేసిన వారు సర్వపాప విముక్తు లవుతున్నారు. ఓ, ధర్మనందనా ! ఈప్రదేశంలోనే ఔశీనరుడైన శిబిచక్రవర్తి పూర్వం యజ్ఞాలు చేసి దేవేంద్రునికంటెకూడా అధికుడైనాడు.

ఆ విధంగా శిబిచక్రవర్తి యజ్ఞాలు చేస్తుండగా ఇంద్రుడు, అగ్ని, ఆ శిబియొక్క చిత్తవృత్తి ఎటువంటిదో తెలుసుకొన దలచినవారై ఒకనాడు అక్కడికి వచ్చారు. దేవేంద్రుడు డేగ అయినాడు. అగ్నిదేవుడు పావురంగా మారాడు. ఈ

విధంగా మాయరూపాలు ధరించి వారు శిబిచక్రవర్తిని పరీక్షించదలచుకొన్నారు. ఆ డేగ పావురాన్ని తరుముకొంటూ వచ్చింది. అప్పుడు పావురం డేగ వెంటాడుతుండగా భయపడినదై, పారిపోయివచ్చి, శిబిచక్రవర్తిని శరణుజొచ్చింది.

## 2

అంతట శ్యేన (డేగ) రూపంలో పావురమును తరుముకొంటూ వచ్చిన ఇంద్రుడు శిబిచక్రవర్తితో ఇట్లా అన్నాడు.

"ఓ, శిబిచక్రవర్తీ! రాజు లందరిలో నీవు ధర్మాత్ముడవని లోకంలో అంతా అంటున్నారు. మరి నేనా, ఆకలి బాధకు ఓర్వలేకుండా ఉన్నాను. ఈ కపోతమూ, నాకు ఆహారంగా ఉంటున్నది. దీనిని నీవిట్లా అట్టిపెట్టుకోవడం ధర్మ విరుద్ధం. కావున నాయందు దయఉంచి ఈ పావురాన్ని విడిచిపెట్టు.

అప్పుడు శిబిచక్రవర్తి ఇట్లా పలికాడు :—

"ఓ పక్షిరాజా! ఈ పావురం నీకు భయపడి ప్రాణ రక్షణార్థం నా మఱుగు జొచ్చింది. కాబట్టి నేను దీనిని విడిచిపెట్టరాదు. ప్రాణభీతితో నన్ను శరణువేడుకొన్న ఈ కపోతమును నేను విడిచిపెట్టినట్లయితే నేను ధర్మం తప్పినవాడ నవుతున్నాను. శరణన్న వారిని రక్షించనిచో గోహత్య, బ్రహ్మహత్య చేసినంత పాతకం చుట్టుకొంటున్నది"—

అంతట డేగ మరల ఈ రీతిగా పలికింది :

"ఓ, రాజేంద్రా! సమస్త భూతాలుకూడా ఆహారం వల్లనే జీవించి అభివృద్ధిచెందుతున్నాయి. దేనినైనా సరే విడిచిపెట్టి జీవించవచ్చునుగాని, ఆహారాన్ని విడిచిపెట్టి బ్రతుకవచ్చునా? నీవు ఈ పావురాన్ని విడిచిపెట్టకపోతే నేను క్షుద్బాధకు తట్టుకోలేక తక్షణమే ప్రాణాలు విడుస్తాను. ఆ విధంగా నేను చనిపోయినపిమ్మట నా భార్య, బిడ్డలు జీవించక—వాళ్ళూ ప్రాణాలు విడుస్తారు. కాబట్టి ఒక్క పావురం కోసం ఇన్నిప్రాణాలు బలి అయిపోతున్నాయి. నీవు ఆ ఒక్క పావురాన్నే రక్షించా లనుకొన్నావు కాని ఇన్ని ప్రాణాలను కాపాడాలనుకోవడం లేదు. శరణన్నవారిని రక్షించడం ధర్మమే. కాదనను. అయినప్పటికీ ఒక్క ధర్మంకోసం అనేక అధర్మాలు సంభవిస్తున్నాయికనుక ఈసమయంలో ఆ ధర్మం గ్రహించదగినదికాదు. ఓ, నరేంద్రా! ధర్మాధర్మముల విషయంలో గౌరవ లాఘవాలను, బాధ్య బాధకత్వాలను జాగ్రత్తగా పరిశీలించి మరీ ధర్మాన్ని నడపవలసి ఉన్నది."

అందులకు శిబి ఈ విధంగా బదులు చెప్పాడు :—

"ఓ విహంగోత్తమా! నీ మాటలధోరణి పరికించి చూస్తే—నీవు సమస్త ధర్మాలూ తెలిసినవాడవని నాకు తోస్తున్నది. నీకు తెలియని ధర్మం ఒక్కటికూడా ఉండదని ఊహిస్తున్నాను. కాని ఒక్కవిషయం. శరణన్నవారిని పరిత్యజించటం ధర్మమనవచ్చునా? అయినా నీ యీ ప్రయత్నమంతాకూడా ఆహారం కోసమేకదా? కనుక ఓ పక్షిరాజా! వేరే ఏదైనా ఒక జంతువును ఆహారంగా గైకొనవలసినది. అప్పుడు నీకూ, ప్రాణాలు నిలుస్తున్నవి. నాకూ, శరణాగత

రక్షణ సిద్ధిస్తున్నది. ఈ విధంగా రెండు పుణ్యకార్యాలూ సఫలీకృతమయ్యేటట్లు వేరొక ఆహారాన్ని నీవు స్వీకరించు విహంగరాజా! ఈ అరణ్యంలో వుండే వరాహ, మృగ, మహిషాదులలో ఏ జంతువు మాంసం కావాలన్నా నీకు యిస్తున్నాను, కోరుకో."

అప్పుడు డేగ ఈవిధంగా బదులు చెప్పింది :—

"ఓ రాజేంద్రా! నీవుచెప్పిన ఏ మృగమాంసమూ నాకు ఆహారంకాదు. పావురములు డేగలకు ఆహారమని వేదాలలో చెప్పినవిషయం నీవు ఎరుగవా? ఒక్క కపోతపు మాంసం తప్ప మరే మృగమాంసమూ నేను తినను. పావురం నాకు దేవవిహితమైన ఆహారం. కాబట్టి నా ఆహారం నాకు ఇవ్వవలసినది. సారంలేని వ్యర్థపుమాటలవల్ల ప్రయోజనం లేదు. వెంటనే పావురమును విడిచిపెట్టవలసినది."—

అంతట శిబిమహారాజు ఈరీతిగా పలికాడు :—

"ఓ విహంగోత్తమా! నీవు ఏది కోరినా యిస్తాను. కాని, పావురమునుమాత్రం యివ్వనుసుమా. కావాలంటే నీకు నా రాజ్యం యావత్తూ యిస్తాను తీసుకో. అంతేకాని, నన్ను శరణువేడిన కపోతాన్నిమాత్రం విడువను. నీకు నేను ఏదియిస్తే ఈ పావురమును అపేక్షించకుండా ఉంటావో దానిని ఇస్తాను చెప్పు?"—

అప్పుడు శ్యేన (డేగ) రూపంలోవున్న ఇంద్రుడు శిబిని ఈవిధంగా కోరాడు :—

"ఓ మహారాజా! అవుతే అడుగుతున్నాను విను. ఈ పావురం ఎత్తు మాంసం నీ శరీరంలోంచి కోసి, తూచి నాకివ్వు! ఓ నృపశ్రేష్ఠుడా! దానిని భక్షించి సంతృప్తి నొందుతున్నాను!"—

అందులకు శిబిచక్రవర్తి యీప్రకారంగా బదులు పలికాడు:—

"ఓ విహంగోత్తమా! అట్లాగే నీవు కోరింది ఇస్తున్నాను. ఈ పావురంఎత్తు మాంసం నా దేహంలోనుంచి కోసి, తూచి నీ కిస్తున్నాను, స్వీకరించవలసినది!"—

అని తెలిపి రోమశుడు, ధర్మరాజుతో మరల యీ విధంగా చెప్పసాగాడు:—

ఓ ధర్మనందనా! ఆవిధంగా ధర్మాత్ముడైన శిబి మహారాజు, మహాప్రసాదమంటూ చేగకోర్కె తీర్చ సంసిద్ధుడైనాడు. త్రాసులో ఒకవైపు కపోతాన్ని ఉంచాడు. కత్తి తీసుకొని తన మాంసం కోసి త్రాసులో రెండవప్రక్క వుంచాడు. కాని తన మాంసం పావురంతో సరితూగలేదు. అప్పుడు శిబి తన దేహంనుంచి మరికొంత మాంసం కోసి త్రాసులో ఉంచాడు, కాని అప్పటికీ ఆ మాంసం పావురం ఎత్తు తూగలేదు.

ఓ యుధిష్ఠిరమహారాజా! అంతట మహాత్ముడైన శిబిచక్రవర్తి తానే త్రాసులో ఎక్కి కూర్చున్నాడు!

అప్పుడు, మారురూపాలతో శిబిని పరీక్షించడానికి వచ్చిన ఇంద్రుడు, అగ్నిదేవుడు—శ్యేన, కపోతరూపాలు విడిచి తమ నిజరూపాలతో ప్రత్యక్షమైనారు.

అంతట దేవేంద్రుడు, శిబిచక్రవర్తితో– "ఓ, రాజేంద్రా! నేను ఇంద్రుడను. నేనే ఈ డేగ రూపంలో వచ్చాను. ఈ పావురం అగ్నిదేవుడు, మే మిద్దరం నీ ధర్మబుద్ధి ఎంతటిదో పరీక్షించాలని ఎంచి, ఈ తీరుగా మారురూపాలతో నీ యజ్ఞ వాటికకు వచ్చాము. నీవు ధర్మమూర్తివి. ధర్మాన్ని పరిశీలించి నీవు నీ శరీరాన్నే కోసిఇచ్చావు. అందుకు మేమెంతో సంతోషించాము. ఓ, శిబిచక్రవర్తీ! నీ దాతృత్వానికి, నీ ధర్మానికి మెచ్చాము. నీ కీర్తి సర్వలోకాలలో శాశ్వతంగా వ్యాపించి ఉండుగాక! నీ కీర్తి నిలిచి ఉన్నంతకాలం నీవు పుణ్యలోకాలలో ఉంటావు"

అని పలికి ఆ ఇంద్రుడు, అగ్నిదేవుడు, తమ తమ రూపాలతో మళ్ళీ తమ తమ లోకాలకు వెళ్ళిపోయారు.

ఓ, ధర్మరాజా! అనంతరం మహాత్ముడైన శిబిచక్రవర్తి కొంతకాలం ధర్మం తప్పక రాజ్యపరిపాలన కావించి తరువాత స్వర్గలోకానికి వెళ్ళిపోయాడు.

అని రోమశమునీంద్రుడు ధర్మరాజుకు పుణ్యప్రసక్తమైన శిబి చరిత్రం చెప్పాడు.

---

## 7. పతివ్రతా మాహాత్మ్యం

కుమారుడు తండ్రికి ఈవిధంగా చెప్పసాగాడు :

పూర్వం ప్రతిష్ఠానపురం అనే పట్టణంలో కౌశికు డనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతను పూర్వజన్మలో చేసుకొన్న

పాపంవల్ల కుష్ఠువ్యాధిగ్రస్తుడైనాడు. అతని భార్య మహాపతివ్రత. ఆవిధంగా కుష్ఠువ్యాధితో బాధపడుతున్న భర్తకు ఆ సాధ్వి సమస్త పరిచర్యలూ చేస్తుండేది. భయంకరమైన ఆ కుష్ఠు వ్యాధివల్ల అతని కాలిగ్రవేళ్ళు, చేతిగ్రవేళ్లు, కుళ్ళిపోయినాయి. దేహమంతటా చీము, నెత్తురు ఓడుతున్నది. గొంతులో గురకపుట్టి కళ్లె వస్తున్నది. అటువంటి స్థితిలో ఉన్న భర్తకు ఆ ఇల్లాలు ప్రతినిత్యం అతని వంటిమీద పుల్లనీళ్ళ కడిగేది. చీము, నెత్తురు తుడిచేది. నూనెతో తల, కాళ్ళు - చేతులు పలుమార్లు తోమేది. అతను కక్కే కళ్లె, విడిచే మల మూత్రాలు ఎత్తి పోసేది. వళ్ళంతా ఆర్పి బట్టలు కప్పేది. అన్నం తినిపించేది. ప్రక్కన కూర్చుని ప్రియ వచనాలు పలుకుతూ భర్తను సుఖపెట్టేది. అతను ఎంత కోపించినా, తిట్టినా, ఏమాత్రం నొచ్చుకోక, మారుమాట చెప్పక, భర్తనే దైవంగా నమ్ముతూ ఆ మహాసాధ్వి అత్యంత శ్రద్ధా భక్తులతో ఎల్ల వేళలా అతనికి సమస్త ఉపచారాలు చేస్తూ వచ్చింది.

ఇట్లా ఉండగా ఒకనాడు ఆ బ్రాహ్మణుడు తనభార్యతో ఈవిధంగా అన్నాడు—

"ఓ సాధ్వీ! ఇవాళ నేను రాజమార్గాన ఒక వేశ్యను చూచాను. ఎట్లాగైనాసరే నీవు నన్ను దాని ఇంటికి తీసు కొని పోవలసినది. ఓ, మానినీ! ఆ వేశ్య సర్వాంగసుందరి. పూదీగెనుపోలు ఆమె దేహం, కనకకుంభములవంటి ఆమె పాలిండ్లు, పద్మపత్రాలవంటి ఆమెనేత్రాలు నన్ను మోహంలో

ముంచేస్తున్నాయి. ఓ మగువా! ఆమెను పొందనిదే నేను జీవించలేను. నాచిత్తం వ్యాకులపడుతున్నది. మన్మథబాధను తాళలేకుండా ఉన్నాను. ఇప్పుడా, ప్రొద్దుగ్రుంకినది. చీకట్లు అలుముకున్నాయి. నాకా, నడిచివెళ్ళ శక్తిలేదు. కనుక నీవు ఎట్లాగైనా నన్ను దాని ఇంటికి తీసుకొనివెళ్ళి పుణ్యం కట్టుకో—"

ఈవిధంగా భర్త పలికిన పలుకులు ఆ సాధ్వీలలామ విన్నది. వినయంతోను, భక్తితోను, ఆ పతివ్రత కామాతురుడైన తన భర్తకోర్కె తీర్ప నిశ్చయించుకొన్నది. వేశ్యకు దానికి ఇవ్వవలసినధనాన్ని తీసుకొన్నది. చీరె గట్టిగా బిగించుకొన్నది. భర్తను మూపున ఎక్కించుకొని వెంటనే వేశ్యాగృహానికి పయనమైంది. అప్పుడా నిశీథసమయంలో అంతటా చిమ్మచీకట్లు అలుముకొన్నాయి. దట్టంగా మబ్బు పట్టింది. మెఱుపులు మెరుస్తున్నాయి. ఆ విధంగా కన్నుపొడుచుకున్నా కనుపించని ఆ రాత్రివేళ, భర్త కోర్కె తీర్చేటందుకై ఆ మహాసాధ్వి, రాజమార్గాన వేగంగా పోసాగింది.

అప్పుడా మార్గంలో ఒకచోట మాండవ్యుడనే బ్రాహ్మణోత్తముని, తలారివాళ్ళు దొంగ అని శంకించి పట్టుకొన్నారు. పట్టుకొని అతన్ని కొఱతవేసిపెట్టారు. ఆ విధంగా కొఱతవేసి ఉన్న మాండవ్యమునిని చీకట్లో చూడక కౌశికుడు గట్టిగా అతనిని ఎడమభుజాన్ని తాకాడు. ఆ తాకుడుకు మునికి తీవ్రమైన బాధ కలిగింది. అతను కోపించి —

"నన్నీరీతి వృథాగా నొప్పించిన నరాధముడు ప్రొద్దుపొడిచేటప్పటికి మరణించుగాక!" అని దారుణంగా శపించాడు.

అంతట మునిశాపం విని మహాసాధ్వి అయిన కౌశికుని భార్య శోకతప్తయై —

"సూర్యుడు ఉదయిస్తే నా భర్తకు ప్రాణహాని సంభవిస్తున్నది. కనుక నేనే పతివ్రతనగుదునేని ఇక సూర్యుడే ఉదయించకుండా ఉండుగాక!" అని పలికింది.

అంతట సూర్యుడు ఉదయించలేదు. ఇక పగలన్నది లేదు. అంతా రాత్రే అయిపోయింది. లోకాలన్నీ అంతులేని అంధకారంలో మునిగిపోయినాయి. జగాలన్నీ సంస్తంభితములైనాయి. అప్పుడు దేవతలంతా భయభ్రాంతులలో చిక్కి, దిక్కుకానక బ్రహ్మదేవునివద్దకు వెళ్ళారు. ఆ పతివ్రతా మాహాత్మ్యాన్ని ఎరింగించి ఈవిధంగా మొఱపెట్టుకొన్నారు.

"ఓ, కమలాసనా! సూర్యోదయం సూర్యాస్తమయం లేకుండా పోయినవి. ఆ కారణంవలన కాలాలు చిక్కువడ్డాయి. ప్రతిదినం స్నానసంధ్యాద్యనుష్ఠానాలు అడుగంటాయి. జపహోమాది వివిధకర్మలూ భగ్నమైనాయి. వేదాధ్యయనాదులు నిలిచిపోయినాయి. విధివిహిత స్వధాస్వాహాదులన్నీ కూడా ఆగిపోయినాయి. ఓ, దేవదేవా! నిత్య నైమిత్తిక కృత్యాలు, యజ్ఞయాగాది క్రతువులు, దేవపూజలు, అతిథి పూజలు, భగవదారాధనలు- అన్నీ భూమండలంలో అడుగంటిపోయినాయి, వీటివలన మేము హవిర్భాగములు పరిగ్రహించే అవకాశం లేకుండా పోయింది. అందుచేత మానవలోకానికి ఈప్సితార్థాలు శూన్యమైనాయి. వర్షాలు, పాడి-పంటలు, అన్నీ నశించాయి. లోకాలకు అనర్థం వాటిల్లింది.

కాలగతి తప్పటంవల్ల లోకవ్యవహారాలన్నీ విచ్ఛిన్నములై నాయి. ఇక ఇప్పుడేది మార్గం— మళ్ళీ సూర్యోదయము ఎట్లా అవుతుంది ?"

అని ఈవిధంగా దేవతలు మొఱపెట్టుకోగా, సర్వజ్యే ష్ఠుడైన బ్రహ్మ కరుణించి వారల కీరీతిగా ప్రత్యుత్తరం ఒస గాడు—

"దేవతలారా ! దీనికంతకూ కారణం ఆ బ్రాహ్మణుని భార్య—ఆ మహాసాధ్వి తన పాతివ్రత్య మహిమచేత సూర్యో దయాన్ని అరికట్టింది. ఆ పతివ్రత మాహాత్మ్యం పతివ్రత చేతనే గాని చక్కబడదు. కావున పరమ పతివ్రతా, తాపస్విని, అయిన అత్రిమహామునిభార్య అనసూయాదేవి ఈకార్యాన్ని చక్కబెట్ట సమర్థురాలు. మీరు వెళ్ళి ఆమెను ప్రార్థించండి—"

ఈవిధంగా బ్రహ్మదేవుడు చెప్పగా విని దేవతలంతా పుణ్యవతి అయిన అనసూయాదేవివద్దకు వెళ్ళి పెక్కువిధాల ప్రార్థించారు:—

"తల్లీ ! అనసూయాదేవీ ! నిత్యసత్యవ్రతి అయిన ఒక మహాపతివ్రత ఆజ్ఞచొప్పున సూర్యుడు ఉదయించకుండా ఊరుకున్నాడు. పెద్ద విపత్తు ఏర్పడింది తల్లీ ! నీవు కాపాడ తావని వచ్చాము. ఓ, పుణ్యవతీ ! నీవు ఎప్పటిల్లాగా మాకు పగలు, రాత్రి, సంధ్యాకాలాలను దయచేయవలసినది" అని దేవతలు, అనసూయను వేడుకొన్నారు.

అప్పుడు అనసూయాదేవి —

"ఓ, దేవతలారా! ఆ పతివ్రతమహాత్మ్యం సాటిలేనిది. దానిని ఎవ్వరూ దాటలేరు. కావున నేను మీకొక ఉపాయం

చెప్తాను. మాండవ్యముని శాపంవలన ఆ పతివ్రత భర్త మరణించకుండా మీరుచెయ్యండి; నేను ఎప్పటిలాగా సూర్యోదయమై, అహోరాత్రాలు ఏర్పడేటట్లు చేస్తాను" — అని చెప్పింది.

అందులకు దేవతలు సంతసించి అంగీకరించారు. అంతట అనసూయాదేవి దేవతలను వెంటబెట్టుకొని పతివ్రతాతిలకమైన ఆ బ్రాహ్మణపత్ని గృహానికి వెళ్ళింది. ఆమె క్షేమ సమాచారాలు అడిగింది —

"కళ్యాణీ! నీవు నీభర్తను దేవతలకంటె ఎక్కువగా భావిస్తున్నావుకదా? ఆయన ముఖారవిందాన్ని చూస్తూ ఎల్లప్పుడూ సంతోషిస్తున్నావుకదా? ఓ, సాధ్వీ! పతిశుశ్రూష చేయడంవల్లనే నేను ఇష్టార్థ సిద్ధిని పొందాను. పుణ్యవతినై ధన్యురాలనయ్యాను. ఎల్లప్పుడూ నీమంగా పతిశుశ్రూషకావించే సతులకు లోకంలో పొందరానిది ఏదీ లేదమ్మా. స్త్రీలకు ఉపవాసాలు, వ్రతాలు, తీర్థస్నానాలు, దానాలు, దేవపూజలు- వీటితో పనేలేదు. భర్తను భక్తితో ఆరాధిస్తే చాలు- సమస్తకోర్కెలూ వాటంతటఅవే లభిస్తాయి. పుణ్యగతులుప్రాప్తిస్తున్నాయి. ఓ,కళ్యాణీ! నీవెంతో ధన్యురాలవు, వినీతవు, పుణ్యచరిత్రవు. నీవు నీ భర్తను ఎల్లప్పుడూ భక్తితో సేవిస్తున్నావు. దైవంకంటె మిన్నగా చూచుకొంటున్నావు. పూజలతోను, వినయోపచారాలతోను గౌరవిస్తూ ఆయనను సంతుష్టిపరుస్తున్నావు. ఓ, పతివ్రతామణీ! ఈ భూవలయంలో ఏ స్త్రీ కూడా నీకు సాటిరాదు!" అని అనసూయాదేవి పలికింది.

అత్రిమహాముని భార్య అనసూయాదేవి ఈ తీరుగా ప్రియవచనాలు పలుకగా కౌశికుని భార్య విని ప్రీసన్నురాలైంది.

''అమ్మా! అనసూయాదేవీ! నీ రాకవలన మా గృహం పావనమైంది. నీ దర్శనంవలన ధన్యురాలనైనాను. నీ అనుగ్రహంవలన దేవతాదర్శనానికి యోగ్యురాలనైనాను. నాకు ఎల్లప్పుడూ భర్తసై భక్తి తోలగకుండా ఉండేటట్లు అనుగ్రహించు తల్లీ''— అని అనసూయకు మ్రొక్కి, మళ్ళీ ఈ విధంగా పలికింది : —''తల్లీ ! నీవు ఎంతో ఆదరముతో నా గృహానికి అరుదెంచావు. నావల్ల నీకు కాగల పని ఏమిటి? ఆజ్ఞాపించు తల్లీ—''

ఈ విధంగా ఆ పతివ్రత అనుగా, తిరిగి అనసూయా దేవి ఈ రీతిగా పలికింది :

''ఓ, సాధ్వీ ! నీ ఆజ్ఞవలన సూర్యుడు ఉదయించడం మానుకొన్నాడు. ఇప్పుడు సృష్టి యావత్తూ చిక్కుల్లో చిక్కి పోయింది. దేవతలంతా వచ్చి నన్ను వేడుకొన్నారు. వారి వేడుకోలు విని నేను నీవద్దకు వచ్చానమ్మా. సూర్యుడు ఉద యించనందున పగలు శూన్యమైపోయింది. పగలన్నది లేక పోవడంవలన సమస్త కర్మలూ నశించాయి. కర్మనాశనం చేత స్వర్గవాసులందరికీ పుష్టిహీనత కలిగింది. ఆ కారణం చేత అనావృష్టి సంభవిస్తుంది. దానివలన జగత్తు యావత్తూ నశిస్తుందమ్మా. కావున నీవు దేవతల హితంకోసం పూర్వ ప్రకారం సూర్యోదయ సూర్యాస్తమయాలు సాగిపొయ్యే టట్లు అనుగ్రహించి లోకాలను ఉద్ధరించవలసినది—''

అందులకు కౌశికుని భార్య అయిన పతివ్రత ఈవిధంగా బదులు చెప్పింది :

"అమ్మా ! సూర్యోదయం అయితే నా భర్త మరణిస్తాడని మాండవ్యుడనే మహాత్ముడు శాపం పెట్టాడు. అందువలన సూర్యోదయం కావడం నాకు సమ్మతంకాదు—"

అది విని అనసూయాదేవి —

"ఓ, సాధ్వీ! పతివ్రతలైన స్త్రీలందరూ నావలన అభివృద్ధి కాంచుతున్నారు. నీవు పరమ పతివ్రతవు. కావున నీ భర్త చనిపోయినట్లయితే నేను మళ్ళీ అతన్ని బ్రదికించి చిరాయువుగా చేస్తున్నాను—" అని పలికింది.

తాపస్విని, అత్రిమహాముని పత్ని అయిన అనసూయాదేవి ఈ విధంగా పలుకగా పతివ్రత అయిన ఆ బ్రాహ్మణ సతి సంతోషించింది. చేతులు జోడించి భక్తితో —"ఓ, సూర్యభగవానుడా! శీఘ్రంగా ఉదయించు స్వామీ" అని ప్రార్థించింది.

అంతట చీకట్లను చీల్చుకుంటూ, దిక్కులనిండా దీప్తి వెదజల్లుతూ, అరుణకాంతులతో సూర్యభగవానుడు ఉదయాద్రిపై పొడుచుకొని వచ్చాడు.

ఆ విధంగా పది రాత్రులు గడచినపిదప సూర్యోదయం అయింది. వెంటనే మాండవ్యముని శాపంవలన ఆ పతివ్రత భర్త అయిన కౌశికుడు మరణించాడు. అప్పుడా సాధ్వి, మహాదుఃఖంతో భర్త కళేబరం క్రిందపడకుండా విపొది పట్టుకొన్నది.

అప్పుడా పతివ్రతను చూచి అనసూయ —"అమ్మా! చింతించకు. పతి శుశ్రూషాతపోబలంవలన నేను ఇప్పుడే నీ భర్తను బ్రతికిస్తున్నాను చూడు—" అని చెప్పి, తిరిగి ఈ విధంగా పలికింది :

రూపంలోనేమీ, శీలంలోనేమీ బుద్ధిలోనేమీ, వాక్కులోనేమీ, విజయాది గుణాలలోనేమీ—నా భర్తతో సాటి మరొక పురుషుడు లేడని నేను దృఢంగా నమ్ముతున్నమాట సత్యమే అయినట్లయితే — చనిపోయిన ఈ బ్రాహ్మణోత్తముడు తక్షణమే జీవించి, రోగరహితుడై, యౌవనుడై, భార్యాతాను నూరేండ్లు సుఖంగా వర్ధిల్లుగాక! నేను మనోవాక్కాయకర్మములందునూ, ఎల్లప్పుడూ భక్తితో పతిశుశ్రూష చేసే దాననైతే ఈ బ్రాహ్మణుడు తక్షణమే జీవించుగాక!"—

తపస్విని, పుణ్యవతి అయిన అనసూయాదేవి ఈ విధంగా పలుకగానే కౌశికునకు ప్రాణాలు వచ్చాయి. అతను లేచి కూర్చున్నాడు. అతని కుష్ఠువ్యాధి పోయింది. ఎక్కడ లేని తేజస్సు, సౌందర్యం, యౌవనం అతనికి వచ్చాయి. నవ మన్మథాకారుడై దివ్యరూపంతో తేజరిల్లసాగాడు. అప్పుడు దివిని దేవదుందుభులు మ్రోగాయి. పూలవానలు కురిశాయి.

అంతట బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది దేవతలంతా మెచ్చి అనసూయాదేవితో—

"ఓ, కళ్యాణీ! నీవలననే ఈ దేవతల కార్యం చక్కబడింది.

నీ మూలంగానే మళ్ళీ సూర్యోదయమై లోకాలు ఉద్ధరింపబడినాయి. ఓ, పుణ్యవతీ! మేమెంతో సంతుష్టి

చెందాము. నీకు కావలసిన వరం కోరుకో - ఇస్తున్నాము”
అని పలికారు.

అప్పుడా అనసూయాదేవి—బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు
లను చూచి—

“ఓ దేవతలారా! నాకు పుత్ర ప్రాప్తి కలిగేటట్లు
అనుగ్రహించండి. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురూ
నాకు పరమయోగ్యులైన పుత్రులై పుట్టేటట్లు వరం ప్రసాదిం
చండి” అని కోరింది.

అప్పుడా త్రిమూర్తులు, తపస్విని అయిన అనసూయా
దేవికి కోరిన వరం ఇచ్చి, మళ్ళీ తమ తమ లోకాలకు వెళ్ళి
పోయినారు.

---

## 8. సుకన్యా చరిత్రము

వ్యాసమునీంద్రుడు జనమేజయ మహారాజునకు ఈ
విధంగా చెప్ప దొడగాడు :

ఓ, జనమేజయ నృపాలా! వైవస్వతుని కుమారుడు,
ఆర్యుడు అయిన శర్యాతి మహారాజు నాలుగువేలమంది
భార్యలను పెండ్లాడాడు. వారందరూకూడా పుణ్యచరితలు,
సౌందర్యవతులు, సర్వలక్షణ సంపన్నలు. అందరికీకూడ
భర్తయెడల ఎంతో ప్రేమ. ఎల్లప్పుడూ భర్తకు ప్రీతి
చేకూరుస్తూ ఉన్నారు. ఆ మహారాణు లందరికీ ఒక్కతే

కుమార్తె. ఆమె పేరు సుకన్య. ఆ అమ్మాయి చాలా చక్కనిది. ఆ పిల్ల అంటే తల్లులందరికీ పంచప్రాణాలు. తండ్రికి ఎంతో గారాబం. అందువలన ఆ రాజపుత్రుల ఇంట పెరిగిన సుందరాంగి అయిన సుకన్య ఎంతో అల్లారుముద్దుగా పెరుగుతూ వచ్చింది.

ఆ శర్యాతి మహారాజు నగరానికి కొంచెం సమీపంలో ఒక సుందరమైన సరోవరం ఉన్నది. మానస సరోవరానికి సాటివచ్చే ఆ సరోవరం, నిర్మలజలంతో నిండి అత్యంత కమనీయమై శోభిల్లుతున్నది. హంసలు, కారండవములు, చక్రవాకములు, దాత్యూహములు (నానకోయిలలు), సారసములు, మొదలైన సమస్త పక్షిసమూహములతోను, అనేక విధాలైన పద్మాలతోను, తుమ్మెదలతోను ఆ తటాకం మనోహరమై ఒప్పుతున్నది. సరోవరం చుట్టూ సుభ్రప్రదమైన నానారకాల వృక్షాలు ఉన్నాయి. సాలవృక్షాలు, చీకటి మ్రానులు, దేవదారు చెట్లు, పున్నాగలు, అశోకలు, వట వృక్షాలు, కదంబ వృక్షాలు అరటిచెట్లు, నేరేళ్ళు, మాదీఫలాలు, ఖర్జూరాలు, పనసలు, నారికేళాలు, కోవిదారాలు, మొగలి మొదలైన వృక్షాలున్ను, ఇంకా అడవి మల్లె, మల్లిక, మోదుగ, నింబ, మారేడు, ఉశిరిక, ఖదిర ఆదగాగల నానారకాల చెట్లున్ను ఆ సరోవర ప్రాంతంలో నిండిఉన్నాయి. ఆ చెట్లపైనుండి ఎల్లప్పుడూ కోకిలాది పక్షి సంతతులు మనోహరంగా కూస్తుంటాయి. ఆ రమణీయమైన సరోవర ప్రాంతంలో, సమీపంగా అల్లిబిల్లిగా అల్లుకొనివున్న వృక్ష సమూహాల మధ్య, మంగళప్రదమైన ఒకచోట, శాంతుడై,

ఏకాంతస్థుడై భార్గవచ్యవను డనే మహాముని తపము సలుపుతున్నాడు. ఆవిధంగా ఆ మహాముని, మౌనియై, విజన సంస్థితుడై, వృక్షాసనం వేసుకొని, జితేంద్రియుడై, కదలక - మెదలక, వచ్చి గంగ అయినా పుచ్చుకోక, అంబను ధ్యానిస్తూ అనేక సంవత్సరాలుగా ఉగ్రతపస్సు చేస్తూ వచ్చాడు. అప్పాడా చ్యవనమహాముని శరీరమంతటా పుట్ట పెరిగింది. చుట్టూ నెర్రె మట్టి ముద్దలాగా ఏర్పడి, ఆకులు, తీగెలు అల్లుకొనిపోయినవి. చిన్న చిన్న పురుగులు అందందు పారాడ జొచ్చాయి.

ఇట్లా ఉండగా కొంతకాలానికి శర్యాతి మహారాజు తన రాణులను వెంటబెట్టుకొని, పరివారసమేతుడై ఆ సుందర సరోవరప్రాంతానికి విహారంచేయ వచ్చాడు. వచ్చి తన రమణీమణులతో ఆ సరస్సున జలక్రీడ లాడుతూ, యథేచ్ఛగా విహరిస్తూ కొంతకాలం అక్కడే ఉన్నాడు. అప్పుడు శర్యాతి కుమార్తె అయిన సుకన్య సర్వాభరణభూషితయై తన చెలికత్తెలను వెంటబెట్టుకొని, ఆ వనంలో విహరించసాగింది.

ఆవిధంగా ఆ చంచలాక్షి చంచల (మెరుపుతీగ) లా సంచరిస్తూ అందంను పూలుకోస్తూ తుద కొకచోట, చ్యవన మహామునిపై పెరిగియున్న పుట్టను చూచింది. ఆ పుట్టలో నుంచి చ్యవనమహాముని కండ్లురెండూ రెండు మిణుగురు పురుగులవలె, మిణుకుమిణుకుమంటూ ఆమెకు అగుపించాయి. ఆమె పుట్టను సమీపించి, ఆటగోడితనంవల్ల ముల్లుతీసుకొని ఆ పుట్టను త్రవ్వబోయింది. అప్పుడు చ్యవనమహాముని సుకన్యను చూచి—

"ఓ సుందరీ! వాడియైన ముల్లుతీసుకొని ఈ పుట్టను త్రవ్వబోతున్నావు, త్రవ్వకు సుమా! నేను తాపసుడను, దూరంగా వెళ్ళు"—అని సన్నని కంఠస్వరంతో పలికాడు.

అయినా సుకన్య ఆ మునిమాటలు వినిపించుకోక, బాల్యచాపల్యంవలన, దైవప్రేరణంవలన ఇదేమిటా ? చూదామని పోయి, తీక్షణమైన ముల్లుతో ఆ పుట్టరంధ్రాలలో పొడిచింది. దానివలన చ్యవనమహాముని కళ్ళుపోయినవి. అంతట సుకన్య—'అయ్యో! ఎంతపని చేశానని కొంతసేపు చింతించింది. కాని మళ్ళీ ఆటలుమరిగి ఆ విషయం మరిచిపోయింది. ఎప్పటిలాగా చెలికత్తెలకూడి విహరించసాగింది. తరువాత చ్యవనుడు నేత్రహీనుడై వేదన సహించలేక పరితపించసాగాడు. అంతలో దాని ఫలితంగా శర్యాతిమహారాజునకు, ఆయన సైన్యానికీ శకృన్మూత్రాలు బంధించుకొనిపోయినవి. అంతట సైనికులువచ్చి ఆ విషయం మహారాజుకు విన్నవించుకొన్నారు. ఏనుగులకు, గుఱ్ఱాలకు, సమస్త సైనికజనానికి మలమూత్రాలు బంధించి పోయినవనీ, ప్రాణాపాయం సంభవించనున్నదనీ చెప్పారు. ఒక్కపెట్టున అందరికీ ఈ విధంగా అవడానికి కారణ మేమిటని శర్యాతిమహారాజు మిక్కిలి చింతించాడు. మళ్ళీ పరివారంతో తన గృహానికి వెళ్ళాడు. తన రాజ్యంలో ఈ దుష్కృత్యానికి ఒడిగట్టినవా డెవడైవుంటా డని శంకించాడు. తర్వాత సైనికులను పిలిచి—

"ఈ నగరానికి సమీపంలోగల సరోవరానికి పశ్చిమాన వనమధ్యంలో తపోధనుడైన చ్యవనమహాముని తపస్సు చేసుకొంటున్నాడు. ఆ మహాత్ముడికి ఎవరైనా అపకారం

చేశారా? అగ్నివంటి తేజోవంతుడైన ఆ మహాతాపసికి ఎవ రైనాసరే తెలిసిగాని, తెలియకగాని కొంచెమైనా పీడ కలిగించారా? చెప్పండి! నాకు చూడబోతే వృద్ధుడైన ఆ మహాత్ముడికి ఎవరో, ఏదో అపకృతి కావించారని తోస్తున్నది. ఇది నిశ్చయం. ఎవరో ఆ మునిశ్రేష్ఠునికి పీడ కలిగించడం వల్ల ఆయనే మనకీశాస్తి చేశాడు. ఆ అపరాధి ఎవడో తెలిస్తే చెప్పండి?'' అని కఠోరంగా అడిగాడు.

అప్పుడా సైనికులు భయంతో గడగడలాడిపోతూ ''మహాప్రభో! మనోవాక్కాయకర్మలా మేము యే దోషం చెయ్యలేదు. మేము ఏపాపమూ ఎరుగము'' అని విన్నవించుకొన్నారు.

అని తెలిపి వ్యాసమునీంద్రుడు మళ్ళీ యీ తీరుగా చెప్పసాగాడు :—

## 2

ఓ జనమేజయనృపాలా! సైనికులు తాము నిరపరాధులమని చెప్పిననూ వినక, శర్యాతిమహారాజు కోపము, శోకము ముంచుకొనిరాగా ఆ సైనికజనాన్ని కఠినంగా శిక్షించడం మొదలుపెట్టాడు. ఆవిధంగా తండ్రి చింతాక్రాంతుడు కావడం, జనం పీడించబడటం చూచి సుకన్య తండ్రివద్దకు వచ్చింది. తానుచేసిన అపరాధం ఈ విధంగా తెలిపింది—

''నాయనా! నేను వనంలో ఆడుకుంటూ ఉండగా ఒకచోట నాకు ఒక పుట్ట కనిపించింది. చుట్టూ ఆకులు,

తీగెలు అల్లుకొనివున్నాయి. ఆ పుట్టకు రెండు రంధ్రాలు కనుపించాయి. ఆ రంధ్రాలలోనుంచి ఖద్యోతాలవలె మినుకు మినుకు మని కాంతి ప్రసరించింది. అవి మిణుగురుపురుగులు అను కొని నేను ముల్లుతో ఆ రంధ్రాలను పొడిచాను. అప్పుడు వెం దుండి జలం స్రవించింది. అంతేకాక మందంగా ఆర్తనాదం కూడా వినిపించింది. ఇదేమిటబ్బా అని నేను విస్మయమును చెంది వెనక్కు తిరిగి వచ్చాను. అవిధంగా నేను ముల్లుతో దేనిని పొడిచానో నాకు తెలియదు. అదేమిటో నేను చెప్ప లేను. కాని నాయనా! జరిగిన విషయం ఇది!''—

ఈ విధంగా తన కుమార్తె సుకన్య చెప్పినమాట విని శర్యాతి, అదే మునివర్యునికి జరిగిన అపరాధమని నిశ్చ యించుకొన్నవాడై వెంటనే వనానికి వెళ్ళాడు. మెల్లగా ప్రయత్నించి ఆ పుట్టనంతా తొలగించి, అంధ నేత్రవ్యథాసు, దుఃఖితుడు అయివ చ్యవన మహామునిని చూచాడు. చూచి సాష్టాంగ దండప్రణామం ఆచరించి వినయంతో ఈ విధంగా అన్నాడు—

ఓ మునివర్యా! నా కుమార్తె అజ్ఞానంవలన మిమ్మ లను నొప్పించింది. అందులకు ఆగ్రహించవలదు స్వామీ. అది పసిపిల్ల. తెలియకచేసింది. తాము తపోధనులు. ఆగ్ర హం తగదు. కనుక దానితప్పును క్షమించండి మహాముని''—

శర్యాతి చెప్పింది విని, చ్యవనమహాముని ఈవిధంగా బదులుపలికాడు :—

"ఓ, రాజా! నీ కుమార్తె నా కీవిధంగా కళ్ళు పోగొట్టినందుకుగాను, నేను కొంచెమైనా కోపం తెచ్చుకో

లేను. మనస్సులోనైనా ఆ విషయం తలపోయలేను. కనుక నీకూ నీ పరిజనానికీ, ఈరీతిగా దుఃఖం సంభవించడానికి నేను శాపం పెట్టానని నీవు ఎంతమాత్రం అనుకోవద్దు మహారాజా! ఎవ్వరికీ ఏ అపకారం చెయ్యక తపస్సు చేసుకొనే దేవభక్తులకు, ఎవరు కీడు ఒనరించినా శివుడు వారిని ఊరుకోడు మహారాజా! వారికి సుఖం చేకూర్చడు. కావున ఇది భగవంతుడు చేసిన పని. కాని నేనా వృద్ధుడను. పైగా గ్రుడ్డి వాడనైనాను. ఇక నాకు పరిచర్య చేసేవా రెవరున్నారు? ఓ రాజా! నాకు సంభవించిన ఈ దీనస్థితిని తలుచుకొని దుఃఖిస్తున్నాను."

అంతట శర్యాతి మహారాజు, చ్యవనమునితో ఈవిధంగా అన్నాడు:

"ఓ, మునివర్యా! తమకు ఉపచారం చెయ్యడానికి కావలసినంతమంది సేవకులను పంపుతాను. వారు నిరంతరం మీవద్దనుండి పరిచర్యలు చేస్తారు. కనుక ఇకనైనా తపోధనులు, అల్పకోపులు అయిన తాము కోపం ఉడిగి శాంతించండి".

శర్యాతి పలుకులు విని చ్యవనముని –

"ఓ, రాజేంద్రా! అంధుడను, వృద్ధుడను, నిరంతరం నిష్ఠతో తపస్సు చేసుకొనేవాడను అయిన నాకు నీవు పంపే సేవకులు ఏంచెయ్య గలుగుతారు? వారివలన నా ఆచారాది కర్మలు ఏవిధంగా నెరవేరుతాయి. కనుక నాకు సపర్యలు చేయడానికి నీ కుమార్తెను పంపవలసినది. నేను సంతోషంగా

తపస్సు చేసుకుంటూ ఉంటాను. ఓ, నరేంద్రా! మనస్సులో ఏమాత్రం సందేహించక నాకు కన్యాదానం చెయ్యి. దాని వల్ల నేను సంతృప్తి చెందుతున్నాను. కులాచార ప్రకారం నా తపస్సు యథావిధిగా సాగిపోతుంది. నీకూ, నీ ప్రజానీక జనానికెన్ని సుఖము, శుభము చేకూరుతుంది. ఓ, రాజా! చేసిన తప్పుకు నిజంగా పశ్చాత్తాపం చెప్పుకు నేనాశాస్త్రతే— న్యాయప్రకారం నీ కుమార్తెను నాకిచ్చి పెండ్లి చెయ్యి. సందేహింపకు. తాపసులమైన మాకు కన్యాదానం చెయ్యటంలో నీ కెంతమాత్రం దోషంలేదు" అని చెప్పాడు.

ముని పలుకులు విని శర్యాతి మహారాజు మిక్కిలి చింతాక్రాంతుడైనాడు –

"అయ్యో! ఇప్పుడేం చేసేది? ఈయన ముసలివాడు, పైగా గ్రుడ్డివాడు, ముని. ఎల్లప్పుడూ అరణ్యాలలో కఠోరమైన తపస్సు చేసుకొనేవాడు. ఇటువంటివాడికి దేవకన్య లాంటి నాకుమార్తె సుకన్యను ఎట్లా యిచ్చి పెండ్లి చేసేది? ఈ మునిని భర్తగా పొంది సుకుమారి అయిన నా కూతురు ఏ విధంగా సుఖపడుతుంది? మంచీ–చెడ్డా తెలిసినవాడైనా తన సుఖంకోరి, ఈవిధంగా కుమార్తెగొంతు కోస్తాడా? కన్నకూతురు కాపురాన్ని పాడుచేసి, ఆమెకు సుఖంలేకుండా చేస్తాడా? అట్లా చేస్తే అతనికి కీర్తి వస్తుందా? అయ్యో! యౌవనం, రూపం కలిగి మన్మథబాణాగ్నిలో వేగిపోతున్న నా కుమార్తె – వృద్ధుడు, అంధుడు అయిన ఈ తాపసిని భర్తగా వరించి బ్రతికినంతకాలం ఎట్లా కాపురం చేస్తుంది? అందచందాలుగల ఆడపిల్లలెప్పుడూ తమకు అన్నివిధాలా

తగిన భర్తలే కావాలని కోరుకుంటారు. యావనవతులైన కాంతలు ఇటువంటి కురూపినిపొందలేరు. పొంది సుఖపడనూ లేరు. పూర్వం తాపసుడైన గౌతముని భర్తగాపొంది అహల్య కష్టాలపాలు కాలేదా? దేవేంద్రుని పొందు ఆశించ లేదా?

ఆవిధంగా ఇంద్రునిచేవంచింపబడిన అహల్యను గౌతముడు శపించాడు. ఆమెఆరని—తీరనిశోకంలోమునిగిపోయింది. అట్లాగే ఈ వృద్ధువాని కిచ్చి పెండ్లిచేస్తే నా కుమార్తెకుమాత్రం కీడు మూడకుండా వుంటుందా? కనుక లోకంలో ఆడపిల్ల లకు అనుకూలదాంపత్యం సుఖకరం. అననుగుణ దాంపత్యం కన్న నీచమైనది మరొకటిలేదు"—అని ఈవిధంగా శర్యాతి మహారాజు పరిపరివిధాల చింతించి, తన కుమార్తెను చ్యవన మునికి యివ్వడానికి మనస్కరించక మళ్ళీ తన గృహానికి వచ్చాడు. మంత్రులను పిలిచాడు. విషయమంతా వారితో చెప్పాడు :—

"నా కుమార్తె నిచ్చి పెండ్లి చెయ్యమని చ్యవనముని కోరాడు. ఇవ్వనిపక్షంలో మనము కష్టాలపాలు కావలసి వస్తుంది. రెండువిధాలా చిక్కుగానేవున్నది. ఏం చెయ్యాలో తోచడంలేదు. ఇందుకు మీ రేం సలహాచెపుతారు"—అని అడిగాడు.

అప్పుడు మంత్రులు—"మహారాజా! దుర్భగుడైన ఆ మునికి సుకుమారి, సుందరాంగి అయిన సుకన్యనిచ్చి వివాహం చెయ్యడం మాకున్నూ ఎంతమాత్రం సమ్మతం కాదు"—అని చెప్పారు.

ఈవిధంగా మహారాజున్నూ, మంత్రులున్నూ చింతాక్రాంతులై సంభాషిస్తున్న సమయాన సుకన్యా నారి మనోవ్యథను తెలుసుకొని అక్కడికి వచ్చింది. తండ్రితో యీ విధంగా పలికింది :—

“నాయనా ! నా కోసం మీ అందరికీ యింత ఆపద రావడం కూడదు. నేనువెళ్ళి గ్రుడ్డివాడైన ఆ మునికి సేవ చేస్తాను. ఆయన దయకు పాత్రురాల నవుతాను. నన్నాయన కిచ్చి పెండ్లిచెయ్యండి. ఈ వ్యాకులం వదలి మీరంతా స్వస్థ చిత్తులుకండి. సుఖంగా వుండండి నాయనా.”

సుకన్యమాటలు విని శర్యాతిమహారాజు, మంత్రులంతా వింటూవుండగా—

“అయ్యో ! నా చిన్నారితల్లీ ! ఆ వనాలలో నీ వెట్లా వుంటావమ్మా ? సుకుమారివే ! వృద్ధుడు, గ్రుడ్డివాడు, మహాకోపి అయిన ఆ చ్యవనమునికి నీ వెట్లా సేవలు చేస్తావుతల్లీ ? నా సుఖంకోసం రతీదేవివంటి నిన్ను, ఆ ముసలివాడికి కట్టబెడతానా ? వద్దమ్మా ! ఐశ్వర్యం, అందం, యౌవనం—అన్నీ ఉన్న సుందరపురుషులకే నిన్నుపొంద సాధ్యంకాదు. అటువంటి విశాలాక్షివి, మృదుభాషిణివి అయిన నిన్ను—నీ తండ్రి ఒక వృద్ధుడికి ఇచ్చి పెండ్లి చేస్తాడటమ్మా ? ఇది ఎంతమాత్రం ధర్మంకాదు. భర్తయేమో మూడుగాళ్ళ ముదుసలి. పైగా గ్రుడ్డివాడు. పైపెచ్చు మహాకోపి. వీటికితోడు కాపురమా అరణ్యాలలో. మహారాజునైన నా కడుపునపుట్టిన నిన్ను ఇటువంటివాడి కిచ్చి పెండ్లిచేస్తే నాకు పుట్టగతులుంటాయా తల్లీ ? అమ్మా ! చెపుతున్నాను విను—సైనికులంతా చనిపోయినా

సరే. నా రాజ్యం యావత్తూ నాశనమైనాసరే, నేనే లేకుండా పోయినాసరే, మరేమైనాసరే—నేను భయపడను. చలిం చను నిన్నా కళ్ళులేని ముసలివాడికిమాత్రం యిచ్చి పెళ్ళి చెయ్యను. కానున్నది కాకమానదు. జరిగేది జరిగితీరుతుంది. ధైర్యంమాత్రం వీడను తల్లీ!"—అని పలికాడు.

అంతట తండ్రిమాటలు విని సుకన్య ప్రసన్నవదనయై అత్యంత ప్రియంతో యీవిధంగా బదులు పలికింది—

"తండ్రీ! మీ రీవిధంగా మాట్లాడటం న్యాయం కాదు. ఆ మునివర్యుని ముసలివాడంటున్నారే—కాదు. ఆయన లోకపావనుడు. మహానుభావుడు. భోగా లనుభవించా లన్న ఆకాంక్ష నా కేమాత్రం లేదు. ఆ తపోధనుని భర్తగా పొంది—నిత్యం సేవిస్తూ వుంటాను. పతి శుశ్రూషకంటె సతికి మరేంకావాలి. పైగా నావలన సమస్తజనులకు సుఖం కల్గు తున్నది. నాకు కావలసింది అదే తండ్రీ! వనాలకు వెళ్ తాను. ఆ మునివర్యుని సేవిస్తాను. ఆయనమాటకు ఎదురాడక భక్తితో పూజిస్తాను. మీకు కీర్తితెస్తాను తండ్రీ. కనుక మీరు చింతించక నన్నా తాపసుని కిచ్చి పెండ్లిచెయ్యండి."

ఈ విధంగా సుకన్య నిశ్చయించుకోవడం చూచి అక్కడున్న మంత్రులంతా విస్మయం చెందారు. శర్యాతి మహారాజుకూడా మిక్కిలి ఆశ్చర్యపోయినాడు.

తరువాత శర్యాతిమహారాజు సంతోషంతో చ్యవన మహాముని సన్నిధికి వెళ్ళి ఆయనకు నమస్కరించి—

"ఓ, మహాత్మా! నా కుమార్తెను మీకు పరిచర్యలు చేయడానికి పంపుతున్నాను. విధివిధానంగా మీ కిచ్చి వివా

హం చేస్తాను. దయచేసి స్వీకరించి నన్ను కృతార్థుని చెయ్యండి" అని పలికి, శాస్త్రోక్తంగా సుకన్యను చ్యవనమహా మునికి ఇచ్చి పెండ్లి చేశాడు. చ్యవనముని సంతుష్టాంత రంగుడై, పరివారము - ధన ద్రవ్యాదులు - మరేవీ గ్రహిం చక కేవలం సుకన్యను మాత్రం పరిగ్రహించాడు. ఆ వివాహం తోనే శర్యాతిమహారాజుకు, ఆయన సైనికులకు, జనులకు సౌఖ్యం చేకూరింది. పూర్వం వాటిల్లిన ఆపద తొలగిపోయి అందరికీ సంతోషం కలిగింది. తదనంతరం శర్యాతిమహారాజు తన గృహానికి పయనమవుతుండగా చూచి సుకన్య -

"నాయనా! నా కీ సొమ్ములు, విలువైన చీరెలు అక్కర్లేదు. వీటిని తీసికొని నాకు జింక చర్మాలు, నార చీరెలు ఇవ్వండి. మునిపత్నీ వేషం ధరిస్తాను. నా భర్తకు సంతోషము, మీకు యశస్సు, నాకు ముక్తి చేకూరేటట్లు ప్రవర్తిస్తాను. ఇక మీరు నన్నుగురించి ఏమాత్రం విచారించ పనిలేదు. నా శీలాన్ని గురించి మీరు శంకించ నవసరంలేదు. మీ కుమార్తె మీ కెన్నడూ అపకీర్తి తీసుకురాదు. తాపసి వేషం తాల్చి- వృద్ధుడు, అంధుడు, మహానుభావుడు అయిన నా భర్తను ఎల్లప్పుడూ భక్తితో సేవిస్తూ ఉంటాను. అన సూయాదేవి అత్రిమహామునిని సేవించినట్లుగాను, అరుంధతీ దేవి వశిష్టమహామునిని కొలిచినట్లుగాను నేను ఈ మునిశ్రేష్ఠుని కొలుస్తాను. మీరు నిశ్చింతగా ఉండండి" అని చెప్పింది.

పరమధర్మాత్మురాలైన కుమార్తె పలుకులు విని శర్యాతిమహారాజు, కన్నుల అశ్రువులు రాల ఆమెకు జింక చర్మాలు, నారచీరెలు ఇచ్చాడు. అప్పుడు సుందరాంగి

అయిన సుకన్య తన సొమ్ములు, చీరెలు వలిచిపెట్టి, ముని పత్ని వేషం తాల్చింది.

ఓ, జనమేజయ మహారాజా! అప్పుడు రాజసేవకు లందరూ ఆ సుకుమారిని చూచి బిగ్గఅగా రోదనం చేశారు. ఆ సాధ్వి శీలం ఎంతటిదో చూచారా ?

తరువాత శర్యాతి మహారాజు, వల్కలాజినములు ధరించి మహాతాపసివలె ఉన్న కుమార్తెను విడువలేక విడిచి పెట్టి, మంత్రి పరివార సహితుడై మళ్ళీ తన నగరానికి వెళ్ళి పోయాడు.

అని తెలిపి వ్యాసుడు, మళ్ళీ ఈ ప్రకారం చెప్ప సాగాడు :

## 3

ఆవిధంగా శర్యాతి వెళ్ళిపోయిన అనంతరం పతిసేవా పరాయణ అయిన సుకన్య - భక్తితో భర్తశుశ్రూష చేయసాగింది. అడవిలోకి వెళ్ళి నానావిధాలైన కందమూలా లను, ఫలాలను తెచ్చి భర్త ప్రక్కన ఉంచేది. అగ్నిహోత్రం చేసుకునేటందుకు ఎండు సమిధలు ఏరుకొనివచ్చి ఇచ్చేది. కమండలాన్ని తోమి శుభ్రపరిచేది. నిత్యకర్మలు నెరవేర్చు కునేటందుకు పువ్వులు, దర్భలు తెచ్చి ఆయనవద్ద పెట్టేది. భర్తను వేడినీళ్ళతో స్నానం చేయించి, కృష్ణాజినం పఱచి దానిపై కూర్చుండబెట్టేది—"స్వామీ ! ఇక మీ నిత్య కర్మలు నెరవేర్చుకోండి—" అని చెప్పేది. కర్మలు నెరవేర్చు కొనినపిదప ఆయనను చెయ్యిపట్టుకొని తీసుకొనివచ్చి ఆస

నంపై కూర్చుండచేసి, ఎంతో ప్రీతితో, నీవారాన్నమును, కందమూల ఫలాములతోను తృప్తిగా భోజనంపెట్టి సంతోష పరిచేది. పిదప కాళ్ళు చేతులు కడిగి – శయ్యాసనము తీసుకుని పొయ్యేది— "తాంబూలం సేవించండి స్వామీ—" అని తాంబూలం ఇచ్చేది. తరువాత భర్త ఆజ్ఞ గైకొని, ప్రాణాలు నిలుపుకోవడంకోసం తాను ఏ పండో, ఫలమో మాత్రం ఆరగించేది. తిరిగి వెంటనే భర్త సన్నిధికివచ్చి, వినయంగా – "పాదాలు ఒత్తమంటారా?" అని అడిగి ఆయన సంతో షించేటట్లు పరిచర్యలు చేసేది. మరల సాయంత్రం యాగానికి, హోమ ద్రవ్యాలన్నీ సంతరించి పెట్టేది. మధురఫలాలు తెచ్చి ఆయనకు కడుపార కుడువబెట్టి, భర్త తినగా మిగిలినవి తాను భుజించేది. తరువాత మెత్తని పాన్పు అమర్చి పతిని అందు పరుండబెట్టేది. అనంతరం పాదసేవచేస్తూ, ఆయనను పతి వ్రతా ధర్మాలు అడిగి తెలుసుకొనేది. ఆయన నిద్రించిన వెనుక, ఆయన పాదములచెంత తానూ పడుకొని నిద్రించేది. రాత్రివేళ మధ్యమధ్య లేచి మళ్ళీ భర్తకు ఉపచారాలు చేస్తూ, భక్తితో కొలిచేది.

వేసవికాలంలో భర్తకు తాపోపశమనార్థం, తాటా కుల విసనకఱ్ఱతో విసరుతూ ఆయనకు నిద్రపట్టునట్లు చేసేది. శీతాకాలంలో చలిమంటలువేసి, ఉష్ణోదకస్నానాలు చేయించి, ఉష్ణాన్న భోజనాదులు కుడువబెట్టి – "స్వామీ! మీకు సుఖంగా ఉంటున్నదికదా?" అని అడిగేది.

బ్రాహ్మీముహూర్తంలో లేచి, జలపాత్ర గైకొని, భర్తను శౌచార్థం ఆశ్రమానికి అనతిదూరానికి తీసుకొని

పోయి ఆయనను అక్కడ దిగవిడిచేది. తాను ఒక కనుమరుగు ప్రదేశంలో ఉండి, తరువాత మళ్ళీ ఆయనదగ్గరికి వెళ్ళి చెయ్యి పుచ్చుకొని ఆశ్రమానికి తీసుకొనివచ్చేది. ఆసనంపై కూర్చొబెట్టి, మట్టిచేత, జలంచేత ఆయన పాదాలు యథా విధిగా కడిగి శుభ్రపరిచేది. ఆచమనానికి నీళ్ళు ఒసగి, యథో క్తంగా పండ్లు తోముకొనుటకై దంతకాష్ఠం, వేడినీళ్లు తెచ్చి ఇచ్చేది.

"స్వామీ! దంతధావనం అయిందికదా! ఇంకేమి ఆజ్ఞ? ఇవిగో, వేడినీళ్లు సిద్ధంచేశాను. స్నానంచెయ్యండి స్వామీ! హోమసమయం సమీపిస్తున్నది–"అని ప్రియంగా పలికేది.

ఈవిధంగా పతిసేవాపరాయణయైన సుకన్య, ప్రతి నిత్యం భర్తయైన చ్యవన మహామునికి భక్తితో సమస్త పరి చర్యలుచేస్తూ, ఆయనకు ఏ కష్టమూ కలగకుండా తృప్తి పరుస్తూ, అతిథి, అభ్యాగతులను పూజిస్తూ, లోకం మెచ్చగా పతిసేవ కావిస్తూ వచ్చింది.

అంతట ఒకనాడు సుందరాంగి అయిన సుకన్య, ఆశ్ర మానికి అనతిదూరంలో ఉన్న తటాకానికి స్నానార్థం వెళ్ళింది. స్నానాదులు ముగించుకొని వస్తూ ఉండగా అంతకు మున్నే క్రీడార్థం అక్కడికి అరుదెంచి ఉన్న అశ్వినీదేవతలు ఆమెను చూచారు. ఆమె అసదృశ లావణ్యాన్ని చూచి ఆశ్చర్యచకితులైనారు. ఆమెను సమీపించి ప్రీతిపూర్వకంగా ఇట్లు పలికారు —

"ఓ, చారులోచనా ! ఒక్కక్షణంసేపు నిలువు. మేము అశ్వినీదేవతలము. నిన్నొక్కవిషయం అడుగుతున్నాం చెప్పు. ఓ, పంకజాక్షీ ! నీవు ఎవరి కుమార్తెవు ? నీ భర్త పే రేమి ? ఇక్కడికి ఎందుకొచ్చావు ? ఇప్పు డెక్కడికి వెడుతు న్నావు ? మృదువైన నీ పాదాలతో ముళ్ళు - రాళ్ళు ఉన్న ఈ నేలపై నడుస్తుంటే మాకు ఎంతో జాలివేస్తుంది. ఓ, సుందరాంగీ ! విమానంలో ఎక్కి సంచరించవలసిన నీవు- ఈ అరణ్యంలో కటికి నేలపై నడుస్తున్నావేమి ? నూరుమంది దాసీలను వెంట తీసుకొని రావలసిన నీవు, ఇట్లా ఒంటరిగా వచ్చావేమిటి? ఓ, జవ్వనీ ! నీవు రాకుమార్తెవా ? లేక అప్స రసవా ? నిన్నుకన్న తల్లి ఎంత ధన్యురాలోకదా! నిన్నుకన్న తండ్రి ఎంత పూజ్యుడోకదా ! నిన్ను చేపట్టిన భర్త ఎంత పుణ్యాత్ముడోకదా ! ఓ, వరాననా ! ఈ భూమిమీద నీ కలిమి ఉన్నదే-అది దేవలోకంలో కలిమికంటెకూడా అధికమై నదిసుమా ! ఈ వనంలో నిన్ను నిత్యం చూచే మృగాలు ఎంత భాగ్యంచేసుకున్నాయోకదా ! ఇక్కడ నిన్ను నిత్యం తిలకించే పక్షులు ఎంత పుణ్యంచేసుకొన్నవోకదా ! నీ పాదధూళివలన ఈ భూమి పావనమైందంటే నమ్ము. ఓ పద్మదళాయతాక్షీ ! నిన్ను పొగడడంకాదు. నిజంచెపుతున్నాము. నీభర్త ఎవరో, నిన్ను కన్నతండ్రి ఎవరో మాకు చెప్పు. ఆ కృతకృత్యులను దర్శించాలని మా కెంతో కుతూహలంగా ఉన్నది—"

అశ్వినీదేవతలు ఈరీతి పలుకగా విని సుందరాంగి అయిన సుకన్య ఎంతో సిగ్గుపడినది. తరువాత వారితో— "అయ్యలారా ! నేను శర్యాతి మహారాజు కుమార్తెను.

పూజ్యుడైన చ్యవనమహర్షి భార్యను. వృద్ధుడు, అంధుడు, అయిన నా భర్తకు అహోరాత్రులు శుశ్రూష చేస్తూ నే నిక్కడ ఉన్నాను. నా అనుమతిప్రకారం నా తండ్రి నన్నా మునీంద్రునకు ఇచ్చి వివాహం చేశాడు. మహానుభావుడు, సద్వర్తనుడు అయిన ఆ ముని ఆశ్రమం, అదిగో-అదే—అగు పిస్తున్నది. ఓ పుణ్యాత్ములారా! తాము మా ఆశ్రమానికి వచ్చి మమ్ము పావనం చెయ్యండి—'' అని చెప్పింది.

అప్పుడు దేవవైద్యులైన అశ్వినీదేవతలు సుకన్యను చూచి ఈవిధంగా పలికారు —

"ఓ, కళ్యాణీ! ఇంతటి లావణ్యవతివైన నిన్ను నీ తండ్రి- మహానుభావుడు, గ్రుడ్డివాడు, ముసలి అయిన ఒక మునికి ఇచ్చి పెండ్లి చేశాడా? అయ్యయ్యో! ఎంత అన్యాయం! నీకీ రాత రాసిపెట్టిన విధాతకు పాపం-పుణ్యంలేదా? మెఱుపు తీగలాంటిదానవు నీవు. సమస్తభూషణాలు పెట్టుకొని, చీని చీనాంబరాలు కట్టుకొని అంతఃపురాలలో సుఖించవలసిన నీ వీ విధంగా, నారచీరెలుధరించి తాపసివేషంలో వనాలలో సంచరిస్తున్నావా? ఓ, భామినీ! సౌందర్యంలో నీకు దేవ కన్యలుకూడా సాటిరారు. ఓ, విశాలాక్షీ! నవయౌవనంలో ఉన్న నీవు, ఆ గ్రుడ్డివానిని, వయసు మళ్ళినవానిని భర్తగా ఎట్లా వరించావు? అయ్యో! రూపంలో, వయస్సులో నీకు సరివచ్చే మరొక పురుషుని వరించకపోయినావా? ఓ, కోమలీ! జగదేకసుందరివైన నీ వెక్కడ? ఈ నార చీరెలు, వనవాసాలు, మునిసేవలు ఎక్కడ? ఈవిధంగా నీ యౌవనం అంతా వ్యర్థం చేసుకోవడం దేనికి? జీవితాన్ని నిష్ఫలం

చేసుకోవడం దేనికి? ఓ, సుందరీ! మా ఇద్దరిలో ఒక్కరిని వరించరాదా? వరించి స్వర్గలోకంలో, నందనవనంలో చైత్ర రథమున ఎల్లప్పుడూ మనోరథాలు తీర్చుకుంటూ స్వేచ్ఛగా విహరించరాదా? వృద్ధుడు, అంధుడు అయిన ఈ మునివలన నీకేమి ప్రయోజనం? నీవా, మహారాజు కుమార్తెవు, సుకుమారివి, సౌందర్యరాశివి, సమస్తభోగాలు అనుభవించవలసినదానవు. అటువంటి నీవు గ్రుడ్డివాడైన ఈ వృద్ధుని పొంది ఏమి సుఖిద్దా మనుకున్నావు? అయ్యో! ఈవిధంగా నీ సుఖమంతా ఎందుకు పాడుచేసుకొంటున్నావు? ఇటువంటి వానిని పొందినందువల్ల నీకు తగిన విహారాలు, సంసార సుఖాలు ఉండవుకదా? ఓ రాకుమారీ! సకల శుభలక్షణ సంపన్నవు, కోమలాంగివి అయిన నీవు కందమూలాదులు తిని, నీళ్ళు త్రాగుతూ, ఆ వృద్ధునికి దాసివై, దేహాన్ని శుష్కింప చేసుకుంటూ ఒంటరిగా యీ వనాలలో ఎందుకుంటున్నావు? ఇది నీకు మేలుగా తోచిందా? మహారాజపుత్రివి, విశాల నేత్రివి అయిన నీకు యీ మునివృత్తి తగదు. గ్రుడ్డివాడు, ముసలివాడు అయిన ఆ మునిసేవలో నీ సౌందర్యాన్ని యౌవనాన్ని, సుఖాన్ని పాడుచేసుకోవడం నీకు హాయిగా కనుపిస్తున్నదా?''——

ఓ జనమేజయనృపాలా! అశ్వినులు ఈవిధంగా పలుకగా సుకన్య విన్నది——

అని తెలిపి వ్యాసుడు మళ్ళీ యీవిధంగా చెప్పసాగాడు:——

# 4

అంతట సుకన్య అశ్వినీదేవతల పలుకులు విని ధైర్యం అవలంబించి వారి కీవిధంగా బదులు చెప్పింది—

"అయ్యలారా! మీ రిరువురూ సూర్యభగవానుని కుమారులు. సర్వజ్ఞులు. మీకు తెలియని విషయమంటూ లేదు. అటువంటి మీరు నిష్కారణంగా అన్యకాంతను, సాధ్విని అయిన నన్ను ఈవిధమైన మాటలు అనడం ధర్మమేనా? ఓ, అశ్వినీదేవతలారా? కశ్యపప్రజాపతి కుమారుడు, కర్మసాక్షి అయిన ఆ సూర్యభగవానుడు సమస్తమూ చూస్తున్నాడు. ధీరులు మీవంటివారు ఇటువంటి మాటలు ఎక్కడైనా మాట్లాడవచ్చునటయ్యా? నన్ను నాతండ్రి, మహానుభావుడు యోగి అయిన ఆ మునికిచ్చి వివాహం కావించాడు. నేను కులస్త్రీని. పుంశ్చలిని కాను. మీ రిక అధిక ప్రసంగాలు చెయ్యవద్దు. మీ రింకా ఇట్లాగే మాట్లాడితే శపిస్తాను—"

ఈ విధంగా పతిభక్తిపరాయణమైన సుకన్య కోపంగా పలికేటప్పటికి అశ్వినీదేవతలు, ఆమె శపిస్తుందేమోనని మిక్కిలి భీతిల్లారు. వెంటనే ఆమహాసాధ్విని ప్రసన్నురాలుగా చేయడంకోసం వినయంగా ఇట్లు పలికారు :-

"ఓ, కళ్యాణీ! నీవంటి శీలవతులు లోకంలో మరెవ్వరూ లేరు. మేము నీకొక వరం ఇస్తాం, తీసుకోవలసినది. దానివలన నీకు సౌఖ్యం చేకూరుతుంది. అందంలో అశ్వినీదేవతలను మించినవారు లేరని కవీశ్వరులంతా—మా అందాన్ని

పొగడుతూ ఉంటారు. నీ భర్తనుకూడా మావంటి రూపము, వయస్సు కలవానినిగాచేస్తాము. అప్పుడు నీవు మాముగ్గురిలో, నీ చాతుర్యంవలన ఎవరినో ఒకరిని వరిస్తావా? ఓ, వరాననా! ఇది నీకు సమ్మతమైతే చెప్పు. నీ భర్తను మావంటి రూప యౌవన సంపన్నునిగా చేస్తాము—"

దేవవైద్యులైన అశ్వినీదేవతలు ఈప్రకారం చెప్పగా సుకన్య విని విస్మయమందింది. వెంటనే ఆశ్రమానికి వెళ్ళి భర్తను చూచి— "స్వామీ! సూర్యపుత్రులైన అశ్వినీ దేవత లిరువురు తటాకంవద్ద నన్ను చూచారు. చూచి కామాతురులై 'ఓ కళ్యాణీ! ముసలితనము, గ్రుడ్డితనము పోయి నీ భర్తకు తక్షణమే మా ఆకారంలో సరియైన ఆకారం వచ్చేటట్లు చేస్తాము. అప్పుడు ఒకే ఆకారంలో ఉంటే మా ముగ్గురిలో నీ యిష్టంవచ్చినవానిని వరించు'— అని చెప్పారు. ఇందులో ఏదైనా కపటమున్నదేమో మహాత్మా! ఈ వృత్తాంతం తమకు ఎరింగించి, తమ ఆజ్ఞ ఎట్లా అయితే అట్లా చేద్దామని వచ్చాను" అని పలికింది.

భార్య, సుకన్య చెప్పినది విని, చ్యవనమహాముని సంతుష్టాంతరంగుడై—

"ఓ, కాంతా! దేవతలు సువ్రతులు. సత్యవాదులు. ఆడినమాట తప్పరు. కనుక వారి ఆజ్ఞను మన్నించడం మన కెంతేని శ్రేయస్కరం. కాబట్టి నీవు వెంటనే వెళ్ళి ఆ దేవ వైద్యులు శీఘ్రంగా ఇక్కడికి వచ్చే ఏర్పాటు చెయ్యవలసి నది" అని చెప్పాడు.

ఆవిధంగా సుకన్య, భర్త ఆజ్ఞగైకొని తిరిగి అశ్వినుల చెంతకు వెళ్ళి— "ఓ దేవతలాలా ! మీరు చెప్పిన విషయం నా భర్తకు ఎరింగించాను. ఆయన అందులకు సమ్మతించాడు. కనుక తాము అక్కడికి దయచేసి ఆవిధంగా చెయ్యండి" అని కోరింది. అంతట అశ్వినీదేవతలు సుకన్యవెంట చ్యవన ముని ఆశ్రమానికి అరుదెంచారు. ఆమెతో— "నీ భర్త యౌవనవంతుడు కావడానికై జలంలో మునుగవలసిఉన్నది" అని చెప్పారు. చ్యవనుడు అందులకు సమ్మతించి ఆవిధంగా చేశాడు. అప్పుడు అశ్వినీ దేవతలున్ను, చ్యవనుడున్ను తటాకంలో మునిగి లేచారు.

అప్పుడా ముగ్గురున్నూ ఒకేరూపంగా ఉన్నారు. ముగ్గురిదీ ఒకటే వయస్సు.

"ఓ, కాంతా ! దేవతలు సువ్రతులు. సత్యవాదులు. ఆడినమాట తప్పరు. ముగ్గురూ ఒకే యౌవనంలో ఉన్నారు. ముగ్గురివీ దివ్యదేహాలు. ముగ్గురుకూడా దివ్యకుండలాలు, దివ్యభూషణాలు ధరించి, అమిత తేజోవంతులై ప్రకాశిస్తున్నారు. అంతట వారు సుకన్యను చూచి —

"ఓ, కళ్యాణీ ! మా ముగ్గిరిలో నీకు ఎవనిపై అనురాగం ఉన్నదో అతనిని ఏరుకొనవలసినది"—అని చెప్పారు.

ఏకరూపధారులైన ఆ ముగ్గురినీచూచి సుకన్య మిక్కిలి ఆశ్చర్యచకితమైంది.

ఒకేరూపం, ఒకేమాట—ఒకేపలుకుగల ఆ ముగ్గురినీ చూచి అందులో తన భర్త ఎవరా అని తెలుసుకొనజాలక సుకన్య చింతించసాగింది—

"ముగ్గురిదీ ఒకటే చక్కదనం. ఒకటే వయస్సు. ఒకటే రూపం– అయ్యో! ఇప్పుడేంచేసేది? ఈ ముగ్గురిలో నా భర్త ఎవరో ఎట్లా తెలుస్తుంది?

అయ్యో! భగవంతుడా! మరణంతప్ప వేరే ఉపాయం కనుపించడంలేదే; ఈ అశ్వినీదేవతలు ఇక్కడికి ఎందుకు రావాలి? నాకీ చిక్కు ఎందుకు తటస్థించాలి? అయ్యో! ఈ ఇంద్రజాలాన్ని తెలుసుకోవడ మెట్లాగ? భర్తనువిడిచి మరొ కనిని వరించినట్లయితే, నాకు ఈలోకంలో తీరని అపఖ్యాతి, పరలోకంలో దుర్గతి లభిస్తున్నాయి. పతివ్రతా లంటలో నవ్వులపాలవుతున్నానుగదా!—" అని ఈ విధంగా పతివ్రత అయిన సుకన్య పెక్కువిధాల చింతించి, చింతించి, చివరకు జగదంబ అయిన ఆ పార్వతీదేవియే తనకు దిక్కని నిశ్చ యించుకొన్నది. ఆ పరమేశ్వరిని మనస్సులో నిలిపి ఈప్ర కారం ధ్యానించింది :

"ఓ జగన్మాతా! నిన్ను శరణువేడుతున్నాను. నా దుఃఖాన్ని తొలగించవలసినది. ఓ పరాశక్తీ! నిన్ను వేడు కొంటున్నాను. నన్ను రక్షించవలసినది. నా సతీత్వం తొలగి పోకుండా కాపాడవలసినది.

ఓ దేవీ! పరమేశ్వరీ! ఓ విష్ణుప్రియా! ఓ లక్ష్మీ!, ఓ వేదమాతా! ఓ సరస్వతీ! సమస్తసృష్టికీ ఆధారభూతు వైన ఓ దేవీ! ఓ త్రిమూర్తిజననీ! నీకు నమస్కరిస్తున్నాను. నన్ను రక్షించు. ఓ వికారశూన్యా! ఓ ప్రకృతీ! ఓ పురుషస్వరూపిణీ! నీకు ప్రణతు లర్పిస్తున్నాను. ఓ దేవీ! నీవు సమస్త లోకాలకూ భుక్తినీ ముక్తినీ ఒసంగుతున్నావు.

అఖిలేశ్వరివై ఏలుతున్నావు. జ్ఞానులను చల్లగా కాపాడు తున్నావు. సౌఖ్యము, జ్ఞానము, సిద్ధి, కీర్తి, జయము - సమస్తమూ ప్రసాదించి రక్షిస్తున్నావు. ఓ దేవీ! అజ్ఞానులు నీ మహిమను ఎరుంగజాలరు. ఓ జగజ్జననీ! నిన్ను శరణు వేడుతున్నాను. ఈ ముగ్గురు పురుషులూ ఒకేరీతిగా ఉన్నారు. వీరిలో నా భర్త అయిన చ్యవనమహాముని ఎవరో తెలిపి, నా పతివ్రతాత్వమహిమము నిలిపి, కాపాడుమన్మా——''

సుకన్య ఈవిధంగా మాటిమాటికి ప్రస్తుతిస్తూ ప్రొక్కు కోగా, జగదంబ అయిన త్రిపురసుందరీదేవి ఆ పరమపతివ్ర తను అనుగ్రహించి ఆమె హృదయఫలకమునందు నెలకొని దివ్యజ్ఞానం ప్రసాదించింది.

అప్పుడా రాజపుత్రి, సుకన్య సమాన రూప వయో లావణ్యాలు గలిగి ఒకేవిధంగా ఒప్పుతున్న ఆ ముగ్గురినీ పరి కించి చూచి, అందులో తన భర్తను తెలుసుకొని అతనిని పరిగ్రహించింది. అప్పుడు అశ్వినీదేవతలు ఆమె ధర్మాన్ని చూచి ఎంతగానో సంతోషించారు.

అంతట దేవీప్రసాదమువలన తన భార్య తనను వరించి నందులకు చ్యవనమహాముని మిక్కిలి సంతుష్టాంతరంగుడై, సుకన్యను కన్నులార కాంచుతూ, తిరిగి వెళ్ళిపోయేటందుకు ప్రయత్నిస్తున్న అశ్వినీదేవతలను చూచి ప్రీతిపూర్వకంగా ఇట్లు పలికాడు :—

''ఓ, దేవతోత్తములారా! గ్రుడ్డివాడనై వార్ధక్యం వలన రూపం చెడి, భార్యను సుఖపెట్టలేక దుఃఖిస్తున్న నన్ను-మీరు అనుగ్రహించారు. మళ్ళీ నాకు కళ్లు వచ్చేటట్లు

చేశారు. వయస్సు, సౌందర్యము ప్రసాదించి నన్ను సంసార సంభావ్యునిగా కావించారు. మీరు చేసిన మహోపకారం ఎన్నటికీ మరువరానిది. ఓ, అశ్వినీదేవతలారా! ఉపకారం చేసిన మిత్రులకు ప్రత్యుపకారం చెయ్యాలనేది విధి. అట్లా చెయ్యనివాడు అపకీర్తిపాలవుతాడు నాకికి ఋణపడు తున్నాను. అతని జీవితమునకూ వ్యర్థమవుతున్నది. కావున ఉపకారంచేసిన మీకు—నేను ఏమి ప్రత్యుపకారం చెయ్య గలను? మీ వాంఛితం ఏదో నాకు తెలియచెయ్యండి. తప్పక మీకోర్కె తీరుస్తున్నాను"——

చ్యవనమహాముని యీరీతిగా పలుకగా విని అశ్వినీ దేవతలు——

"ఓ మహాత్మా! మా తండ్రి అయిన సూర్యదేవుని అనుగ్రహంవలన మాకు సమస్తమూ లభించి ఉన్నది. నీకు మా కోర్కె నెరవేర్చవలెననే యిచ్ఛ ఉన్నట్లయితే—ఒక్క విషయం వున్నది. చెప్తాము విను. మేము దేవవైద్యుల మన్న మిషచేత, దేవతలంతా మమ్ములను యజ్ఞాలలో సోమ పానానికి అనర్హులుగా చేశారు. నీకు మాయందు ప్రీతి వున్న ట్లైతే—నీ మహత్తరమైన శక్తిచేత మమ్ములను సోమపానార్హు లుగా చేయవలసినది. ఓ మునీంద్రా! పూర్వం మేరుపర్వ తంపై దేవేంద్రుడు బ్రహ్మనుగూర్చి యజ్ఞం చేశాడు. ఆ సమయంలో మా కీ అవమానం తటస్థించింది. దీనిని పోగొట్ట డానికి నీ వొక్కడవే సమర్థుడవు"——అని పలికారు.

అశ్వినీదేవతల కోర్కె విని చ్యవనమహాముని ప్రీతు డైనాడు. వారి కీ విధంగా ప్రత్యుత్తరం ఒసగాడు :

ఓ దేవతలారా! మీవలన నాకు నేత్రాలు వచ్చాయి. రూపం, యౌవనం కలిగాయి. మహాత్ములైన మీకు నేనీ ఉపకారం తప్పక చేస్తాను. దేవేంద్రుని వారించి నేను మీకు నిరాటంకంగా సోమపానాన్ని యిస్తాను. మహామహుడైన శర్యాతిమహారాజుచేసే యజ్ఞంలో మీ కిది తప్పక లభించ గలదు—"

చ్యవనమహాముని పలుకులు విని అశ్వినీదేవతలు సంతుష్టాంతరంగులైనారు. ముని అనుజ్ఞగైకొని మళ్ళీ స్వర్గలోకానికి వెళ్ళిపోయినారు. తరువాత చ్యవనమహాముని తన భార్య అయిన సుకన్యను తీసుకొని మరల తన ఆశ్రమానికి వెళ్ళిపోయినాడు—

అని ఈవిధంగా వ్యాసమహర్షి జనమేజయునకు—పరమపతివ్రత అయిన సుకన్యాచరిత్రం చెప్పాడు.

---

## 9. నకులోపాఖ్యానము

జనమేజయునకు వైశంపాయనుడు యీవిధంగా చెప్పసాగాడు :—

ఓ, జనమేజయమహారాజా! ధర్మరాజులవారు చేసిన ఆ అశ్వమేధయాగంలో ఒక అత్యద్భుతమైన సంఘటన జరిగింది. యాగం జయప్రదంగా ముగిసింది. భూలోకంలో వుండే బ్రాహ్మణశ్రేష్ఠు లంతా ఆ మహాయజ్ఞానికి విచ్చే

శారు. దాయాదులు, బంధువులు, మిత్రులు—వీరేకాక భూ లోకంలోవుండే నిరుపేదలు, గ్రుడ్డివాళ్ళు, దీనులు నీరంతా అక్కడికి వచ్చారు. వారందరికీ ధర్మరాజు భూరి దక్షిణ లొసగాడు. ఎవరికికావలసిన పదార్థాలు, బహుమానులు వారి కిచ్చి అందరినీ సంతుష్టుల కావించాడు. అప్పుడు అన్నిదిశల నుంచీకూడా ఆ యాగంయొక్క గొప్పతనాన్ని గురించిన పొగడ్తలు మిన్నుముట్టాయి. అందరూకూడా ధర్మనందనుని కీర్తించారు. అప్పుడు ధర్మనందనుని శిరస్సుపై పుష్ప వర్షం కురిసింది.

ఓ భరతవంశశ్రేష్ఠుడా! ఆ సమయంలో ఒక మహా ద్భుతం జరిగింది. నీలికళ్ళుగల ఒక ముంగిస అక్కడికివచ్చింది. దాని శరీరం ఒకప్రక్క బంగారుమయంగా వున్నది. అది మేఘగర్జనవంటి గంభీరమైన స్వరంతో మాట్లాడింది. ఆ విధంగా ఆ పెద్దముంగిస ఒక రంధ్రంలోనుంచి బయటికివచ్చి, బిగ్గరగా ధ్వనిచేస్తూ, సమస్తమృగాలు, పక్షులు భయపడే టట్లు గర్జిస్తూ, ఆ బ్రాహ్మణులమధ్య నిలుచుని మానవకంఠంతో యీవిధంగా పలికింది :—

ఓ బ్రాహ్మణోత్తములారా! మీ రందరూ యీ యజ్ఞాన్నిగురించి మహా గొప్పగా చెప్తున్నారు. కాని కురు క్షేత్రంలో సక్తుప్రస్థుడనే బ్రాహ్మణు డున్నాడు. గొప్ప దానశీలుడు. ఉంఛవృత్తితో జీవిస్తున్నాడు. ఆ మహాత్ముడు చేసిన ధర్మంతో యీ మహాయజ్ఞం సరితూగదు!—"

ఓ జనమేజయనృపాలా! ఆ ముంగిస యీవిధంగా పలికేటప్పటికి, అక్కడున్న బ్రాహ్మణశ్రేష్ఠులు యావన్మందీ

విని మిక్కిలి ఆశ్చర్యచకితు లైనారు. అప్పుడా బ్రాహ్మణు లంతా ఆ ముంగిసను సమీపించి—

"ఓయీ! ఎంతో పరిశుద్ధంగా, ఆచారయుక్తంగా జరుపబడిన ఈ మహా యజ్ఞాన్ని తిరస్కరిస్తున్నావే – అసలు నీవీయజ్ఞానికి ఎప్పుడు వచ్చావు? నీశక్తియొక్క పరిమితి ఏమిటి? నీ పాండిత్యం ఏపాటిది? ఈ మహా యజ్ఞాన్ని నీవు గర్హించడా నికి కారణం ఏమిటి? ఈ యజ్ఞంలో ఏదీ విడిచిపెట్టలేదు. శాస్త్రయుక్తంగాను, వేదసమ్మతంగాను ఈయాగం జరిగింది. ఇక్కడ మంత్రతంత్రాలన్నీ యథావిధిగా ఆచరించబడి, నానా విధములైన కర్మలూ నెరవేర్చబడినాయి. వేదవిహితంగా నానారకాల దానాలు ఇవ్వబడినాయి. బహుళమైన త్యాగాలు, ధర్మాలు చేయబడినాయి. బ్రాహ్మణులందరూ పలువిధాలైన గొప్పగొప్ప దానాలు, దక్షిణలు పుచ్చుకొని సంతుష్టులైనారు. క్షత్రియు లందరూ యుద్ధంవలన సంతసించారు. పితృపితామహాది పితరులు శ్రాద్ధాదులవలన తృప్తిచెందారు. వైశ్యులు, తమకు కలిగిన రక్షణవలన సంతోషించారు. ఉత్తములైన స్త్రీలు అనేకమంది తమ వాంఛలు తీర్చుకొని సంతృప్తి చెందారు. శూద్రులు ఉదారమైన ప్రసంగాల వలన, తక్కిన యావన్మంది జనులూకూడా గొప్పగొప్ప దానాలు పొందడంవలన సంతోషించారు. ధర్మరాజులవారు చూపిన పరిశుద్ధమైన ప్రవర్తనవలన సమస్తమైన దాయాదులు బంధువులు సంతుష్టాంతరంగులైనారు. దేవతలందరూ హవిర్భాగాలు స్వీకరించినీ, పుణ్యకర్మలు గ్రహించినీ ఆనందించారు. శరణాగతు లందరుకూడా రక్షించబడి సంతసిం

చారు. కనుక అన్నివిధాలా సక్రమంగా నిర్వహించబడిన ఈ యాగం శ్రేష్ఠమైనది కాదని నీవు ఏ కారణంవలన అంటు న్నావు ? నీవనేది సత్యమే అయినట్లయితే అదేమిటో మా అందరికీ తెలియచెప్పు. నీవు స్వానుభవం వలన ఈ మాట అంటున్నావా ? లేక శాస్త్రప్రకారం చెప్తున్నావా ? మే మంతా విన కుతూహలపడుతున్నాం. ఓ, నకులోత్తమా ! నీమాటలు ఎంతో విలువైనవిగాను, వినదగినవిగాను తోస్తు న్నవి. నీవు ప్రజ్ఞావంతుడివిగా కనుపిస్తున్నావు. దివ్యరూపంలో ప్రకాశిస్తున్నావు. విజ్ఞానవంతులైన బ్రాహ్మణుల మధ్యకు వచ్చావు నీవు. కనుక ఈవిషయం ఏమిటో నీచే సవిస్తరంగా మాకు ఎరింగించవలసినది—'' అని అడిగారు.

ఆ విధంగా బ్రాహ్మణులు అనుగగా విని ముంగిస చిరు నవ్వు నవ్వుతూ వారికి ప్రకారం చెప్పడం మొదలుపెట్టింది:

"ఓ, బ్రాహ్మణశ్రేష్ఠులారా ! నేను పలికిన పలుకులు అసత్యంకాదు. అహంకారంతోనున్నానే నామాటలు మాట్లాడలేదు. నేను చెప్పినవాక్యం మీరంతా విన్నారు కదా ! ఓ, బ్రాహ్మణోత్తములారా !— ఈ యజ్ఞం సక్తుప్ర స్థుడు ఒనర్చిన ధర్మంతో ఎంతమాత్రం సరితూగదు ! ఇది సత్యం ! ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా ! జరిగిన విషయం మీకు యథార్థంగా వివరించి చెప్తాను. శ్రద్ధగా వినండి— అత్య ద్భుతము, అత్యుత్తమము అయిన సంఘటన ఇది. ఇది నేను కళ్ళారా చూచాను. అనుభవించానుకూడా. కురుక్షేత్రంలో నివశిస్తూ, ఉంఛవృత్తితో జీవించే ఉదారుడైన ఒక బ్రాహ్మ ణునికి సంబంధించిన విషయం ఇది. ఓ, ద్విజశ్రేష్ఠులారా !

దీనివలననే ఆ బ్రాహ్మణుడు, తన భార్యతోను, కొడుకుతోను, కోడలుతోను స్వర్గానికి వెళ్ళాడు. దీనిమూలకంగానే నా శరీరంలో సగభాగం బంగారు మయమైంది—''

అని తెలిపి ఆ ముంగిస మళ్ళీ వారి కీ ప్రకారం చెప్ప సాగింది :

''ఓ, బ్రాహ్మణోత్తములారా ! ఒక బ్రాహ్మణుడు తనకు న్యాయంగా లభించినదిన్నీ, అతిస్వల్పమైనదిన్నీ దానం చేశాడు. అది అత్యుత్తమము, అత్యద్భుతము అయిన ఫలం ఒసగింది. ధర్మక్షేత్రము, అనేకమంది ధర్మజ్ఞులకు నివాస యోగ్యము అయిన కురుక్షేత్రంలో ఒక బ్రాహ్మణుడు నివసిస్తున్నాడు. అతను ఉంఛవృత్తితో జీవిస్తున్నాడు. ఒక పావురాయి జీవనాధారం అంత జీవనాధారం అతనిది ! అతడక్కడ తన భార్యతోను, కుమారునితోను, కోడలుతోను నివసిస్తున్నాడు. ధర్మాత్ముడు, జితేంద్రియుడు అయి తపోనిష్ఠతో జీవిస్తున్నాడు. ఉంఛవృత్తితో పొలాలలో రాలిన గింజలు ఏరుకొని, బ్రతుకుతున్నాడు. అతను ప్రతిరోజూ, వ్రతనిష్ఠతో ఉండి మూడుజాములవేళకు భోజనం చేసేవాడు. ఆ సమయానికి ఏమీ దొరకకపోయినట్లయితే ఆ బ్రాహ్మణోత్తముడు, ఆరోజు ఉపవాసం ఉండి మళ్ళీ మరుసటిరోజు అదేవేళకు భుజించేవాడు: ఓ, బ్రాహ్మణశ్రేష్ఠులారా ! ఇట్లా ఉండగా ఒకానొకసమయంలో అక్కడ ఒక భయంకరమైన కరువు సంభవించింది. ఆవిధంగా దుర్భిక్షం సంభవించిన సమయంలో ధర్మాత్ముడైన ఆ బ్రాహ్మణునివద్ద ఏ పదార్థమూ నిలువలేదు. అప్పుడా రాజ్యంలో చెట్లు – చేమలు –

అన్నీ మలమల మాడిపోయినాయి. ఎక్కడా గింజ- ధాన్యం
నిలువలేదు. ప్రతిరోజూ భోజనసమయం అయ్యేటప్పటికి ఆ
బ్రాహ్మణునివద్ద తినడానికేమీ ఉండేదికాదు. క్రమక్రమంగా
రోజుతరువాత రోజుగడుస్తూ వచ్చింది. ఆ బ్రాహ్మణుని ఇంట్లో
అందరూ పస్తులుంటున్నారు. ఆకలితో అలమటిస్తున్నారు.
అయినప్పటికీ వారు చేసేదేమీలేక ఎలాగో రోజులు గడుప
సాగారు.

"ఇట్లా ఉండగా జ్యేష్ఠమాసంలో ఒకనాటి నిట్ట
మధ్యాహ్నంవేళ, ఎర్రటిఎండలో ఆ బ్రాహ్మణుడు ధాన్యపు
గింజలు ఏరుకొంటున్నాడు. ఎండ తాపానికి వేగిపోతూ,
ఆకలిబాధకు కళ్ళు తిరిగిపోతూనే అతడా కఠోర తపోనిష్ఠను
సాగిస్తున్నాడు. కాని అతడా విధంగా ఎక్కువసేపు గింజలు
ఏరుకోలేకపోయినాడు. ఎండదెబ్బకు, ఆకలిబాధకు కాళ్ళ
జాలక అలసి, సొమ్మసిల్లిపోయినాడు. అతనితోసహా కుటుం
బంలో అందరూ పస్తే— ఎవరికీ తినడానికి తిండిలేదు. ఆ
తీరుగా అతడు దారుణమైన బాధ అనుభవిస్తూ రోజులు
గడిపాడు.

"అంతట ఒకనాడు మూడుజాములవేళకు ఆ బ్రాహ్మ
ణుడు స్వల్పంగా ధాన్యపు గింజలు ఏరుకొని రాగలిగాడు.
అప్పుడు వారా గింజలను పేలాలుగా వేయించుకొని పేల
పిండి తయారుచేసుకొన్నారు. ఆ పిండి కుంచెడు అయింది.
తరువాత వారు మామూలుగా స్నాన సంధ్యాద్యనుష్ఠానాలు,
నిత్యకర్మలు ముగించుకొని, దేవ, పితృయజ్ఞాలు, పూజలు
నిర్వర్తించుకొని, ఆ కొద్ది పేలపిండినీ ఇంట్లోఉన్న నలుగురూ

నాలుగుభాగాలు చేసుకొని సమానంగా పంచుకొన్నారు. ఒక్కొక్కరికి ఒక్కొక్క మానెడు పేలపిండి వచ్చింది. అంతట వారు ఆ పేలపిండిని భుజించడానికి సంసిద్ధులై ఉన్న సమయంలో వారింటికి ఒక అతిథి దయచేశాడు. అతిథి రావడం చూచి వారందరూ ఎంతగానో సంతోషించారు. ఆ వచ్చిన అతిథికి భక్తితో నమస్కారంచేసి అతనిని లోపలికి తీసుకొనివచ్చారు. అతనిని మామూలుగా అడిగే కుశలప్రశ్నలన్నీ అడిగి, గౌరవించి కూర్చోబెట్టారు.

"ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! ఆ విప్రుని కుటుంబంలో అందరూకూడ పరిశుద్ధమనస్కులు. కల్లకపటం లేనివారు, ఉదారులు, కామక్రోధాదులను జయించినవారు. వారెవరికీకూడా పరులసుఖాన్నిచూచి అసూయపడే స్వభావం లేదు. మాత్సర్యం అంతకన్నాలేదు. వారందరూ మదక్రోధాదులను త్యజించినవారు, ధర్మాత్ములు, బ్రాహ్మణశ్రేష్ఠులు. వారికి తెలియని ధర్మవిధిఅంటూ లేదు. ఓ బ్రాహ్మణోత్తములారా! అంతట వారా అతిథికి తమ గోత్రప్రవరను చెప్పుకున్నారు. అట్లాగే ఆ అతిథి గోత్రప్రవరలు అడిగి తెలుసుకొన్నారు. ఆకలిగొనివున్న ఆ అతిథిని సగౌరవంగా భోజనానికి తోడ్కొనివచ్చారు. తమ కుటీరంలోకి తీసుకొనివచ్చి అర్ఘ్యపాద్యాదులు ఒసగి అతనిని పూజించారు. దర్భాసనం పరిచి దానిపై అతనిని కూర్చోబెట్టారు—

'ఓ మహాత్మా! మాకువున్నది శుచిగా తయారుచేసిన యీ పేలపిండిమాత్రమే! ఇది మేము న్యాయంగా

ఆర్జించినది. ఓ బ్రాహ్మణోత్తమా! దీనిని మీకు భక్తితో సమర్పిస్తున్నాం. పరిగ్రహించవలసినది'—అని కోరాడు.

"అందులకు అతిథిగావచ్చిన ఆ బ్రాహ్మణుడు సంతోషంగా అంగీకరించాడు. అప్పుడు గృహ యజమాని అయిన సక్తుప్రస్థుడు తనవంతువచ్చిన పూనెడు పేలపిండినీ ఆ అతిథికి సమర్పించాడు. అతిథి దానిని ఆనురాగపురుస భుజించాడు. కాని మిక్కిలి క్షుద్బాధాపీడితుడై ఉన్న ఆ అతిథి ఆకలి తీరలేదు. అప్పుడు ఉంఛవృత్తితో జీవిస్తున్న ఆ బ్రాహ్మణోత్తముడు 'అయ్యో! ఈ అతిథికి ఆకలితీరలేదే! మరేమి ఆహారం పెట్టి ఇతనిని సంతృప్తిపరచేది?—' అని చింతించసాగాడు. అప్పు డతని భార్య—స్వామీ! నా భాగంవచ్చిన పేలపిండిని ఈ అతిథికి సమర్పిస్తాను. అతిథిసత్కారంకంటె మనకు అధికమైనపుణ్యం ఏమున్నది? కనుక అతనిని తృప్తిపొందించడం మనవిధి. ఇది తీసుకొనిపోయి అతిథికి పెట్టి అతనిని సంతృప్తి పరచండిస్వామీ'— అని పలికింది.

"అప్పుడు సాధ్విఅయిన తనభార్య ఆవిధంగా చెప్పడం విన్నాడు సక్తుప్రస్థుడు. ఆకలితో అలమటించిపోతున్న భార్య ఆ రీతిగా చెప్పినందువలన ఆమె భాగంవచ్చిన పేలపిండి తీసి అతిథికి పెట్టడానికి ఆ బ్రాహ్మణోత్తమునికి మనస్కరించలేదు. పూజ్యుడైన సక్తుప్రస్థుడు తను ఆస్థితిలో ఉండికూడా భార్య యొక్కపరిస్థితి వివేకంతో తెలుసుకో గలిగాడు. పాప మా ఇల్లాలు వయస్సుమళ్ళిన మనిషి. శ్రమపడిన మనిషి. ఆమెలో ఎక్కడా కళా—కాంతులులేవు. ఆకలితో ఎండి వరుగైపోయింది. చర్మము, ఎముకలూతప్ప ఆమెవంటిమీద మరేమీలేదు.

శుష్కించి శుష్కించి పుల్లలాగా అయిపోయింది. ఆ విధంగా బాధతో చలించిపోతున్న ఆ అసహాయురాలిని చూచి, సక్తు ప్రస్థుడు– 'ఓ, కళ్యాణీ! సమస్తమైన పక్షులు, మృగములు, కీటకములు, పురుగులు కూడా తమతమ ప్రియురాండ్రను పోషించి, రక్షిస్తున్నాయి. కావున నీవీ రీతిగా చెప్పడం ధర్మంకాదు. భార్య తన భర్తకు ప్రేమతో భుజించబెట్టి అతనిని కళ్ళలోపెట్టుకొని కాపాడుతున్నది. ధర్మార్థకామము లన్నింటికీకూడా భార్యయే మూలం. సంతాన ప్రాప్తికీ– తద్వారా వంశాభివృద్ధికీ భార్యయేకదా పాదు. భర్తకు శుశ్రూషచేసి అతని సంతోషపెట్టేది భార్యయేకదా? గృహ స్థుకు భార్యయే ఆధారం. ఆమె లేకపోతే ఏ ధర్మమూ లేదు. పితృదేవతలకు ముక్తికలిగించేదికూడా ఆమెయే. తన భర్త చేసే కర్మలవలన భార్య అతనిని తెలుసుకొంటున్నది. తన భార్యను పోషించి, రక్షించలేనివాడు ఈ లోకంలో అపకీర్తి పాలై తరువాత నరకానికి పోతున్నాడు. అంతేకాదు; ఎంత కీర్తిశాలి అయినాసరే, అతనికి పుట్టగతు లుండవు. ఎన్నటికీ అతను ఉత్తమగతిని పొందలేడు.' అని పలికాడు.

"అప్పు డా ఇల్లాలు భర్తనుచూచి– 'స్వామీ! మన ఇరువురి దానధర్మాలు, సంపద ఒకటే. కనుక నా భాగానికి వచ్చిన నాలుగవవంతుపేలపిండి తాము దయచేసి తీసుకోండి. నన్ను సంతోషపెట్టండి. సత్యం, సుఖం, ధర్మం, మోక్షం, అన్నీకూడా స్త్రీలయొక్క సుగుణాలవలననే పొందబడుతు న్నాయి. వారి కామ్యాలన్నీకూడా భర్తపైననే ఆధారపడి ఉన్నాయి. ఓ మహాత్మా! సంతానప్రాప్తికోసం తల్లి తన

రక్తాన్ని ధారవోస్తున్నది. తండ్రి తన బీజాన్ని ప్రసాదిస్తున్నాడు. భార్యకు భర్తనుమించిన దైవంలేదు. భర్తలయొక్క అనుగ్రహంవలన స్త్రీలు సమస్త సుఖాలను, సంతానప్రాప్తిని పొందుతున్నారు. మీరు నా భర్త. నన్నుపాలించే ప్రభువులు. నేను మీచే భరింపబడుతున్నాను. అంతేకాదు, మీరు నాకు పుత్రుని ప్రసాదించిన పుణ్యాత్ములు. కనుక నా భాగం వచ్చిన పేలపిండిని అతిథికి పెట్టి అతనిని తృప్తిపరచండి. మీరు నాకంటె వయస్సుమళ్ళినవారు. వార్ధక్యంలో ఉన్నవారు. ఆకలిబాధవలన తాము మరీ క్షీణించిపోయినారు. ఉపవాసాలు చేసిచేసి ఎంతో శుష్కించి ఉన్నారు—' అని చెప్పింది.

"ఆవిధంగా పలికిన భార్యమాటలువిని, వెంటనే సక్తుప్రస్థుడు ఆమె భాగానికి వచ్చిన పేలపిండి గైకొనివెళ్ళి అతిథికి పెట్టాడు—"

'ఓ బ్రాహ్మణోత్తమా! దీనినికూడా భుజించి ఆకలి తీర్చుకోండి—' అని చెప్పాడు.

"అప్పుడా బ్రాహ్మణుడు తత్క్షణమే దానినికూడా భక్షించాడు. కాని అప్పటికీ అతని ఆకలి తీరలేదు. అతను సంతుష్టి చెందకుండా ఉండడం చూచి ఉంఛవృత్తిచే జీవించే ఆ సక్తుప్రస్థుడు మళ్ళీ చింతాక్రాంతుడైనాడు.

"అప్పుడది కనిపెట్టి అతనికుమారుడు తండ్రితో— 'నాయనా! నా భాగానికివచ్చిన పేలపిండి ఇస్తాను. దానిని అతిథికి పెట్టి అతనిని సంతృప్తిపరచండి. నేనిట్లా చెయ్యడం ఎంతో ఉత్తమమైన ధర్మమని భావిస్తున్నాను. కనుక చేస్తు

న్నాను. నాయనా ! మిమ్ములను ఎంతో శ్రద్ధగా పోషించవలసిన భారం నాపైన ఉన్నది. తండ్రిని పోషించడం ఉత్తమమైన కుమారుని విధి. అందులోనూ మిక్కిలి వృద్ధాప్యంలో ఉన్న తండ్రిని, కొడుకు శ్రద్ధాభక్తులతో పోషించితీరాలి. ఈవిషయం శ్రుతులు ఘోషిస్తున్నాయి. ముల్లోకాలలోనూ ఆచరించవలసిన శాశ్వతమైన ధర్మం ఇది. మీరు కేవలం ప్రాణాలు నిలుపుకొంటూ తపోనిష్ఠ నెరవేరుస్తున్నారు. ప్రతి దేహీకూడా తన దేహంలో ఉన్న ప్రాణాలను నిలుపుకోవడం పరమధర్మం—' అని పలికాడు.

''కుమారుని పలుకులు విని తండ్రి — 'అబ్బాయీ ! నీవు వెయ్యేండ్లవాడివి అయినప్పటికీన్నీ, అప్పుడుకూడా నీవు నా కంటికి పసిపిల్లవాడివిలాగానే కనుపిస్తావు ! కొడుకును కనడంవలన తండ్రి, అతనిద్వారా కృతకృత్యుడవుతున్నాడు. నాయనా ! కుమారా ! పిల్లల ఆకలి ఎటువంటిదో నాకు తెలుసు. వాళ్ళకు ఆకలి ఎక్కువ. నేను వృద్ధుణ్ణి. నేను ఏ విధంగానైనాసరే ప్రాణాలు నిలుపుకోగలను. నీవట్లా కాదురా నాయనా. నీవు పసివాడివి. ఆకలికి తపించిపోతావు. నేనంటావా, పూర్తిగా వార్ధక్యంలో మునిగిపోయినవాణ్ణి. జవసత్వాలు ఉడిగినవాణ్ణి. నన్ను ఆకలి అంతగా బాధించదు. పైగా నేను ఎన్నో సంవత్సరాలుగా తపాలు, వ్రతాలు ఆచరించినవాణ్ణి. చావు అంటే నాకు భయంలేదురా నాయనా' అని చెప్పాడు.

''తండ్రి మాటలు విని కుమారుడు మళ్ళీ ఈవిధంగా బదులు చెప్పాడు—

'నాయనా! నేను మీ పుత్రుణ్ణి. తండ్రిని కాపాడే వాడే పుత్రుడని శ్రుతులు ఘోషిస్తున్నాయి. అంతేకాదు, తండ్రి తానే పుత్రుని రూపంలో మళ్ళీ పుడుతున్నాడు. కాబట్టి నన్ను కాపాడడంవలన నిన్ను నీవు కాపాడుకొని నట్లవుతున్నది'—

"కుమారుడిట్లు చెప్పగా విని సక్తుప్రస్థుడు —'అబ్బాయీ! రూపంలోనూ, శీలంలోనూ నావంటివాడివే నీవున్నావు. ఆత్మనిగ్రహంలోకూడా సాక్షాత్తు నావంటివాడివే నీవు. నాయనా! అనేకసమయాలలో నిన్ను నేను పరీక్షచేశాను. నా పరీక్షలకు నీవు తట్టుకొన్నావు. కనుక నాయనా! నీ భాగం పేలపిండి తీసుకొంటాను'— అని పలికి సంతోషించాడు. కుమారుని వంతు వచ్చిన పిండిని గైకొని దానిని ఆకలిగా వచ్చిన బ్రాహ్మణునకు పెట్టాడు. అతను దానినికూడా భుజించాడు. కాని ఇంకా అతని క్షుద్బాధ చల్లారలేదు. ఆతను తృప్తి చెందలేదని తెలుసుకొని ఉంఛవృత్తిచే జీవిస్తున్న సక్తుప్రస్థుడు మళ్ళీ ఏంచెయ్యానా, అని చింతించసాగాడు. అప్పుడది కనిపెట్టి పరమసాధ్వి అయిన అతని కోడలు అతనిని సమీపించి, — 'పూజ్యులైన ఓ మామగారూ! మీ కుమారునివలన నేను ఒక కుమారుని కంటాను. కావున దయచేసి నా భాగానికి వచ్చిన పేలపిండి గైకొని దానిని అతిథికి పెట్టండి. అయ్యా! మీ అనుగ్రహంవలననే నాకు శాశ్వతంగా అంతులేని మోక్షగతులు కలుగుతున్నాయి. మనుమని ద్వారానే మోక్షగతులు ప్రాప్తిస్తున్నవనీ — కుమారుడు, మనుమడు, మునిమనుమడు — వీరివలన మూడుతరాలవారు

తరిస్తున్నారనీ శ్రుతులు చెపుతున్నాయి. మామగారూ! కొడుకు తండ్రి ఋణం తీరుస్తున్నాడు కనుక పుత్రుడని పిలువ బడుతున్నాడు. పుత్ర పౌత్రాదుల వలననే, పితృ పితామహా దులకు శాశ్వతమైన స్వర్గలోకాలు లభిస్తున్నాయి—' అని పలికింది.

"తనను సంతుష్టిపరుస్తూ కోడలు ఇట్లు పలుకగా విని, మామ అయిన సక్తుప్రస్థుడు మళ్ళీ ఆమెతో ఈవిధంగా చెప్పాడు— 'అమ్మాయీ! కోడలా! గాలికీ, ఎండకూ నీ ముఖం వాడిపోయిందమ్మా. వ్రతాల పట్టి, ఉపవాసాలు చేసి నీ శరీరం ఎట్లా పాలిపోయిందో చూడు తల్లీ! అసలే నీవు ఆకలిబాధకు అలమటించిపోయి ఉన్నావు. విహ్వలచిత్తనై కనుపిస్తున్నావు. ఆవిధంగా ఉన్న నిన్ను పస్తు పడుకోబెట్టి నీ భాగం పేలపిండి నే నెట్లా తీసుకునేది తల్లీ! ఇది నాకు ధర్మంకాదమ్మా. నే నీపనిచేస్తే దేవుడు మెచ్చడు. కనుక ఓ కళ్యాణీ! నీ వీరీతిగా చెప్పకూడదు, చెయ్యకూడదు. అమ్మా! ప్రొద్దు తిరిగిపోయిన ఈసమయంలో— ఈ మూడు జాముల వేళప్పుడు నిన్ను తిండిలేకుండా ఉపవాసా లుండమనీ, వ్రతాలు చెయ్యమనీ ఎట్లా చెప్పేది? నాకు నోరెట్లా వస్తుంది? అయ్యో! కోడలా! నీవు శౌచము, శీలము, తపస్సు కలదానివే! అయినప్పటికీ నీవీ తీరుగా దుఃఖాలు అనుభవించవలసి వచ్చిందే, ఏంచేసేది? అమ్మా! నీవు పసి దానవు. ఆకలితో అలమటిస్తున్నదానవు. సుకుమారివి. నీవు ఎల్లప్పుడూ నాచేత రక్షించ బడవలసినదానవు. అయ్యో! పస్తులతో ఎండి వరుగైపోయిన నిన్ను - నేను కళ్ళారా

చూడవలసి వచ్చిందే! నీ బంధుకోటి అందరికీ నీవే కదమ్మా ఆనందం చేకూర్చేదానవు'—

మామగారు ఇట్లా చెప్పగా విని కోడలు, తిరిగీ ఈ ప్రకారం సమాధానం చెప్పింది — 'అయ్యా! నా గురువులకు గురువులు మీరు. నా దేవుడికి దేవుడు మీరు. కనుక మహాత్ములైన ఓ మామగారూ! నా భాగానికి వచ్చిన పేలపిండి స్వీకరించండి. నా దేహం, నా ప్రాణం, నా ధర్మం — అన్నీ కూడా ఒకేఒకదానికోసం ఏర్పాటై ఉన్నాయి. నా గురువుల శుశ్రూష చెయ్యడమే అది. మహాత్మా! మీ అనుగ్రహం వలన ఇకమీదట నేను అనేక శుభలోకాలు పొందనున్నాను. అయ్యా! నేనున్నదల్లా మీ క్షేమం విచారించడం కోసమే కదా! నేను దృఢభక్తితో మిమ్మల్ని సేవిస్తున్నాను. నా సుఖం మీ సుఖమేనని మీరు భావించినట్లయితే ఈ నా సక్తువు (పేలపిండి) ను గైకొని నన్ను ధన్యురాలను చెయ్యండి.'—

"కోడలు చెప్పిన సమాధానం విని, సక్తుప్రస్థుడు— 'ఓ సాధ్వీ! ఇటువంటి శీలవృత్తివలన నీవు ఎల్లప్పుడూ శోభించగలవు. నీవు ఎల్లప్పుడూ యీవిధంగా ధర్మవ్రతోపేతవై నీ పెద్దలు అనుసరించిన మార్గాన్ని అనుసరిస్తున్నావు. నాకు తెలుసును. కనుక, ఓ కోడలా! నీ భాగం పేలపిండిని నేను తీసుకొంటాను. నీ సద్గుణాలన్నీ పరికించినపిదప నిన్ను నేను వంచనచెయ్యడం తగదమ్మా. అమ్మాయీ! ధర్మవ్రత పరాయణవైన స్త్రీలందరిలోకీ నీవు పూజ్యురాలవు'—అని చెప్పి, ఆమెవంతు పేలపిండిని స్వీకరించి, అతిథికి పెట్టాడు.

ఆవిధంగా సాధువు, మహాత్ముడు అయిన సక్తుప్రస్థుడు పెట్టిన ఆ పేలపిండి భుజించి, దానితో ఆ అతిధిగావచ్చిన బ్రాహ్మణుడు మిక్కిలి సంతుష్టిచెందాడు.

"ఓ బ్రాహ్మణోత్తములారా! ఆ అతిధి ఎవరోకాదు. ధర్మదేవతయే ఆ అతిథి. బ్రాహ్మణరూపంలో సక్తుప్రస్థుని యింటికి వచ్చాడు. అంతట ధర్మదేవత అయిన ఆ యమ ధర్మరాజు, సక్తుప్రస్థుని చూచి—

'ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! పరిశుద్ధమైనదిన్నీ, న్యాయంగా ఆర్జించినదిన్నీ, ధర్మయుక్తమైనదిన్నీ, విశేషించి విశిష్టమైన దిన్నీ అయిన యీ దానం నీవు నాకు యథాశక్తిగా ఒసగావు. ఇందుకు నే నెంతగానో సంతసిస్తున్నాను. ఓ బ్రాహ్మణోత్తమా! నీవు చేసిన యీ దానమహిమ స్వర్గలోకంలో కూడా చెప్పుకొంటున్నారు. చూడు!, ఆకాశంనుంచి భూమి మీద పుష్పవర్షం కురుస్తున్నది. సమస్తదేవర్షులు, దేవతలు, గంధర్వులు—అంతా ఏకమై నీవుకావించిన దానానికి ఆశ్చర్య చకితులై నిన్ను స్తోత్రం చేస్తున్నారు. బ్రహ్మలోకంలో ఉన్న బ్రహ్మర్షు లందరుకూడా విమానారూఢులై వచ్చి నిన్ను చూడాలని ఆతురతపడుతున్నారు. ఓ తపోనిధీ! నీకు స్వర్గలోకం ప్రాప్తిస్తున్నది, వెళ్ళు. నీవలన నీ పితృదేవత లందరుకూడా తరించారు. ఇంతవరకూ తరించకుండాఉన్న తరతరాలవారుకూడా ఇప్పుడు నీవలన తరించి శాశ్వత బ్రహ్మ లోకాలు పొందారు. నీవు కావించిన బ్రహ్మచర్యాలు, దానాలు, యజ్ఞాలు, తపస్సులు, పరిశుద్ధమైన హృదయంతోను, ధర్మం

తోను చేసిన వివిధకర్మలు—వీటన్నింటివలన నీకు శాశ్వత మైన స్వర్గం సంప్రాప్తిస్తున్నది—వెళ్ళు.

ఓ ద్విజశ్రేష్ఠుడా! నీవు వ్రతాలు, తపశ్చర్యలు—అన్ని నిష్ఠతోను, దృఢభక్తితోను చేశావు. కనుక నీవు చేసిన దాన ధర్మాలవలన దేవత లందరుకూడ సంప్రీతులైనారు. నీ విష్ణువుచేసిన యీ దానముఉన్న దే—ఇది నీవు మహత్తరమైన కష్టసమయంలో, కల్మషరహితమైన హృదయంతో కావిం చావు. కనుకనే నీవు స్వర్గాన్నికూడా జయించగలిగావు! ఆకలిబాధవున్న దే—అది మహాచెడ్డది. అది మనిషియొక్క— వివేకాన్ని నాశనంచేస్తుంది. ధర్మబుద్ధినుంచి పతనముయ్యే ట్లు కావిస్తుంది. ఎవడిబుద్ధి క్షుద్బాధకు వశమవుతున్నదో వాడు ధైర్య—స్థైర్యాలన్నీ కోల్పోతున్నాడు. కనుక ఎవడు క్షుద్బాధను జయిస్తున్నాడో, వాడు స్వర్గలోకాన్ని సయితం జయిస్తున్నాడు సుమా! దానబుద్ధి ఉన్నంతవరకూ ధర్మ చ్యుతి కలుగనేరదు. నీవు భార్యాపుత్రాదు లనే వ్యామోహా నికి వశుడవుకాక కేవలం ధర్మానికిమాత్రమే కట్టుబడివున్నావు. తృష్ణను వర్జించినవాడవు నీవు. నరులు ధనద్రవ్యాలు ఆర్జించ డము ఏమంత ఘనంకాదు. పాత్రత ఎరిగి దానంచెయ్యడం శ్రేష్ఠమైన పుణ్యం. అందులోనూ సకాలంలో చెయ్యడం అంతకన్నా విశేషం. పైగా భక్తితోచెయ్యడం అన్నిటి కన్నా విశేషం. స్వర్గద్వారాన్ని దర్శించడం చాలా కష్ట మైన విషయం. మోహంలో మునిగిన నరులు దానిని దర్శించ లేరు. లోభులు, అత్యాశాపరులు అయిన వారికి ఎల్లప్పుడూ స్వర్గ కవాటాలు బంధించబడి వుంటాయి. దానిని ప్రవేశింప

ఎవరికీ తరంకాదు. జితేంద్రియులు, క్రోధాన్ని జయించిన వారు, తపోనిష్ఠగల బ్రాహ్మణోత్తములు, శక్తికొలది దానం చేసినవారు—వీరుమాత్రమే స్వర్గాన్ని చూడగలుగుతారు. వెయ్యివుండి వంద యిచ్చినవారూ, వందవుండి పది యిచ్చిన వారూ, అసలు ఏమీలేక దోసెడునీళ్లు పోసినవారూ—వీ రందరికీకూడా సమానమైన పుణ్యఫలమే లభిస్తుందని చెప్ప బడుతున్నదిసుమా! మహారాజైన రంతిదేవుడు తన సమస్త సంపదలనూ కోల్పోయినప్పుడు తనవద్ద ఏమీలేక పరిశుద్ధ మైన హృదయంతో కొంచెము జలం మాత్రమే ఒస గాడు. ఓ విప్రోత్తమా! ఆ స్వల్పమైన దానం వలననే అతను స్వర్గలోకానికి వెళ్ళాడు. కనుక ధర్మబుద్ధితోను, ప్రియంతోను చేసిన దానం స్వల్పమే అయినా అధికఫలాన్ని ఇస్తున్నది. తనకు న్యాయంగా లభించినది, అత్యల్పమే అయినా, శ్రద్ధాభక్తులతో సమర్పిస్తే ధర్మదేవత సంతో షిస్తున్నది. నృగు డనే మహారాజు, వేలకొలది గోవులను బ్రాహ్మణులకు దానం చేశాడు. అందులో ఒక ఆవు అతనిది కాదు. దానివలన అతను నరకానికి పోయినాడు! ఉశీనరుని కుమారుడైన శిబిచక్రవర్తి గొప్ప ధర్మవ్రతుడు. ఆ మహా త్ముడు తన శరీరంలోనుంచి మాంసం కోసిఇచ్చి, పుణ్య లోకాలు పొందాడు. నరులకు విత్తవైభవం కలిగి ఉండడం పుణ్యంకాదు. ఉత్తమ మనుజులు, ధర్మవ్రతులై పుణ్యం ఆర్జిస్తారు. ఎన్నెన్నో యజ్ఞయాగాది క్రతువులు చేస్తే వచ్చే పుణ్యంకంటె, న్యాయంగా తనకు లభించినదానిని కొంచెమే

అయినా దానం చెయ్యడంలో వచ్చే పుణ్యం ఎన్నోరెట్లు ఎక్కువ! ఓ తపోధనుడా! క్రోధం ఉన్నచో – అది పుణ్య ఫలాన్ని ధ్వంసం చేస్తున్నది. లోభం ఉన్నచో—అది స్వర్గానికి అవరోధం కలిగిస్తున్నది. నీ విప్పుడు ఈ కొంచెం పేల పిండిని దానం చేశావే – భూరి దక్షిణలు ఒసగి, అతిస్వైభవంగా చేసిన ఎన్నెన్నో రాజసూయ యాగాలు, అశ్వమేధ యాగాలుకూడా దీనితో సరితూగవు. నీ దానంయొక్క ఫలం అటువంటిది! అత్యల్పమైన ఈ పేలపిండితో నీవు ఉన్నతమైన బ్రహ్మలోకాన్ని పొందగలిగావు! ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా! సుఖంగా వెళ్ళు. వెళ్ళి బ్రహ్మసదనంలో నివసించు. బ్రాహ్మణు లందరిలోకీ శ్రేష్ఠుడవైన ఓ సత్పురుషుడా! నీ కుటుంబాన్ని అందరినీ తీసుకుపోవడానికి ఇదుగో, దివ్య యానం సిద్ధంగా ఉన్నది. దీనిని మీరంతరూ యథేచ్ఛగా అధిరోహించండి.

ఓ బ్రాహ్మణుడా! నేను ధర్మదేవతను! ఇదిగో, చూడు!—నీవు యీ దేహంతోటే తరిస్తున్నావు. నీ కీర్తి ఈ లోకంలో స్థిరంగా నిలుస్తుంది. నీవు నీ భార్యతోను, కుమారునితోను, కోడలుతోను ఇప్పుడే స్వర్గానికి వెళ్లు'— అని పలికాడు.

"ధర్మదేవత యీవిధంగా చెప్పినపిదప, ఆ బ్రాహ్మణుడు తన భార్యతోను, కుమారునితోను, కోడలుతోను కలిసి దివ్యవిమానారూఢుడై దేవలోకానికి వెళ్ళిపోయినాడు.

"ఓ బ్రాహ్మణోత్తములారా! ఆవిధంగా ఆ నలుగురూ స్వర్గానికి వెళ్ళిపోయిన అనంతరం నేను నా బిలం

(రంధ్రం) లోనుంచి వెలుపలికి వచ్చాను. అక్కడ వ్యాపించి ఉన్న పేలపిండి వాసన, నేలమీదపడి ఉన్న జలము, దివ్య కుసుమాలు నాకు సోకి, మహాత్ముడైన ఆ బ్రాహ్మణు డొనర్చిన దానమహిమవలన, అతని తపఃప్రభావంవలన నాశిరస్సు బంగారపు శిరస్సు అయింది! దృఢమైన సత్యవ్రతుడై, ఆ విప్రోత్తముడు చేసిన సక్తుదానంవలన ఇంత పెద్దదైన నా యొక్క శరీరంలో సగభాగం బంగారుమయమై పోయింది!

"ఓ బ్రాహ్మణులారా! నా శరీరంలో మిక్కిన సగభాగంకూడా బంగారుమయంగా చేసుకోవాలన్న తలంపుతో తరువాత నేను అక్కడనుంచి బయలుదేరి, పదేపదే తపోవనాలన్నీ తిరిగాను. సంతోషంతో ఋష్యాశ్రమాలు దర్శించాను. మహారాజులు చేస్తున్న యజ్ఞయాగాది క్రతువులకు ఎన్నెన్నోసార్లు వెళ్ళాను. కాని యెక్కడికి వెళ్ళినా నా దేహంలో రెండవప్రక్క బంగారుమయం కాలేదు. చివరకు లోకోత్తరుడైన ధర్మరాజు ఇక్కడ యజ్ఞం చేస్తున్నాడని విన్నాను. ఎంతో ఆశపెట్టుకొని ఈ యాగానికి వచ్చాను. కాని ఇక్కడకూడా నా కోరిక తీరలేదు. నాశరీరంలో శేషించిన సగభాగం బంగారంగా మారలేదు.

"ఓ ద్విజోత్తములారా! ఈ కారణంవలననే నేను ఆవిధంగా మాట్లాడాను. ఆ బ్రాహ్మణు డిచ్చిన పేలపిండి దానంతో ఈ యజ్ఞం ఎంతమాత్రం సరితూగ దన్నాను. అప్పుడా సక్తుప్రస్థుడు చేసిన దానమహిమవలన నా శరీరం బంగారమైంది. మరి ఈ మహాయజ్ఞం ఆ పేలపిండి దానంతో

సరిపోగా లేకపోయింది ! కావున సక్తుప్రస్థుడు చేసిన దాన యజ్ఞం ఇంతకన్నా ఎంతో గొప్పది. ఇది నా అభిప్రాయం—'

అని యీవిధంగా ఆ బ్రాహ్మణోత్తములతో చెప్పి ఆ నకులము (ముంగిస) అంతర్థానమైపోయింది. తరువాత ఆ బ్రాహ్మణు లంతా ఎంతో ఆశ్చర్యపడినవారై తమ తమ గృహాలకు వెళ్ళిపోయినారు—

అని యీ ప్రకారం జనమేజయునకు, వైశంపాయనుడు నకులోపాఖ్యానం చెప్పాడు.

---

# 10. కీటకోపాఖ్యానము

భీష్మాచార్యుడు ధర్మరాజులవారికి ఈ ప్రకారం చెప్ప సాగాడు :

"ఓ ధర్మరాజా ! పూర్వం బ్రహ్మభూతుడైన కృష్ణ ద్వైపాయన మునీంద్రుడు లోకసంచారం చేస్తూ, ఒకానొక చోట బండ్లుపోయే మార్గంలో, మహావేగంగా పరుగెత్తి పోతున్న ఒక కీటకమును చూశాడు. ఆ మహర్షి సర్వజ్ఞుడు. సమస్తభూతముల మనోగతిని ఎరిగినవాడు. సమస్త జంతువుల భాష తెలిసినవాడు. అప్పు డా మహర్షి ఆ కీటకమును చూచి ఈవిధంగా ప్రశ్నించాడు :

"ఓ కీటకమా ! నీవుచూడబోతే చాలా భయపడినట్లు కనుపిస్తున్నావు. మహా వేగంగా పరుగెత్తుతున్నావు. ఎక్క-

డికి నీవు వెళ్ళేది ? ఎందుకు నీకింత భయం ? ఓ కీటకమా ! నాకు చెప్పు ?—"

వ్యాసమునీంద్రుడు ఈవిధంగా ప్రశ్నించేసరికి అప్పుడా కీటకము, ఆ మహర్షినిచూచి ఇట్లా సమాధానం చెప్పింది :

"ఓ మహాత్మా ! వెనుకనుంచి ఒక పెద్ద శకటం వస్తున్నశబ్దం నాకు వినవస్తున్నది. ఆ శబ్దం విని నేను భయపడినాను. అంత భయంకరమైన ధ్వని అది ! అదిగో ! దగ్గరికి రానేవచ్చింది. అదేం ! ధ్వని వినపడుతూనే ఉంది. ఆ మహాశకటం నన్ను చంపకుండా ఉంటుందా ? అందుకనే పారిపోతున్నాను. అదిగో ! బండికికట్టిన ఎద్దులచప్పుడుకూడా వినిపిస్తున్నది ! బండితోలేవాడు చెర్నకోల తీసుకొని వాటిని ఛెళ్ళు ఛెళ్ళున కొడుతూ అదలిస్తున్నాడు. అవి మోయలేని బరువు లాగుతూ ఎంతో కష్టంగా ఊపిరి పీలుస్తున్నాయి! ఎడ్లను తోలుకొనివచ్చే మనుష్యుల, అనేకరకాల చప్పుళ్ళు కూడా నా చెవిని పడుతున్నాయి. నావంటి కీటకజన్మం ఎత్తిన జీవులు ఇటువంటి భయంకరమైన శబ్దాలువిని భరించలేవు స్వామీ ! కనుకనే అతిభయంకరమైన ఈ పరిస్థితినుంచి తప్పించుకొని నేను పారిపోతున్నాను. సమస్త భూతాలకు కూడా మృత్యువు అత్యంత దుఃఖకరమైన విషయం. జీవితం ఎంతో దుర్లభమైనది. అందువలన నేను భయంతో పారిపోతున్నాను. దుఃఖం అనుభవించడానికి మనస్కరించక, నా క్షేమంకోసం ఈవిధంగా వెళ్ళిపోతున్నాను—"

కీటకముచెప్పిన మాటలు విని మళ్ళీ కృష్ణద్వైపాయన వ్యాసుడు ఈ విధంగా పలికాడు :

"ఓ కీటకమా! అప్పుడే, నీకు సుఖం లభించేది ఎక్కడున్నది? నీవు తిర్యగ్యోనులయందుకు పుట్టినదానవు. నీకు మరణమే సుఖమని భావిస్తున్నాను! శబ్దస్పర్శ రసగంధాది వివిధ రకాల భోగాలు నీకు తెలియనే తెలియవుకదా! ఓ, కీటకమా! మరణమే నీకు శ్రేయోదాయకమని అనుకొంటున్నాను!—"

అంతట కీటకము, తిరిగి వ్యాసమునిసంప్రశ్నకు ఈ ప్రకారం చెప్పింది:

"ఓ ప్రాజ్ఞుడా! ప్రాణంతో ఉన్న ప్రతి జీవిసంఘా, అది ఎటువంటి పరిస్థితిలో ఉన్నప్పటికీ, అదే దానికి పరమ ప్రీతిగా కనుపిస్తున్నది. నేను ఈవిధమైన కీటకజన్మను ఎత్తినప్పటికికూడా ఇదే నాకు ఎంతో సుఖంగా తోచుతున్నది. కనుకనే నేను జీవించాలని ఎంతగానో వాంఛిస్తున్నాను. ఇటువంటి జీవితంలోకూడా నా దేహానికి తగినట్లు నాకు ప్రతి విషయంలోనూ ఆనందం లభిస్తూనే ఉన్నది. అచలమైన వస్తువులనుండి జన్మించిన సమస్త మానవకోటీ, నావంటి జీవులుకూడా వేరువేరు ఆనందాలను పొందుతున్నాయి. ఓ స్వామీ! నా పూర్వజన్మవృత్తాంతం చెపుతాను వినండి—వెనుకటిజన్మలో నేనొక మనుష్యునిగా, శూద్రునిగా జన్మించాను. చాలా ధనవంతుణ్ణికూడా. అప్పుడు నేను బ్రాహ్మణులను భక్తితో పూజించలేదు. పైగా నేను క్రూరుడుగాను, మహా పాపస్వభావంకలవాణ్ణిగాను ఉన్నాను. అందిరికీ అధికమైన వడ్డీకి ధనం అప్పు ఇస్తుండేవాణ్ణి. చాలా కటువుగా మాట్లాడేవాణ్ణి. మోసంచెయ్యడమే గొప్పప్రజ్ఞ అనుకునే

వాణ్ణి. లోకంలో ఉండే సమస్త ప్రాణులనూ ద్వేషించేవాణ్ణి. మోసంతో, అసత్యంతో పరుల ధనం సర్వస్వం అపహరించే వాణ్ణి. నా సేవకులకుగాని, ఇంటికివచ్చే అతిథులకుగాని పట్టు మని పట్టెడు మెతుకులు పెట్టేవాణ్ణికాను. 'చిన్ని నా పొట్టకు శ్రీరామరక్ష' అన్నట్లు— నా తిండిమటుకు నేను చూచుకునే వాణ్ణి. నా సుఖంవరకు నేను చూచుకునేవాణ్ణి. ఆ విధంగా మదంతోను, మాత్సర్యంతోను, స్వార్థంతోను, చాలా క్రూరంగా జీవితాన్ని వెళ్ళబుచ్చాను. అత్యాశ నాకు. ధనం అంటే పడిచచ్చేవాణ్ణి. దేవతలకు, చనిపోయిన నా పితృ దేవతలకుగాని ఎన్నడూ శ్రద్ధాభక్తులతో పట్టెడన్నం పెట్టిన పాపాన పోలేదు. ఈ విధంగా విస్మృతంగా చేయవలసినవి కూడా మానుకున్నాను. భయార్తులైన జనులు నావద్దకువచ్చి నన్ను శరణువేడుకునేవారు. కాని ఏమాత్రం రక్షణ కల్పించ కుండాను, అభయం ఇవ్వకుండాను వాళ్ళను అకస్మాత్తుగా పంపించివేసేవాణ్ణి. ఎవ్వరికీ ఏమాత్రం సహాయం చేసేవాణ్ణి కాదు. పరుల ధనద్రవ్యాలను చూచి, ఎంతో ప్రియంగా ఉంటూఉన్న పరుల భార్యలనుచూచి, పరులు నివసిస్తున్న మంచిమంచి భవంతులనుచూచి, పరుల వస్త్ర వైభవాలను చూచి, ఊరకె నిష్కారణంగా అసూయపడేవాణ్ణి. ఇతరులకు సుఖమంటే నాకుగిట్టదు. ఎవరు సుఖంగా ఉన్నా చూడలేను. వాళ్ళ కెప్పుడు దరిద్రం చుట్టుకుంటుందా అని కోరుకునే వాణ్ణి. ఆ విధంగా నేను అసూయ, ద్వేషాలతో నిండిపోయి పరుల సుఖాన్ని, పరుల వైభవాన్ని పరులక్షేమాన్ని–సమస్తం ధ్వంసం చేయడానికి ప్రయత్నించాను. ఆవిధంగా నేను నా

పూర్వజన్మలో ఎన్నెన్నో పాపాలుచేశాను. చేయరానిపనులు చేశాను. అవన్నీ తలుచుకుంటే నాకు ఎక్కడ లేనిదుఃఖం ముంచు కొస్తుంది. అనుతాపం కలుగుతుంది. ప్రియమైన వస్తువుని పోగొట్టుకున్నట్లు అంతులేని దుఃఖంవచ్చి నన్ను ముంచి వేస్తుంది. ఆవిధంగా నేను కావించిన కర్మలవల్ల - ఒక్కటీ మంచి పనిలా కనుపించదు. ఒకవేళ- నేను చేసినవాటిలో ఏమైనా మంచి పనులున్నాయేమోకూడా నాకు తెలియదు. ఏమైనప్పటికీ నేను, వృద్ధురాలైన నా తల్లిని పూజించాను. ఒకానొక సమయంలో ఒక బ్రాహ్మణునిసూడా భక్తితో కొలిచాను. ఒక బ్రాహ్మణుడు సంచారం చేస్తూ ఒకసారి నా గృహానికి అతిథిగా అరుదెంచాడు. అప్పుడు నేను ఆయ నను శ్రద్ధాభక్తులతో ఆహ్వానించి, ఆతిథ్యం ఇచ్చి పూజిం చాను. నేను చేసిన ఆ ఒక్క పుణ్యకార్యం వల్లనే ఇప్పటికీ నాకు పూర్వజన్మ స్మృతి నశించకుండా ఉన్నది. ఆ పుణ్యమే ఎప్పటికైనా నన్ను మళ్ళీ సౌఖ్యవంతునిగా చేస్తుందని ఆశతో ఉన్నాను. తపోధనుడవైన ఓ మహర్షీ! మీరు సమస్తమూ ఎరుగుదురు. దయచేసి నాకు శ్రేయస్సు చేకూరే మార్గం చెప్పండి—"

## 2

అంతట ద్వైపాయన వ్యాసుడు కీటకముతో ఈరీతిగా పలికాడు :

"ఓ కీటకమా! నీవు చేసిన ఆ పుణ్యకర్మవల్లనే, నీవు తిర్యగ్యోనియందు జన్మించినప్పటికీ, నీకు స్మృతి తప్పి

పోకుండా ఉన్నది. అంతేకాదు, నీవు నన్ను దర్శించగలిగి నందువలనకూడా నీకీ స్మృతి ఉన్నది. ఓ కీటకమా! నేను నా తపోబలంవల్ల, నా దేహదర్శనం మాత్రమే లభించేటట్లు అనుగ్రహించి ఒక జీవుణ్ణి పాపంనుండి బయటపడేసి కాపాడ గలను. తపశ్శక్తికంటె బలీయమైన శక్తి మరొకటి లేదు. ఓ కీటకమా! నీవు పూర్వజన్మలో చేసుకొన్న పాపకర్మలవల్ల ఈ కీటక జన్మం ఎత్తావని నే నెరుగుదును. పుణ్యము, సౌశీల్యము ఆర్జించాలని నీవు ఎంతగా అనుకొన్నప్పటికీ నీవు తిరిగి దానినే పొందవచ్చుకూడా. దేవతలుకాని, తిర్యగ్యోను లందు జన్మించిన జీవులుకాని తా మొనర్చిన శుభాశుభ కర్మలవలన సుఖంకాని దుఃఖంకాని అనుభవిస్తున్నారు. ఈ అనుభవం తప్పదుసుమా! మనుష్యులు కామ్యాసక్తులై పుణ్య కర్మలు ఆచరిస్తున్నారు. సుఖాపేక్షతో ఆచరించిన ఆయా కర్మలు ఆయా ఫలములనే ప్రసాదిస్తున్నాయి. పూర్వజన్మలో పండితుడైకాని లేక మూర్ఖుడైకాని, ఆ జీవుడికి ఈ జన్మలో వాక్కు, బుద్ధి, కర చరణాదులు - అన్నీకూడా కుంచించ బడుతున్నాయి! ఓ కీటకమా! ఎవడైతే జీవించి ఉన్నప్పుడు సూర్యచంద్రాది దేవతలను వేదమంత్రాలతో పూజి స్తున్నాడో వాడు ఉత్తమమైన బ్రాహ్మణజన్మ ఎత్తుతున్నాడు. ఆవిధంగా చేసినట్లయితే నీవుకూడా ఆ జన్మ పొందగలవు! నీవు ఆస్థితిని పొందినప్పుడు ప్రపంచంలోని సమస్తభూతకోటినీ చూచి ఆనందం అనుభవించగలవు. అంతటి స్థితి వచ్చి నప్పుడు నీకు నేను బ్రహ్మత్వాన్ని ప్రసాదిస్తాను. లేక నీవు మరేది కోరితే, ఆగతి నీకు లభింపజేస్తాను—"

వ్యాసమునీంద్రుడు ఈవిధంగా చెప్పగా విని కీటకము అందుకు అంగీకరించింది. మార్గం వదలి పారిపోకుండా, మరణ భయం విడిచి అక్కడే ఉన్నది. అంతలో వెనుకనుంచి వస్తున్న శకటం రానే వచ్చింది. వచ్చి ఆ మార్గంగుండా బరబర వెళ్ళిపోయింది. ఆ శకటంయొక్క చక్రాల క్రిందపడి ఆ కీటకము తునాతునకలై పోయింది. ఆవిధంగా చనిపోయిన కీటకము, మహాతపశ్శక్తి సంపన్నుడైన వ్యాసమహర్షి అనుగ్రహంవలన క్షత్రియుడై జన్మించి, మళ్ళీ ఆ మహర్షిని చూడడానికై వచ్చింది. క్షత్రియజన్మ ఎత్తడానికి పూర్వం ఆ కీటకము క్రమంగా అనేక జన్మలెత్తింది. వరాహము, ఉడుము, ఎలుగు, జింక, పక్షి ఆదిగాగల అనేక జంతువుల యోనులందు జన్మించింది. అనంతరం క్రమంగా, చండాలుడుగాను, శూద్రుడుగాను, వైశ్యుడుగాను జన్మించి చివరకు క్షత్రియుడై పుట్టింది. అప్పుడు క్షత్రియుడైన ఆకీటకము, సత్యవాది అయిన వ్యాసమహర్షి అనుగ్రహాన్ని జ్ఞప్తియందుంచుకొని ఆయనను దర్శించి తాను పొందిన నానావిధ జన్మపరంపరల విషయం విన్నవించుకోవాలని మరల ఆ మహర్షి వద్దకు వచ్చింది. ఆయన పాదాలపై పడి సాష్టాంగ నమస్కారం కావించింది.

తరువాత చేతులు జోడించి, క్షత్రియుడైన ఆ కీటకము వ్యాసమహర్షితో ఈవిధంగా విన్నవించుకొన్నది :—

"ఓ మహాత్మా! శిరస్సువంచి మీకు నమస్కరిస్తున్నాను. ఇక—ఇప్పుడు నన్ను ఏంచెయ్యమంటారో ఆజ్ఞాపిం

చంకి. ఓ మహాప్రాజ్ఞుడా! తమ తపోమహిమవలన నేను ఈ స్థితికి వచ్చాను—"

ఆవిధంగా మహారాజురూపంలోవున్న కీటకము చెప్పినది విని వ్యాసమర్షి ఈ రీతిగా ప్రత్యుత్తరం ఒసగాడు :—

"ఓ రాజా! ఈరోజు నేను నీచే పూజితుడనైనాను. గౌరవపూరితమైన ఎన్నెన్నో వాక్యాలచేత నన్ను నీవు సంతోషపెట్టావు. నీవు కీటకముగా మారినప్పుడు నీ స్మృతి జుగుప్సతో ఆవరింపబడివున్నది. మళ్ళీ ఇప్పుడదే ప్రత్యక్షమవుతున్నది. నీవు పూర్వం శూద్రుడనై జన్మించి, ధనమే ప్రధానంగా చూచుకొని, బ్రాహ్మణులను ద్వేషించి, అనేక పాపకార్యాలు చేశావే—ఆ పాపం యింకా నశించలేదు. ఇప్పుడు నా దేహదర్శనంమాత్రమే నీకు లభించింది. నీవు కీటకమై జన్మించినప్పుడు, నేను నీకు ప్రసాదించిన పుణ్యఫలమే యీ నా దర్శనం నీకు లభ్యం కావడానికి కారణం. ఓ రాజా! నీవు నా కెప్పుడు నమస్కారంచేసి నన్ను పూజించావు. ఈ కారణంవలన నీవు ఇంతకంటె ఉత్తమజన్మకు— అనగా బ్రాహ్మణజన్మకు పోగలవు. కాని నీ వొక్క కార్యం అవశ్యంగా చెయ్యాలి. గోవులకోసం, బ్రాహ్మణులకోసం, క్షత్రియుడవైన నీవు రణరంగంలో పోరాడి మరణించినప్పుడే నీకు బ్రాహ్మణజన్మ తప్పక లభిస్తుంది. ఓ రాజపుత్రుడా! అనేకసుఖాలు అనుభవించి, భూరి దక్షిణలతో ఎన్నెన్నో క్రతువులు, యజ్ఞాలుచేసి, నీవు స్వర్గలోకాన్ని పొందుతావు. తరువాత శాశ్వతమైన బ్రహ్మత్వాన్ని పొంది, నిరతిశయానందంలో తేలిపోతావు! తిర్యగ్యోనులందు జన్మించినవారు

తిరిగి శూద్రులై పుడతారు. శూద్రజన్మనుంచి వైశ్యజన్మను వైశ్యజన్మనుంచి క్షత్రియజన్మము క్రమంగా లభిస్తాయి. క్షత్రియుడైనవాడు తన క్షత్రియ ధర్మాలను సక్రమంగా నిర్వహించి బ్రాహ్మణత్వాన్ని పొందగలుగుతాడు. బ్రాహ్మణుడు సచ్ఛీలవంతుడై, సాధువ్రతుడైనచో శాశ్వతమైన స్వర్గలోక సుఖాలను అనుభవించుతాడు—"

అని వ్యాసునకు, కీటకమునకు జరిగిన సంభాషణ తెలిపి భీష్ముడు మరల యీవిధంగా చెప్పసాగాడు :—

## 3

ఓ ధర్మనందనా! ఆవిధంగా ఆ కీటకము క్షత్రియ జన్మం ఎత్తింది. ఆ క్షత్రియుడు మహారాజై, ఐశ్వర్యవంతుడై, పూర్వజన్మల స్మృతి కలిగినవాడై, తీవ్రమైన తపస్సును అభ్యసించడం మొదలుపెట్టాడు. అతను ఆ రీతిగా ధర్మార్థవిదుడై తీవ్రమైన తపోనిష్ఠ కొనసాగించడం చూచి బ్రాహ్మణశ్రేష్ఠుడైన ద్వైపాయన వ్యాసుడు అతనివద్దకు వెళ్ళాడు—వెళ్ళి అతనితో యీవిధంగా పలికాడు :—

"క్షత్రియరూపం ధరించిన ఓ కీటకమా! రాజులుచేసే తపస్సులు, వ్రతాలు—అన్నికూడా సమస్తభూతాలను పరిపాలించడానికేసుమా! క్షత్రియునియొక్క యీ ధర్మవిధులను పర్యాలోచించడానికి నీ కీ తపస్సులు, వ్రతాలు నియతమైనాయి. నీ విక బ్రాహ్మణత్వాన్ని పొందాలి. నీవు ధర్మాధర్మాలను వివేచించి తెలుసుకొని, పరిశుద్ధాత్ముడవై, సమస్త

ప్రాణికోటినీ న్యాయంగా పరిపాలించవలసినది. ధర్మాన్ని ఉద్ధరిస్తూ, అధర్మాన్ని సరిదిద్దుతూ ఉండవలసినది. పరిశుద్ధమైన ఆత్మతో సంతుష్టి చెందుతూ ఎల్లప్పుడూ స్వధర్మపరాయణుడవై ఉండవలసినది. ఆ విధంగా నడుచుకొన్నట్లయితే నీవు మరణించిన తరువాత ఉత్తమమైన బ్రాహ్మణజన్మ ఎత్తగలవు—"

ఓ యుధిష్ఠిరుడా! వ్యాసమునీంద్రుడు ఆవిధంగా చెప్పి వెళ్ళినతరువాత, ఆ రాజు అరణ్యాలకు వెళ్ళిపోయినాడు. అప్పుడుకూడా అతను మహర్షి వాక్యాలను వింటూ, ప్రజలను ధర్మంగా పాలిస్తూవచ్చాడు.

ఓ ధర్మనందనా! తరువాత అచిరకాలంలోనే కీటకమైన ఆ రాజశ్రేష్ఠుడు, ధర్మంగా ప్రజలను పాలించి స్వధర్మాన్ని అనుష్ఠించినవాడైన కారణాన ఆ క్షత్రియదేహం త్యజించి బ్రాహ్మణుడైనాడు. ఆవిధంగా అతడు బ్రాహ్మణత్వం పొందడం చూచి, మహాప్రాజ్ఞుడు, యశస్సంపన్నుడు అయిన ద్వైపాయనవ్యాసమహర్షి అతనివద్దకుఅరుదెంచాడు—అతనితో ఈరీతిగా పలికాడు :

"ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! నీవిక వ్యథపడకుము. శుభకర్మలు చేసినవాడు శుభయోనులనుంచి జన్మిస్తున్నాడు. పాపకర్మ లొనర్చినవాడు పాపయోనులనుండి జన్మిస్తున్నాడు. ఓ ధర్మజ్ఞా! ఎంత పాపం చేస్తే అంత పాపఫలమే ప్రాప్తిస్తున్నది. కావున, ఓ కీటకమా! మృత్యుభయంవలన ఏమాత్రం కలవరపడకుము. నీవు భయపడవలసినది మృత్యువుకుకాదు, ధర్మానికి– ధర్మం లోపిస్తుందేమోనని మాత్రమే

నీవు భయపడవలసినది. కనుక నిరంతరం ధర్మాన్ని అను ష్ఠించు—"

వ్యాసమహర్షి పలుకులు విని— బ్రాహ్మణ రూపంలో ఉన్న కీటకము ఈవిధంగా సమాధానం చెప్పింది :

"ఓ మహాత్మా, తమ అనుగ్రహంవలన నేను కష్టం నుంచి సుఖతరమైన స్థితికి వచ్చాను. ఈ నా ఔన్నత్యానికి ధర్మమే మూలంకదా! కనుక నా పాపాలన్నీ పటాపంచలై పోయినవని భావిస్తున్నాను—"

ఓ ధర్మరాజా, ఆవిధంగా ఆ మహర్షి ఆజ్ఞవలన ఆ కీటకము దుర్లభమైన బ్రాహ్మణత్వాన్ని పొందగలిగింది. ఇది చాలా కష్టసాధ్యమైన విషయం. పృథ్వివిమీద నూరు యజ్ఞ ములయొక్క యూపస్తంభాలతో గుర్తింపబడవలసిన విషయం! బ్రహ్మవిదులైన బ్రాహ్మణోత్తము లందరికీకూడా అప్రాప్య సాక్షాత్తు బ్రహ్మలోకం ప్రాప్తించింది.

ఓ ధర్మనందనా, ఆరీతిగా కీటకము, వ్యాసులవారి వచనాలు అనుసరించి, ఎప్పటికప్పుడు స్వధర్మాన్ని నిర్వ ర్తిస్తూ అత్యున్నతమైన స్థితిని— బ్రహ్మపదవిని సాధించింది. ఆవిధంగానే తమశక్తిని యావత్తూ ధారపోసి, ప్రాణాలు కోలుపోయిన ప్రభావంకల రాజపుంగవు లందరూకూడా పుణ్యలోకాలనూ పొందారు. కావున, ఓ ధర్మరాజా! నీవు వారినిగురించి ఎంతమాత్రం దుఃఖించవలసిన పనిలేదు—

అని ఈప్రకారం భీష్ముడు, ధర్మరాజుకు అద్భుతమైన కీటకోపాఖ్యానం చెప్పాడు.

భీష్మాచార్యుడు ధర్మరాజుకు ఈ విధంగా చెప్ప నారంభించారు :

ఓ భరతవంశ శ్రేష్ఠుడా, పూర్వం భృగువంశజుడైన చ్యవను డనే మహర్షి ఉన్నాడు. ఆ మహానుభావుడు నిరం తరం తపం సలుపుతుండేవాడు. ఒకమాటు ఆయనకు 'ఉద వాసం' (నీళ్ళలో ఉండి తపస్సు చెయ్యడం) అనే కఠోర వ్రతం ప్రారంభించాలని బుద్ధిపుట్టింది. దానికి పూనుకున్నాడు. ఆ మహర్షి అభిమానం, క్రోధం, ఆనందం, శోకం, మోహం,– అన్నీ పరిత్యజించి, పన్నెండు సంవత్సరాలు ఏకధాటిగా, దృఢవ్రతుడై నీళ్ళలో ఉండి తపస్సు చెయ్యాలని నిశ్చ యించుకొన్నాడు. సమస్త ప్రాణికోటికీ పరమ ఆప్తుడైనాడు. అట్లాగే సమస్త జలచరాలకూ కూడా అత్యంత ప్రీతిపాత్రు డైనాడు.. ఆ తపోధనుడు విశ్వానికంతకూ చంద్రునివంటి చల్లనిస్వభావం కలవాడైనాడు. ఆ మహర్షి శుచిర్భూతుడై, సమస్తదేవతలకూ మ్రొక్కి గంగా–యమునా సంగమమునకు వెళ్ళి నీళ్ళలో ప్రవేశించాడు. ఆ విధంగా నీళ్ళలో ఒక అచే తనమైన స్తంభంలా నిలుచుండిపోయాడు. గంగా–యము నలు రెండూకూడా మహావేగంతో ప్రవహిస్తున్నాయి. మహా భయంకరమైన ధ్వనులతో ఘూర్ణిల్లుతున్నాయి. వాయువేగ మంత వడిగా వస్తున్న ఆ రెండు మహాప్రవాహాలకు ఎదు రుగా ఆ మహాత్ముడు తన శిరస్సు మోటించాడు.

గంగానది, యమునానది, తక్కిన ఉపనదులు, సర స్సులు—అన్నీకూడా ఏకమై ఆ మహర్షికి ఏమాత్రం హాని

కలిగించకుండా ఆయనకు ప్రదక్షిణంచేస్తూ ప్రవహించ సాగాయి.

ఓ భరతనందనా ! ఆవిధంగా చ్యవనమహర్షి, దారు స్తంభంలా ఆ జలాలలో ఉండి అప్పుడప్పుడు సులువుగా ఆ నీళ్ళలోనే పడుకొని నిద్రించేవాడు. మరొకప్పుడు కొయ్య స్తంభంలా కదలక–మెదలక నిలుచుండిపోయేవాడు. నీళ్ళలో సంచరించే సమస్త జంతువులకుకూడా ఆ ముని ప్రియమైనవాడైనాడు. ఆ జలచరాదులన్నీకూడా ఏమాత్రం భయంలేకుండా ఆ మహర్షిని తాకుతూ, ఉల్లాసంగా ఆయన పెదవులను సోకుతూ తిరగడం మొదలుపెట్టాయి. ఆ విధంగా ఆ చ్యవన మహర్షి ఎంతోకాలం నీళ్ళలో నిశ్చలంగా ఉండి కఠోరమైన తపస్సు సలిపాడు.

అంతట ఒకానొక సమయంలో కొందరు బెస్తవాండ్రు అక్కడికి వచ్చారు. వారందరూ పెద్దపెద్ద వలలు పట్టుకొని ఆ ఋషిఉన్న ప్రదేశానికి వచ్చారు. వాళ్ళు చాలామంది ఉన్నారు. అందరుకూడా ఆజానుబాహులు, విశాలవక్షస్థలం కలవారు, దృఢకాయులు, బలిష్ఠులు, అమిత ధైర్యవంతులు, సాహసులు. నీళ్ళంటే వాళ్ళకెంతమాత్రం భయం లేదు. నీళ్ళలో దిగి ఎన్నడూ వెనుకంజ వెయ్యరు. ఆ వలలే వాళ్ళకు జీవనాధారం. వాళ్ళంతా చేపలు పట్టడానికి అక్కడికి వచ్చారు. ఓ భరతవంశ శ్రేష్ఠుడా ! ఆ విధంగా ఆ బెస్తలు అనేక మత్స్యములతో కూడుకొన్న ఆ గంగా యమునా సంగమమునకు వచ్చి, తమ వలలన్నీ ఒకదానితో ఒకటి బిగించి కట్టారు. నదీజలాలలో ఒక ప్రదేశమంతా

ఆక్రమించి, వలలు నీళ్ళలోకి విసిరారు. ఆ వలలన్నీ క్రొత్త దారాలతో అల్లినవి. కావలసినంత పొడుగు - వెడల్పు కలిగిన పెద్ద వలలు అవి. ఎంత పెద్దచేపలైనా వాటిలో పడతాయి. ఆవిధంగా ఆ బెస్తలు నీళ్ళలో దిగి, అన్నీ కలిపి కట్టిన ఆ పెద్దవలను నదీజలాలలోకి విసరి, నీళ్ళలోకి వంగి చేపలు పట్టడం మొదలుపెట్టారు. వాళ్ళంతా నిర్భయులై, ఎంతో ఉల్లాసంగా ఒకరితో ఒకరు పందెం వేసుకొంటూ, అనేక చేపలను, ఇంకా ఇతర జలచరాలను పట్టుకొన్నారు.

ఓ ధర్మరాజా! ఆవిధంగా ఆ బెస్తలు వలలు లాగుతూ అనేక చేపలతోపాటు భృగుమహర్షి కుమారుడైన చ్యవన మహర్షినికూడా పట్టుకొన్నారు. ఆ మహర్షి వళ్ళంతా పాచి పట్టిపోయింది. గడ్డము, తలవెండ్రుకలు జడలు మెలుచుకొని పోయి, అంతటా పాచి పేరుకొని ఆకుపచ్చ వర్ణంగా కనుపిస్తున్నవి. ఆ మహాముని శరీరమంతటాకూడా శంఖాలు, నత్తగుల్లలు నిండిఉన్నాయి. వేదపారగుడైన ఆ మహర్షిని బెస్తలు చూచారు. తాము ఆయనను నీళ్ళలోనుంచి బయటికి లాగామని తెలుసుకొని ఆ బెస్తవాండ్రు మిక్కిలి భీతి చెందినవారై ఒడ్డుకు వచ్చారు. వలలన్నీ నేలమీద పెట్టారు. అంతట ఆ బెస్తలు తాము చేసినపనికి ఎంతో భయపడుతూను, బాధపడుతూను మహర్షికి దాసోహం అంటూ, అంజలి ఘటించి, పదేపదే శిరస్సులు వంచి మ్రొక్కారు. నీళ్ళలోనుంచి బయటికి తీయడంవలన, భయంవలన వలలలో పడిన చేపలన్నీ చచ్చిపోయినవి. ఆవిధంగా మృతిచెందిన

10

చేపలను చూడగానే చ్యవనమహర్షికి ఎక్కడలేని కరుణా, జాలీ పుట్టుకొచ్చాయి. అయ్యో, పాపం, అన్నట్లు పదేపదే నిశ్వసించాయి.

అంతట ఆ నిషాదులు (బెస్తలు) చ్యవనమహర్షిని చూచి సవినయంగా ఇట్లు పలికారు:

“ఓ మహామునీ! మేము అజ్ఞానంవలన ఈ పాప కృత్యం చేశాము. మమ్మల్ని అనుగ్రహించుము! మీ కోర్కె ఏమిటో చెప్పండి, నెరవేరుస్తాము. ఆజ్ఞ ఇవ్వండి మహర్షీ!”

ఆవిధంగా బెస్తలు చెప్పిన మాటలు విని, మృతి చెందిన చేపలమధ్య ఉన్న చ్యవనమహర్షి వారితో— “ఓ బెస్తలారా! నా కోర్కె ఏమిటో చెబుతాను, శ్రద్ధగా వినండి! ఈ చేపలమధ్య నేను ఎంతోకాలంబట్టీ నివసిస్తున్నాను. ఈ జలజంతువులన్నీ నాకు మిక్కిలి స్నేహమైనాయి. [illegible]నుకి చస్తే వీటితోపాటే నేను చస్తాను. లేదా వీటితోపాటు నన్నూ తీసుకొనిపోయి మీరు అమ్ముకోండి! అంతేకాని ఇప్పుడీ స్థితిలో వీటిని వదలిపెట్టి నేను జీవించలేను!”— అని పలికాడు.

ఓ ధర్మరాజా! చ్యవనమహర్షి ఈ రీతిగా పలికేటప్పటికి, ఆ బెస్తవాండ్రంతా మిక్కిలి భయకంపితులైనారు. ముఖాలన్నీ వెలవెలబుచ్చుకొని – వెంటనే తమ రాజయిన నహుషునివద్దకు వెళ్ళి జరిగిన విషయమంతా ఆయనకు విన్నవించారు—

అని తెలిపి భీష్ముడు మళ్ళీ ఈ ప్రకారం చెప్పసాగాడు:

# 2

బెస్తలు చెప్పిన సమాచారమంతా విని రాజయిన నహుషుడు, వెంటనే తన మంత్రులను, పురోహితులను వెంట తీసుకొని చ్యవనమహర్షి ఉన్న ప్రదేశానికి వచ్చాడు. యథా విధిగా కాళ్లు - చేతులు కడుగుకొని, శుచిర్భూతుడై, శ్రద్ధా భక్తులతో చ్యవనమహర్షికి నమస్కరించాడు. తాను స్వయానా 'నహుషచక్రవర్తి' నని విన్నవించుకొన్నాడు. తరువాత రాజపురోహితులున్నూ, సత్యవ్రతుడు, మహాత్ముడు, దేవాంశ సంభూతుడు అయిన చ్యవనమహర్షిని యథావిధిగా పూజించారు.

అంతట నహుషుడు, ఆ మహర్షితో —"ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా! తమకు నేను చేయదగిన ప్రియమైన కార్యం ఏమిటి? సెలవీయండి మహాత్మా! మీరు ఆజ్ఞాపిస్తే, అది ఎంతకష్టతరమైన కార్యమైనాసరే, అవశ్యం చేస్తున్నాను"— అని చెప్పాడు.

నహుషుని మాటలు విని చ్యవనమహర్షి ఈ విధంగా బదులు చెప్పాడు :

"ఓ రాజా! చేపలుపట్టి జీవించే ఈ బెస్తవాండ్రందరూ, శ్రమతో మిక్కిలి బడలి ఉన్నారు. కనుక నాతో కూడా కలుపుకొని, ఈ చేప లన్నింటికీ ఎంత మూల్యం అవుతున్నదో—అది ఈ బెస్తలకు ఇవ్వవలసినది!"—

అందుకు నహుషుడు ఇట్లా చెప్పాడు :

"ఓమహర్షీ! తమ ఆజ్ఞప్రకారం పూజ్యులైన తమతో సహా చేపలను కొన్నందుకు వెయ్యి బంగారునాణెములు మా పురోహితుడు ఈ బెస్తలకు ఇస్తాడు."

అది విని చ్యవనమహర్షి మరల ఇట్లు పలికాడు :

"ఓ రాజా! నా విలువ వెయ్యి బంగారు నాణెములు కాదు. అది నీ వివేకంపై ఆధారపడి ఉన్నది. కావున నీవు మళ్ళీ స్వబుద్ధితో నిర్ణయించుకొని న్యాయమైన ధర వీళ్ళకు ఇప్పించవలసినది"—

అప్పుడు నహుషుడు —

"ఓ మహాప్రాజ్ఞుడా! అవుతే నూఱువేల బంగారు నాణెములు ఈ బెస్తలు పుచ్చుకుంటారు. ఇది సరైన ధరయే నంటారా? లేక తమ అభిప్రాయం వేరుగా ఉన్నదా? ఉంటే చెప్పండి మహాత్మా!" అన్నాడు.

అందుకు చ్యవనమహర్షి —

"ఓ రాజశ్రేష్ఠుడా! నన్ను కొనే ధర నూఱువేల నాణెములేనా? కానే కాదు! వీళ్ళకు న్యాయంగా ధరకట్టి ఇవ్వండి! మళ్ళీ ఒకమాటు మీ మంత్రులతో సంప్రదించండి మహారాజా!" అని పలికాడు.

అప్పుడు నహుషుడు —

"ఓ మహామునీ! అవుతే ఒక కోటి బంగారు నాణెములు ఈ బెస్తలు పుచ్చుకుంటారు. సరేనా? చాలకపోతే చెప్పండి— ఇంకా ఎక్కువ తీసుకొంటారు" — అన్నాడు.

అందుకు చ్యవనమహాముని మళ్ళీ —

"ఓ రాజేంద్రా! ఒకకోటి ఏమిటి?- అంతకు ఎక్కువైనాకూడా నన్ను కొనడానికి చాలదు. కనుక న్యాయంగాను, సక్రమంగాను ధరకట్టి ఈ బెస్తలకు ఇప్పించు. నీవు మరొకతడవ బ్రాహ్మణులతో సంప్రదించు మహారాజా!"— అని పలికాడు.

అప్పుడు నహుషుడు —

"ఓ బ్రాహ్మణోత్తమా! అవుతే నా అర్ధరాజ్యాన్ని కాని లేక పూర్తిరాజ్యాన్నికాని ఈ బెస్తలకు సమర్పిస్తాను. సరేనా మహాత్మా? ఇది మీకు సరైన ధర అనుకుంటాను- కాకపోతే చెప్పండి?"— అన్నాడు.

అందులకు చ్యవనమహర్షి —

"ఓ రాజపుంగవా! నన్ను కొనడానికి అర్ధరాజ్యం కాని- పూర్తిరాజ్యంకాని చాలదు. వీళ్ళకు న్యాయమైన ధర ముట్టేటట్లు చూడండి. ఒకసారి ఋషులతో సంప్రదించండి నృపాలా!—" అని వచించాడు.

ఓ ధర్మనందనా! ఆ మహర్షి ఈవిధంగా పలికేటప్పటికి, నహుషమహారాజు మహాదుఃఖంలో మునిగిపోయినాడు. ఈ విషయాన్నిగురించి తన మంత్రులతోను, పురోహితులతోను ఆలోచన చేశాడు. కాని పరిష్కారమార్గం కానక నహుషుడు మిక్కిలి పరితపించసాగాడు. అప్పుడక్కడికి, కందమూలాలు, ఫలాలు తిని జీవిస్తూ, అరణ్యాలలో నివసించే గోజాతికిచెందిన ఒకముని వచ్చాడు. ఆ మునివర్యుడు నహుషునివద్దకు వచ్చి —

"ఓ రాజా ! నేను నీ సంతోషాన్ని పోగొట్టి తృప్తిపరుస్తాను. ఈ చ్యవనమహర్షినికూడా సంతుష్టుని కావిస్తాను. ఓ రాజా ! నేను అసత్యం పలికేవాడిని కాను. పరిహాసానికైనా అబద్ధమాడినివాణ్ణి. ఇక తక్కిన సమయాల్లో అసత్యమాడతానా ? లేదు. నీవేమాత్రం సంశయించవలసిన పనిలేదు. నేను చెప్పినట్లు చెయ్యి —" అని పలికాడు.

అది విని నహుషుడు —

"స్వామీ ! భృగుమహర్షి కుమారుడైన ఈ మునిశ్రేష్ఠుని విలువ ఎంతో తమకు తెలుసునా ? తెలిస్తే నన్ను మహాసంకటంనుంచి కాపాడండి. నన్ను, నా కుటుంబాన్ని, నా రాజ్యాన్ని- ఈ మహావిపత్తునుంచి రక్షించండి మహాత్మా ! మహాత్ముడైన ఈ చ్యవనమహర్షి కోపించినట్లయితే ముల్లోకాలను సయితం ధ్వంసంచెయ్యగలడు. ఇక, ఆ మహర్షి మునులను తపోహీనుడను, దౌర్భాగ్యుడను, కేవలం బాహుబలంతో బ్రతికేవాడను అయిన నేను నిలువగలనా స్వామీ! - కనుక ఓ మునివర్యా ! అగాధమైన దుఃఖసముద్రంలో మునిగిఉన్న నన్ను, నా మంత్రులను, పురోహితులను కాపాడండి. ఈ మహర్షియొక్క విలువ ఎంతో తెలిపి ఈ చిక్కును పరిష్కారం చెయ్యండి —" అని ప్రార్థించాడు.

ఓ యుధిష్ఠిరమహారాజా! ఆవిధంగా నహుషుడు చెప్పినది విని, మహాప్రతాపశాలి, గోజానికి చెందినవాడు అయిన ఆ ముని—రాజును, అతని మంత్రులను సంతుష్టికావిస్తూ ఈ విధంగా చెప్పాడు :

"ఓ రాజా! నాలుగు వర్ణాలలోనూ శ్రేష్ఠులైన బ్రాహ్మణులున్నారే- వారికి విలువ అనేది లేదు. వారికి విలువ కట్టడం సాధ్యంకాదు. ఎంత ఎత్తుధనం పోసినా వారితో సరి తూగదు. అట్లాగే గోవులుకూడా! కనుక గోవులు, బ్రాహ్మణులు ఒకటి. గోవు ఒక్కటే ఈ బ్రాహ్మణునితో సరితూగలదు-"

ఆ మునివర్యుడు ఇట్లు చెప్పగా విని నహుషుడు పరమానందభరితుడైనాడు. ఆయన మంత్రులు, పురోహితులు కూడా మిక్కిలి సంతోషించారు. అంతట నహుషుడు, తన మంత్రి, పురోహితులను వెంటబెట్టుకొని, ఆ మునితో సహా బయలుదేరి, భృగునందనుడు, దృఢవ్రతుడు అయిన చ్యవన మహర్షి చెంతకు వెళ్ళాడు. వెళ్ళి ఆ మహాత్ముని సంతుష్టి పరుస్తూ ఈ విధంగా పలికాడు :

"ఓ బ్రహ్మర్షి! లెమ్ము, లెమ్ము. ఓ భృగునందనా! మీకు తగిన ధర గోవు. గోవును మీకు ప్రతిగా సమర్పిస్తున్నాను. ఓ ధర్మజ్ఞా! ఇది మీకు న్యాయమైన మూల్యం అని భావిస్తున్నాను!—"

నహుషుని పలుకులు విని చ్యవనమహర్షి —

"ఓ నహుషచక్రవర్తీ! నీవు చెప్పినట్లు నేను లేస్తున్నాను. ఓ పాపరహితుడా! ఇప్పుడు న్యాయమైన మూల్యం యిచ్చి నీవు నన్ను కొన్నావు. ఓ కీర్తిసంపన్నుడా! ఎంత ధనమైనా గోవుతో సమానంకాదని ఇప్పుడైనా నీవు తెలుసుకొన్నావుకదా! గోవులను కీర్తించడం, గోవుల మహిమ చెప్పగా వినడం, గోవులను దానంచెయ్యడం, గోవులను దర్శించడం—ఈ కార్యాలన్నీకూడా అత్యంత శుభప్రదమైనవి.

సర్వపాపాలనూ పోగొట్టేవి. పూజితమైన ఓ రాజా! గోవులు ఎల్లప్పుడూకూడా అభ్యున్నతికి మూలం. గోవులు గోసుగహితమైనవి, పవిత్రమైనవీను. దేవతలకుహవిస్సురూపంలో గోవులు ఎల్లప్పుడూ శ్రేష్ఠమైన అన్నాన్ని ఒసగుతున్నాయి. స్వాహాకార, వషట్కారాది వేదమంత్రాలన్నీకూడా ఎప్పుడూ గోవులపైననే ప్రతిష్ఠితమై ఉన్నాయి. యజ్ఞయాగాది క్రతువులన్నీకూడా గోముఖంగానే నిర్వహించబడుతున్నాయి. గోవు యజ్ఞముఖం. గోవులు దివ్యమైన, మహా శక్తిమంతమైన అమృతాన్ని ప్రసాదిస్తున్నాయి. సమస్తలోకాలవారిచేత పూజింపబడుతున్నాయి. గోవులు యీ భూమిమీద అగ్నిసమమైన తేజస్సు, రూపమూ కలిగి, సమస్తప్రాణికోటికీ సుఖప్రదములై వెలుగొందుతున్నాయి. ఏ దేశవాసులచేత గోవులు సురక్షితంగా పెంచబడి, కాపాడబడుతున్నాయో, ఆ దేశంలో ఎప్పుడూ భయం ఉండదు. ఆపద ఉండదు. పాపం అసలే ఉండదు. ఆ దేశం మహోన్నతవైభవంలో విరాజిల్లుతూ ఉంటుంది. ఓ రాజపుంగవా! గోవులు స్వర్గానికి నిచ్చెనలవంటివి. సాక్షాత్తు స్వర్గంలోనే గోవులు పూజింపబడుతున్నాయి. గోవులు సమస్త కామ్యాలనూ తీర్చే దేవతలు. గోవులకంటె అధికమైనదికాని, శ్రేష్ఠమైనదికాని మరొకటి లేదు!—" అని చెప్పాడు.

భరతవంశశ్రేష్ఠుడవైన ఓ యుధిష్ఠిరమహారాజా! గోవుల మాహాత్మ్యాన్ని గురించీ, ఆధిక్యమును గురించీ నీ కీ విషయం చెప్పాను. గోవులయొక్క పుణ్యాన్నిగురించి, గుణాలనుగురించి నీకు నేను ఏదో స్వల్పంగామాత్రమే చెప్పగలను.

కాని, ఈ విషయంపై సమగ్రంగా వివరించి చెప్పడం నా శక్యంకాదు. ఓ ధర్మరాజా! తరువాత కథ చెపుతాను విను—

తరువాత తాము వలవేసి పట్టిన చేపలకు చ్యవనమహర్షికి ప్రత్యామ్నాయంగా నహుషమహారాజునుంచి తాము ఆవును స్వీకరించిన బెస్తవాండ్రు—చ్యవనమహామునికి నమస్కరించి సవినయంగా యిట్లా విన్నవించుకొన్నారు —

"ఓ మహాత్మా! మాకు తమ దర్శనం లభించింది. తమను మాతో సంభాషించడంకూడా జరిగింది. ఏడడుగులు నడిచినంతమాత్రానానే, ఏడుమాటలు మాట్లాడినంతమాత్రాననే ఒకరి కొకరు స్నేహితు లవుతారని పెద్దలు చెపుతారు. కావున తమరు మా కిప్పుడు ఆప్తులైనారు. ఓ స్వామీ! మాయందు అనుగ్రహం చూపవలసినది. అగ్నిహోత్రుడు తనపై పైచే నిర్మలమైన వెన్నను యీవత్తూ ఆహుతిగా గైకొంటున్నాడు. ఓ ధర్మాత్మా! నీవు మానవులమధ్య ఉంటున్న అగ్నిహోత్రుడవు. మహా తపశ్శాలివి. ఓ మహాత్మా! మా పాపాలన్నీ పరిహారం చెయ్యండి. మమ్ములను అనుగ్రహించండి. మేము మీ చరణదాసులము. మాపై కృపచూపి మళ్ళీ యీ ఆవును మీరే పరిగ్రహించండి—"

వారి ప్రార్థన విని చ్యవనముని—

ఓ బెస్తలారా! దుఃఖార్తుడైన వాని కన్నుగాని, మునీశ్వరుని కన్నుగాని, విషపూరితమైయున్న పాముయొక్క కన్నుగాని, వాయువుతోకూడిన అగ్ని, ఎండుగడ్డిని దహించి నట్లుగా ఒక మానవుని సమూలంగా దహించివేస్తున్నాయి.

కనుక ఓ బెస్తలారా! మీరు నాకు దానం చెయ్యదలచిన ఆవును నేను స్వీకరిస్తున్నాను. ఓ పాపరహితులైన నిషాదు లారా! ఇక మీరు వలలువేసి పట్టిన ఈ చేపలు జలచరాదు లతో సహా స్వర్గలోకానికి పొండి—" అని పలికాడు.

ఓ పాండవాగ్రజా! ఆతనునాటి పరిస్థితుల్లోనే ఆ మహర్షి వచనప్రభావంవలన ఆ బెస్తలందరూ ఆ చేప లతోసహా స్వర్గానికి వెళ్ళారు. ఓ భరతవంశశ్రేష్ఠుడా! ఆ విధంగా ఆ బెస్తవాండ్రున్నూ, ఆ చేపలున్నూ స్వర్గానికిపోవడం మహాద్భుతమై చూపట్టింది.

అటుపిమ్మట గోజాతికిచెందిన మునివర్యుడున్నూ, చ్యవన మహర్షియున్నూ సంతోషించినవారై నహుషునకు అనేక వరాలు అనుగ్రహించారు.

అంతట మహా వీర్యవంతుడు, పృథ్వీపతి అయిన నహుషుడు మిక్కిలి ఆనందపరవశుడైనాడు. మహాత్ములైన ఆ ఇరువురు మునులూ, నహుషునకు ఎల్లప్పుడూ ధర్మంలో తొలగ కుండా ఉండేటట్లున్నూ, అతను దేవేంద్రవైభవంతో సమాన మైన వైభవం పొందేటట్లున్నూ వరాలు ఒసగారు. నహుష చక్రవర్తి ఆ ఇరువురు మహర్షులను శిరస్సున పెట్టుకొని పూజించి గౌరవించాడు.

అంతట చ్యవనమహర్షి తన ద్వాదశవర్షవ్రతం సంపూర్తి అయినందున తిరిగి తన ఆశ్రమానికి వెళ్ళిపోయినాడు. గోవుకు జన్మించిన ఆ రెండవ మునీశ్వరుడుకూడా మరల స్వస్థానానికి వెళ్ళిపోయినాడు.

ఓ ధర్మనందనా! ఆవిధంగా బెస్తవాండ్రున్ను, వారు పట్టుకొన్న చేపలున్ను దివ్యలోకానికి వెళ్ళిపోయినపిదప నహుషచక్రవర్తికూడా ఆ విషయం తలుచుకొంటూ మిక్కిలి ఆశ్చర్యము, ఆనందము పొందుతూ తన పరివారంతో మళ్ళీ తన పట్టణానికి వెళ్ళిపోయినాడు—

అని ఈవిధంగా భీష్ముడు ధర్మరాజులవారికి పుణ్యప్రదమైన చ్యవనోపాఖ్యానం వినిపించాడు.

## 12. నంద (ధేను) చరిత్రము

పులస్త్యుడు ఈవిధంగా చెప్పసాగాడు :—

పూర్వం ప్రభంజను డనే రాజు ఉండేవాడు. అతను ఒకనాడు ఒక వనానికి వేటకు వెళ్ళాడు. అక్కడ ఒక ఆడు లేడి తనబిడ్డకు పాలిస్తుండగా దానిని తన తీక్ష్ణమైనబాణంతో కొట్టాడు. అప్పుడా ఆడులేడి కుపితయై, ఆ రాజును పెద్దపులివి కమ్మని శపించింది.

ఆ విధంగా మృగంచే శపించబడినవాడై ఆరాజు పెద్ద పులి అయినాడు. పెద్దపెద్ద గోళ్లు, కోరలు కలిగి భయంకరమైన వ్యాఘ్రరూపం ధరించాడు.

ఆవిధంగా ఆ పెద్దపులి ఆ వనంలో సంచరిస్తూ, తత్తత్కాలలో అక్కడికి వస్తూపోతూ ఉండే మృగాలను, మనుష్యులను తన పొట్టన పెట్టుకుంటూ వచ్చింది. ఈ ప్రకారంగా నూఱుసంవత్సరాలు గడచాయి.

అంతట కొంతకాలానికి కొందరు గొల్లలు తమ ఆవుల మందలతో వచ్చి ఆ వనంలో విడిశారు. అప్పుడా గోగణాలన్నీకూడా బాగా పచ్చిక పెరిగిఉన్న ఆ వనప్రాంతంలో, మేతకోసం, నీళ్ళకోసం యథేచ్ఛగా సంచరించసాగాయి. ఆ ఆలమందలో ఒక చూడచక్కని ఆవు ఉన్నది. దాని పేరు నంద. రాజహంసవలె తెల్లగా తళతళ మెరిసిపోతున్న ఆవు అది. కుండలకొద్దీ పాలు జాలువార్చే శక్తిగలది. దాని ఒళ్లునున్నగా మెదమెద లాడుతున్నది. సుదీర్ఘమైన నాసిక, నీలవర్ణంగల కంఠం, ముచ్చటైన మెడ, మనోహరమైన కంఠస్వరం కలిగి ఆ ధేనువు ఎంతో పుష్టిగా, మనోహరంగా ఉన్నది. మెడలో గంటలు గణగణ మ్రోగుతుండగా, నంద అను పేరుగల ఆ ధేనువు ఆ గోగణానికి మున్ముందుగా బయలు వెడలినడుస్తూ, ఇతరఆవుల తోడు లేకుండానే ఆ అరణ్యప్రాంతం లోని పచ్చికబయళ్లలో నిర్భయంగా సంచరించసాగింది.

ఆ అరణ్యంలో అనేక గుహలు, లోయలు కలిగిన రోహితమనే ఒక పెద్ద పర్వతం ఉన్నది. ఆ పర్వతానికి ఈశాన్యమూలగా అనేక మృగాలు, సింహాలతో కూడి, లెక్కలేనన్ని చెట్లతోను, తీగెలతోను దట్టంగా అల్లుకొని, అనేకములైన నక్కల కూతలతో నిండి, ప్రవేశించ శక్యం కాకుండా ఒకఅడవి ఉన్నది. పూర్వం రాజు, లేడి శాపంవలన వ్యాఘ్రజన్మ ఎత్తిన భయంకరమైన పెద్దపులి ఆ అడవిలోనే నివసిస్తున్నది. ఆ పులి మేఘగర్జనవంటి కంఠస్వరం, పెద్ద కొండగుహఅంత నోరు, తీక్ష్ణమైన కోరలు, గోళ్ళు కలిగి మహాభయంకరమై, మహాబలిష్ఠమై, కాలమే ఆ రూపం

ఎత్తిందా అని చూపఱులకు మహాభీతిని గొలుపుతూ ఆ అడవిలో నివాసం చేస్తున్నది.

అంతట ఒకనాడు ఎంతో ధర్మబుద్ధి కలది, గోవులకు గోపాలురకు ఎల్లప్పుడూ హితముకోరుతుండేది, అయిన నంద అను పేరుగల ఆ ధేనువు, తోటి ఆవుల నన్నింటినీ విడచి, యథేచ్ఛగా మేతమేయడానికై ఒంటరిగా, ఆ పెద్దపులి నివసించేచోటికి వచ్చింది. అప్పుడా వ్యాఘ్రం నందనుచూచి వెంటనే, ఆ ఆవుపై కివిసింది. భయంకరంగా గోండ్రిస్తూ నిలునిలు మని అదలించింది.

తరువాత ఆవునుచూచి ఆ వ్యాఘ్రం ఇట్లా అన్నది :

"ఓ ధేనుకా! నీవు నాకు ఆహారంగా వచ్చావు. ఇక నీవు నా బారినుండి ఏవిధంగా తప్పించుకుంటావు ? తప్పించుకొని పోలేవుసుమా !"

ఈవిధంగా ఆ పులి నిష్ఠురంగా పలికేటప్పటికి నందకు పసిబాలుడు, చందమామవంటి వన్నె – చిన్నెలు కలవాడు అయిన తన కొడుకు జ్ఞాపకానికి వచ్చాడు. హృదయంలో నుంచి పుత్రవాత్సల్యం పెల్లుబికివచ్చింది. అప్పుడా నంద అంతులేని చింతతో పొగులుతూ చూచేవారికి జాలిగొలిపే టట్లు కన్నులనుండి బాష్పధారలు ఒలికించసాగింది. ఇక ఆ నాటితో తనకూ తన కుమారునికీ ఋణం తీరినదని – కొడుకుపై ఆశ వదలుకొని ఎంతో దుఃఖించడం మొదలుపెట్టింది.

అప్పుడా విధంగా దుఃఖిస్తున్న ఆవునుచూచి పులి మళ్ళీ —

"ఓ ధేనుకా! నీ వెందులకు దుఃఖిస్తున్నావు? ఆ దేవుడే నేడు నిన్ను నాకు ఆహారంగా పంపాడు. నీవు ఎంత ఏడ్చి - మొత్తుకొన్నా ప్రయోజనంలేదు. నీ వే రీతిగా దుఃఖించినంత మాత్రాన నిన్ను నేను వదలిపెట్టను. ఏవిధం గానూ నీవు నీ ప్రాణాలు రక్షించుకోలేవు. ఇవాళ నీకు నా చేతిలో చావు వ్రాసిపెట్టి ఉన్నది. కనుక, ఓ ధేనుకా! నీవు చింతించి లాభంలేదు కాని ఒక్క విషయం నాకు చెప్పు? నీ దుఃఖానికి కారణం ఇదికాదు. వేఱే ఏదో ఉన్నది. అదేమిటో నాకు చెప్పు?" అని పలికింది.

పులిమాటలు విని నంద అను ఆ ఆవు అప్పుడు వినయంగా బదులు చెప్పింది :

"ఓ వ్యాఘ్రరాజమా! నీకు నమస్కారం చేస్తు న్నాను. లోకంలో ఇంతవరకూ, నీ వాతబడి బ్రతికి బట్ట కట్టినవారిని చూచి ఎరుగము. క్షుద్రమైన ఈ నా జీవితాన్ని గురించి నేను ఎంతమాత్రం విచారించడంలేదు. చావు సమస్త జంతువులకూ సహజమేకదా! పుట్టినవాడు గిట్టక మానడు. అట్లాగే గిట్టినవాడున్నూ మళ్ళీ పుట్టకమానడు! ఈ చావు పుట్టుకలను తప్పించుకొనడం ఎవ్వరికీ వశంకాదు. కాబట్టి ఈ విషయమై నాకేమాత్రం విచారంలేదు. ఓ వ్యాఘ్ర రాజా! సమస్త దేవతలుకూడా, భోగకాలం సంప్రాప్తించి నంతనే పదవులు పొందుతున్నారు. అది తీరినంతనే భ్రష్టు లవుతున్నారు. కనుక దీనినిగురించి చింతించవలసిన పనిలేదు. కాని నా హృదయంలో దుఃఖం పెల్లుబికి వస్తున్నది. ఎంత ప్రయత్నించినా ఆదుఃఖాన్ని ఆపుకోలేకుండా ఉన్నాను. నాకు

తొలిచూలుకు పుట్టిన కొడుకు ఒకడున్నాడు. మహాబల వంతుడవైన ఓ వ్యాఘ్రరాజమా! ఆ పసివాడు ఇంతవరకూ గడ్డిపరక ముట్టి ఎరుగడు. ఎప్పుడూ నాపాలే కావాలి వాడికి. పాలు త్రాగడం తప్ప మరేమీ తినడు. నాపాలే వాడికి జీవనాధారం. వాడిప్పుడు ఇంటిదగ్గర గొల్లవాండ్రచే కట్టివేయబడి ఉన్నాడు. ఆకలిబాధకు నాకోసం అలమటిస్తూ ఉంటాడు. నే నెప్పుడు వస్తానా అని ఎదురు – తెన్నులు చూస్తుంటాడు. ఓ వ్యాఘ్రరాజా! ఒకమాటు నేను అక్కడికి వెళ్ళి ఆ చంటివాడికి తృప్తితీరేటట్లుగా పాలుకుడిపివస్తాను. వాణ్ణి ఒకసారి కళ్ళారాచూచి, ముద్దాడి వస్తాను. వాడికి బుద్ధులుచెప్పి – మంచిచెడ్డలు బోధించి, వాడి పోషణభారం నా స్నేహితురాండ్రకు ఒప్పగించి, తిరిగి నీవద్దకు వస్తాను. ఓ వ్యాఘ్రరాజమా! అప్పుడు నీవు నన్ను కడుపార భక్షించవచ్చును. ఓ వ్యాఘ్రమమా! నేను ఇప్పుడే నీ కీ విధంగా ఆహారమైతే – ఆ తరువాత నా కుమారుని గతి ఏమవుతుందో నని నేను దుఃఖిస్తున్నాను—"

అంతట నంద పలుకులు విని ఆ పెద్దపులి మళ్ళీ ఈ ప్రకారం చెప్పింది.

"ఏమిటీ? — ఇంకా నీకు కొడుకు పనిఉన్నదా ధేనుకా? ఎట్టఎదుటఉన్న మృత్యువుతో నీకు రాయబారాలు కూడానా? ఓ ధేనుకా! నన్నుచూచిన తక్షణమే సకల భూతములు భయకంపితము లవుతున్నాయి. అసలు చాలవరకు వాటి స్వరూపమే నశించిపోతున్నది. నీవింకా కొడుకుమీాద ఆశపెట్టుకొన్నావా? ధేనుకా! ఇంకా నీవు 'నాకొడుకు, నా

కొడుకు'— అని గోలపెడతావెందుకు? మృత్యుముఖంలో చిక్కినవాణ్ణి– వాడి కొడుకులేకాదు, తపస్సేకాదు, దాన ధర్మాలేకాదు, తల్లేకాదు, తండ్రేకాదు– ఎవ్వరూ కాపాడ లేరు. నీవిప్పుడు నాచేత చచ్చి గోపీజనంతోగూడిన గోలోకా నికి పోయి, నీతోడివారినిచూచినచో ఇక మళ్ళీ ఇక్కడికి రావాలని నీకు బుద్ధిపుడుతుందా? ఓ ధేనుకా! పాంచభౌతిక మైన నా శరీరం సుఖంగా ఉంచేటందుకు– ఇంకా ఒక్కనిమిషంలో నిన్ను చంపి, నీరక్తం కడుపారత్రాగి త్రేన్పుతాను."

అప్పుడు వ్యాఘ్రం చెప్పినది విని, నంద మరల ఇట్లు పలికింది :

"ఓ వ్యాఘ్రరాజమా! నామాట విను. నా స్నేహితు రాండ్రను, పసిబాలుడైన నా కుమారుని, గోపకులను కళ్ళారా ఒక్కతడవ చూచి వృద్ధురాలైన నాతల్లిని ఓదార్చి మళ్ళీతప్పక నీచెంతకు వస్తాను. ఆడినమాట తప్పను. అసత్యం చెప్పను. ఓ మృగరాజా! ఆ ప్రకారం నేను మళ్ళీ నీవద్దిరికి రానట్లయితే– నేను బ్రహ్మహత్యా సదృశమగు పాపాన పోతాను. తల్లిదండ్రులను చంపిన పాపాన పోతాను. మెట్ట నేలపై దుర్బలములైన ఎద్దులనుకట్టి పెద్దబరువు మోయించిన మహాపాపం నాకు చుట్టుకొనునుగాక! తనపై ఎన్నెన్నో ఆశలుపెట్టుకొని తన ఇంటికివచ్చిన స్నేహితుడికి ఆశాభంగం కలిగించిన మహాపాపం నాకు తప్పక తగులుగాక!"

—అని ఈవిధంగా ధర్మాత్మురాలైన నంద అను ఆవు– ఒట్లు–సత్యాలు పెట్టుకొనేటప్పటికి– అప్పుడు వ్యాఘ్రం మళ్ళీ ఇట్లా బదులు పలికింది :

"ఓ ధేనుకా ! నీ విట్లా ప్రమాణాలు చేసినందువలన ఇప్పుడు నాకు నీమీద నమ్మకం కుదిరింది. నా కనుచూపు దాటి, నన్ను తప్పించుకొని పోయినంతనే- 'మూర్ఖుడైన ఈ వ్యాఘ్రాన్ని బాగా మోసంచేసి వచ్చాను'— అని అనుకుం టావా ? లేదుకదా ! కొందరు ఎన్నెన్నో శపథాలుచేసి-ఆడిన మాట తప్పినా తప్పులేదనీ, పాతకంలేదనీ అనుకొంటారు. 'వారిజాక్షులందు, వైవాహికములందు-' అన్న సూక్తి నీకు తెలిసినదేకదా ? ఓ ధేనుకా ! లోకంలో పండితమ్మన్యులగు మూర్ఖులు కొందరున్నారు. వారు నీబుద్ధిని భ్రమింపజేయ వచ్చు. వాళ్ళు స్వయంగా ఏమీ ఎరుగని అజ్ఞానులైనప్పటికీ, అనేకములైన దుష్టవాదాలు బయలుదేరదీస్తారు. ఆ వాదా లను సమర్థిస్తూ శాస్త్రాలనుండి ప్రమాణాలు ఉటంకిస్తారు. వారు ఆవిధంగా లోకాన్ని వంచనచేసే ప్రజ్ఞానాములు. వారు ఉన్నదానిని లేనట్లు, లేనిదానిని ఉన్నట్లు చెప్పడంలో మహా నిపుణులు. ఓ ధేనుకా ! ఈ లోకంలో ఉపకారబుద్ధి కలవా ళ్ళకు గౌరవం ఎంతమాత్రం లేదు. పాలు కుడిచిన మరు క్షణంలోనే శిశువుకూడా తల్లిదగ్గరకు అంత ఉబలాటంగా పోదు. పూర్వకాలంలో కార్యసిద్ధికొఱకు ఋషులు, దేవతలు అసురులు, నరులు పరస్పర శపథాలుచేసుకొన్నారు. ఇప్పుడు నీవుచేసిన శపథంకూడా దేవతల ఎదుట, అగ్నిహోత్రుని ఎదుట, గురువుల ఎదుట చేసిన శపథంలాగా స్థిరమై, సత్యమై వెలుగొందుగాక ! ధర్మాత్ముడు, మహారాజు అయిన వైవ స్వతమనువుకాలంలోలాగా మన శపథం నెరవేరుగాక ! నీ

బుద్ధి నిష్కల్మషమై, భ్రాంతిరహితమై ఉండుగాక ! ఓ ధేనుకా ! ఇక నీవు వెళ్ళిరా !”

అది విని నంద ఈవిధంగా బదులు చెప్పింది :

“ఓ సాధుసత్తమా ! వ్యాఘ్రరాజా ! నేను నిన్ను ఎన్నటికీ మోసంచెయ్యను. ఎవడు ఇతరులను మోసగిస్తున్నాడో, వాడు తనను తానే మోసం చేసుకొన్నవాడు అవుతున్నాడు”—

అప్పు పెద్దపులి ఇట్లా చెప్పింది :

“ఓ గోరత్నమా ! ఓ పుత్రవత్సలా ! ఇక శీఘ్రంగా నీవు వెళ్ళిరా. నీకుమారుని కళ్లారా చూచుకొనిరా. ఆ పసిబిడ్డడికి పాలుకుడిపి, వాడి శిరముమూర్కొని, నీతల్లిని, అక్క-చెల్లెండ్రను, అన్నదమ్ములను, స్నేహితురాండ్రను, సహాస్తమాన బంధుజనులను- అందరినీ ఊరార్చి, మళ్ళీ శీఘ్రంగా ఇక్కడికి రా ”—

అని తెలిపి పులస్త్యుడు మళ్ళీ ఈవిధంగా చెప్పసాగాడు :

ఆ విధంగా నంద అను ఆ ధేనువు అనేక శపథాలు చేసి తన కొడుకును చూడడానికై బయలుదేరింది. కాని పాపమా ధేనువు కనులనిండా నీరు క్రమ్ముకొనగా వగల పొగలుతూ, అంతులేని శోకసముద్రంలో- మొసలి తనకాలు పట్టుకోగా తప్పించుకోలేని ఏనుగువలె-విలవిల తన్నుకొంటూ అంబా అని బిగ్గరగా అరుస్తూ ఇంద్రనదీతీరాన ఉన్న ఆవుల మందకు చేరింది. అక్కడ తనకోసం ఎదురుతెన్నులుచూస్తూ ఆర్తారావంచేస్తూఉన్న తన కొడుకు చెంతకు వెళ్ళింది.

అప్పు డా విధంగా దుఃఖాక్రాంతయై మింటికి మంటికి ఏకధారగా కన్నీరు కారుస్తున్న తల్లినిచూచి ఆవుదూడ ఇట్లా అడిగింది —

"అమ్మా! నీవు చూడబోతే, ఏదో చాలా ఉద్విగ్నవై ఉన్నట్లు కనుపిస్తున్నావు. నీవు చాలా భయంతోను, దిగులుతోను ఉన్నట్లు నాకు తోస్తున్నది. అమ్మా! ఏమిటి కారణం? నాకు చెప్పమ్మా."

కుమారుని మాటలు విని నంద ఈవిధంగా బదులు చెప్పింది :

"నాయనా, కుమారా! నీ తనివితీరేటట్లు పాలు కుడవరా తండ్రీ! నా భయానికీ, నా దిగులుకూ కారణం అడిగావుకదూ? ఆవిషయం నే నిప్పుడు చెప్పేస్థితిలో లేనురా నాయనా. ఇక నీవు నీ తల్లిని చూడవు. ఇవాళ ఒక్కరోజే నీవు నా చన్ను కుడుస్తావు. నాపాలు ఇవాల్టిమటుకే నీకు ప్రాప్తం నాయనా. మరి రేపటినుంచి నీగతి ఏమవుతుందో నాకు తెలియదు. అంతా నాకు అగమ్యగోచరంగా ఉన్నది. అబ్బాయీ, ఆకలితో ఉన్న ఒక పెద్దపులికి నా జీవితం అర్పించుకోవలసి ఉన్నది. తిరిగివస్తానని నేను ఆ వ్యాఘ్రానికి మాట ఇచ్చి వచ్చాను."

అప్పుడు తల్లిమాటలు విని — ఆవుదూడ ఈ ప్రకారంగా బదులు పలికింది :

"అమ్మా! నేనుకూడా నీతోపాటు అక్కడికి వస్తాను. ఆ పులికి ఆహార మవుతాను. అమ్మా! నీతోపాటు చావడం కంటె ఇక నాకు కావలసిన దేమున్నదమ్మా? నీవు లేనిదే

నేనొక్క క్షణంకూడా జీవించలేనమ్మా! నీతోపాటు నేనుకూడా ఆ పెద్దపులికి ఆహారంగా, నా ప్రాణాలను సమర్పించుకొన్నట్లయితే మాతృభక్తులందరికీ ఏలోకం లభిస్తున్నదో నాకూ అదేలోకం లభించగలదు. కనుక నేనుకూడా నీతో అక్కడికి వస్తానమ్మా. నన్ను తీసుకొని వెళ్లు. లేదంటానా, నీవు చేసిన శపథాలు నావిగా భావించుకొని, నేనే వెళ్ళి ఆ వ్యాఘ్రానికి ఆహారమవుతాను. అమ్మా! తల్లిలేని పిల్లకు ఈ జీవితంవల్ల ప్రయోజనం ఏమిటి? తల్లినిమించిన దైవంలేదు. లోకంలో తల్లిని మించిన బంధువును ఎక్కడా చూడం. ఇది ప్రజాపతి విధానమైన పరమధర్మమమ్మా. మాతృ రక్షణ తత్పరులైనవాళ్ళకు ఎల్లప్పుడూ ఉత్తమగతులు కరతలామలకమై ఉంటాయి. తల్లీ.”

కుమారుని మాటలు విని నందిని ఈప్రకారం పలికింది :

“నాయనా! నాకు చావుతప్పదు. ఇది విధి నా నొసట వ్రాసిపెట్టాడు. నీసంటానా? ఇంకా పసివాడవు. ముందు ముందు ఎంతో వృద్ధిలోకి రావలసినవాడవు. తల్లి మాటను అనుసరించి ప్రవర్తించటమే నీకు శ్రేయస్సు నాయనా. కనుక నామాట విని నీ విక్కడనేఉండు. నావెంట రావద్దు. అబ్బాయీ! కుమారా! ఇక నీకు బుద్ధులు చెప్పే వారెవరున్నారు? నాయనా! వనాలలో కాని, నీళ్ళలోకాని తిరిగి ఆపద కొని తెచ్చుకోకు, తండ్రీ! ఏమరిపాటున్నదే- అది లోకంలో ఎంతటి కీడునైనా తెచ్చిపెడుతుంది తండ్రీ. కనుక ఎప్పుడూ ఏమరిపాటుగా ఉండకు. తృణలోభంచే

విషమ భూములకు ఏగకు. అబ్బాయీ! లోభమున్నదే చాలా చెడ్డది నాయనా. లోకమున లోభం ఎంతటి వినాశ నాన్ని అయినా తెచ్చిపెడుతుందని తెలుసుకో. ఇదినిశ్చయం. లోభమోహితులైనవారు సముద్రమనిగాని, అరణ్యమనిగాని- దేనినీ లెక్కపెట్టక అనేక ప్రమాదాలకు గురి అవుతూ ఉంటారు. లోభము, ప్రమాదము, అతి విశ్వాసము - అవే లోకంలో సమస్త భూతకోటికీ ఆపదకు హేతువులు నాయనా. ఎల్లప్పుడూ ఆత్మరక్షణమే కర్తవ్యము. తిర్యగ్యోనులగు మృగాలన్నీకూడా ఒకేచోట ఉంటున్నప్పటికీ, వేర్వేరు జంతువుల తీరు వేర్వేరుగా ఉంటున్నది. ఒక్కొక్కదానికి ఒక్కొక్క విపరీతబుద్ధి స్వభావమై ఉంటున్నది. కుమారా! గోళ్ళు ప్రధానంగా కల జంతువులను, కొమ్ములే ప్రధానంగా కల జంతువులను, శస్త్రాది ఆయుధాలు ధరించేవారలను, స్త్రీలను, దాస్యవృత్తితో జీవించే జనులను ఎప్పుడూ నమ్మ రాదు. నమ్మినవాళ్ళనైనా అతిమాత్రంగా నమ్మరాదు. నమ్మతగని వాళ్ళను అసలే నమ్మరాదు. నాయనా! అట్లా నమ్మినట్లయితే భయం ఉత్పన్నమవుతుంది. ఒక్కొక్క ప్పుడు మూలచ్ఛేదంకూడా జరుగుతుంది. పుత్రకా! స్వదే హామునుకూడ నమ్మరాదు నాయనా! కనుక అన్నీ చూచు కొని, అన్నీ విచారించుకొని, ఎప్పుడూ పరాకులేక ప్రమా దానికి లోనుగాక సంచరించాలిరా., రాజులు చారు లనే కండ్లతో రాజ్య విషయాలన్నీ ఎట్లా కనుగొంటున్నారో— అట్లాగే గోవులు ఎప్పుడూ గంధమును (వాసన) బట్టియే! త్రోవ కనుక్కోగలుగుతున్నాయి. కాబట్టి కుమారా త్రోవ

ఎరిగి సంచరించు. భయంకరమైన అరణ్యాలలో ఎప్పుడైనా సరే, ఒక్కడివి ఉండబోకు నాయనా. ఎల్లప్పుడూ భగవచ్చింత కలిగి ప్రవర్తించు. ఏసమయంలోనైనా సరే—ఉద్వేగాన్ని తెచ్చుకోకు. బిడ్డా! ప్రతి ఒక్కరికీ మరణం తప్పనిసరి కదా! బాటసారి ఒక చెట్టునీడన చేరి ఆనీడ పోగానే మరొక చెట్టును ఆశ్రయిస్తున్నాడు. అట్లాగే జీవుడుకూడా ఒక శరీరంవలన తీరవలసిన కోర్కెలన్నీ తీర్చుకొన్న పిదప వేరొక దేహాన్ని ఆశ్రయిస్తున్నాడు. నాయనా! కుమారా! ఈ జగత్తంతా అశాశ్వతం. అటువంటిదాని విషయమై ఎప్పుడూ విచారించకుండా ఉండు. నా మాటలన్నీ శ్రద్ధగా విన్నావుకదా తండ్రీ—ఆ ప్రకారం నడుచుకో"—

ఈ విధంగా నంద అను ఆ ఆవు తన కుమారునికి బుద్ధులుచెప్పి, పుత్రవాత్సల్యంతో అతని శిరస్సు ఆఘ్రాణించింది. కుమారుడులేని తనకు ఇక ఈ ప్రపంచంలో ఏమి అన్నట్లుగా అంతులేని శోకసముద్రంలో మునిగింది. ఆవిధంగా పదే పదే దుఃఖిస్తూ తన పుత్రుడికి మళ్ళీ, ఈరీతిగా చెప్ప సాగింది:— "నాయనా! కుమారా! లోకంలో పుత్ర ప్రేమను మించినది మరేదీ లేదు. పుత్రుడులేని ఇల్లు శ్మశానంతో సమానం. పుత్రునివలననే జీవుడికి ఉత్తమలోకాలు ప్రాప్తిస్తున్నాయి. లోకంలో ఏ జీవికైనా సరే, కుమారుణ్ణి మనసారా కౌగలించుకొన్నప్పుడు కలిగే సుఖం—చందన గంధాదులు పూసుకొన్నా కలుగదు. అంతటి చల్లనిదీ, ఆనందకరమైనదీ లోకంలో మరేదిలేదు నాయనా!"—నంద ఈ విధంగా తన కొడుకునకు చెప్పి, పదేపదే అతనివంక

చూస్తూ, అంతట వృద్ధురాలైన తన తల్లిని, స్నేహితురాండ్రను, తక్కిన బంధుజనులను, ఇతర గోవులను దీనార్ద్ర దృష్టితో చూచింది. అందరూ వింటుండగా తల్లితో ఇట్లా పలికింది:

"అమ్మా! పులికి ఆహారమవుతానని ప్రమాణం చేసి వచ్చాను. అది వదిలిపెట్టగానే ఏకాఏకి ఇక్కడికే వచ్చాను. నా కొడుకును, తల్లివైన నిన్ను, తక్కిన సఖులను— మిమ్ములనందరినీ చూచిపోదామనే ఇక్కడికి వచ్చానమ్మా. నేను మళ్ళీ శీఘ్రంగా ఆవ్యాఘ్రం చెంతకు వెళ్ళవలసి ఉన్నది. అమ్మా! నేను దుశ్శీలంతో ఏదైనా నీకు అపచారం చేసి ఉన్నట్లయితే నన్ను క్షమించవలసినది— ఇదుగో, నీమనుమడు— వీణ్ణి నీ కుమారునిగా భావించుకో అమ్మా. ఇంతకంటె నీకు నేను చెప్పేదేమున్నదమ్మా!— విపులా, చంపకా, భద్రా, సురభీ, మాలినీ, నందా, మహానందా, వసుధారా, ప్రియా, ఘటస్రవా, రండమ్మా. రండి. ఇదుగో— నా బిడ్డడు. వీడు దిక్కులేనివాడు. దీనస్థితిలో ఉన్నాడు. వీణ్ణి మీ చేతుల్లో పెడుతున్నానే తల్లులారా! ఇక వీణ్ణి మీరే కాపాడాలి. ఓ అమ్మలారా! ఓ అక్కలారా! తెలిసికాని తెలియకకాని నా వల్ల దోషాలేవైనా ఉంటే— నన్ను మన్నించండి. మీరంతా బిడ్డలుగన్న తల్లులు, పుణ్యవతులు. ధర్మతల్లులు. వీడు—నా కొడుకు, పసివాడు. అనాథుడు. వికలుడై ఉన్నాడు. తల్లిలేని దుఃఖంలో వేగిపోతున్నాడు. మీరంతా వీణ్ణి కనిపెట్టి ఉండండమ్మలారా! మీకడుపున పుట్టిన బిడ్డలా చూచుకోండి. వీడికి ఏ కొఱతా రాకుండా

చూడండే తల్లులారా. ఇక నే వెడుతున్నాను. సత్యం కోసం, ధర్మకోసం నన్నుకొడుకును వదలి చావడానికి పోతున్నాను. ఎప్పటికైనా చావు తప్పదుకదా!"

నంద ఈ విధంగా చెప్పగా విని ఆమె తల్లి, స్నేహితురాం[డ్రు, అందరూ అంతులేని దుఃఖంలో మునిగిపోయారు. మహాత్మురాలైన నంద చేస్తున్న పనికి ఎంతో ఆశ్చర్యం చెందారుకూడా. అంతట నంద తల్లి, సఖులు ఇట్లా పలికారు:

"ఆహా, నందా! నీ వెంత సత్యసంధురాలవు! పులికి వస్తానని మాటయిచ్చి ఆ మాట[ప్రకారం తిరిగి దానిసన్నిధికి పోవాలనుకుంటున్నావే—ఇది యెంత ఆశ్చర్యంగా ఉన్నది! కాని, ఓ నందా! నీవు ఆచరించేది అధర్మమేసుమా! ఆడిన మాట తప్పకూడదని ఎవరైనా యింతటి భయంకరమైన కార్యం చేస్తారా? నశంభంచేస్తే చెడావు. మోసగించి ఆత్మ రక్షణ చేసుకోవాలికాని యిట్లాచెయ్యడం తగదసు. కుసుంధా! సత్యం అనే లోభంచేత కన్నకొడుకునే వదిలిపెట్టి పోవాలను కుంటున్నావా? [ప్రాణాపాయం సంభవించినప్పుడు—సత్యానికి భంగం ఒనరించినా పాపం లేదని పూర్వం ధర్మవాదులైన ఋషులు చెప్పారు. ఇందుకు తార్కాణంగా ఎన్నెన్నో గాథ లున్నాయి. ఒక అసత్యం పలికి ఒక [ప్రాణికి [ప్రాణదానం చేసినట్లయితే—ఆ అసత్యం సత్యమే అవుతున్నది. వారిజాక్షుల యందు, వైవాహికములందు, గో-[బాహ్మణుల [ప్రాణరక్షణ యందు—ఆడినమాట తప్పినా పాతకం అంటదని పెద్దలు చెప్పిన సూక్తి నీకు తెలియదా నందా?"

అప్పుడు నంద అందులకు యీ రీతిగా ప్రత్యుత్తరం ఒసగింది :

"అమ్మలారా! అక్కలారా! మీరు చెప్పింది నిజమే. ఇతరులప్రాణాలు రక్షించేటప్పుడు మాత్రమే అసత్యం ఆడవచ్చును. కాని తనప్రాణాలు కాపాడుకోడానికై ఎప్పుడూ అసత్యం పలుకరాదు. ఒక్కడే గర్భవాసక్లేశం అనుభవించి బయటపడిన తరువాతకూడ అతనే సుఖదుఃఖాలను అనుభవిస్తున్నాడు. కనుక ఆ జీవుడికి హితం కలిగేరీతిగా నేను సత్యం పలుకవలెననే అనుకొంటాను. ఓ అమ్మలారా! లోకాలన్నికూడా సత్యంపైననే ఆధారపడి ఉన్నాయి. సత్యానికి బద్ధుడయ్యే సముద్రుడు చెలియలికట్టను అతిక్రమించకుండా ఉన్నాడు. సత్యవాక్యానికి కట్టుబడియేకదా బలిచక్రవర్తి సమస్తలోకాలనూ విష్ణుమూర్తికి దానంయిచ్చి తాను పాతాళంలో పడివున్నాడు! సత్యవాక్యానికి కట్టుబడియేకదా అనేక శిఖరాలతో ఒప్పుతున్న వింధ్యపర్వతం పెరిగిపోకుండా మానుకున్నది! అంతేకాక లోకంలో తన ఆత్మను ఎవడు వంచించుకుంటాడు? ఆత్మను వంచించుకొని నేను నరకయాతనలు అనుభవించలేను. అగాధమైన జలం కలిగి, క్షమ అనే మడుగుతో కూడుకొన్న సత్యతీర్థంలో స్నాన మాచరించి నేను ఉత్తమలోకాలకు పోతాను. వేయి అశ్వమేధయాగములవలన కలిగిన ఫలాన్ని ఒక్క సత్యమువలన కలిగినఫలాన్ని త్రాసులో పెట్టి తూచినట్లయితే సత్యంవలన కలిగినఫలమే అధికంగా ఉంటున్నదని ప్రాజ్ఞులు చెపుతారు. సత్యమనగా-క్లేశాది వివర్జితమగు తపస్సు. సత్యమే సత్పురుషులకు కులధనము. సత్యమే

సాధువులకు భూషణము. ఉత్తమము చెప్పాలంటే సత్యాన్ని తప్పరు. సత్యాన్ని మించిన పుణ్యధర్మం లోకంలో లేనేలేదు. మ్లేచ్ఛ జాతికి చెందినవాడుకూడా సత్యంపలికి స్వర్గలోకం పొందు తున్నాడు——"

అంతట నందమాటలు విని, సఖురాండ్రు యిట్లు పలికారు :——

"ఓ నందా! నీవు పుణ్యశాలవు! సురలు, అసురలు—మానవ స్త్రీలుకూడా నమస్కరించ దగినదానవు! త్యజించ రాని ప్రాణాలను సహితం సత్యంకోసం త్యజిస్తున్నావు! నీవు ధర్మమునెరింగినదానవు. అటువంటి నీకు మేము చెప్పేదేమున్నది కనుక? సత్యమును మించిన ఉత్తమ వస్తువు యీ మూల్లో కాలలోనూ లేదు. నీ కుమారుడికివచ్చిన భయ మేమీలేదు. ఓ నందా! కల్యాణచిత్తయగు స్త్రీకి యెన్నడూ ఆపదలు రానే రావు——"

అంతట నంద అను ఆ ధేనువు ఆ విధంగా గోపీ జనాన్ని, గోకులాన్ని వదిలిపెట్టి పిమ్మట సమస్తవృక్షాలనూ దేవతలనూ ఉద్దేశించి యిట్లు పలికింది——భూమిని, వరుణుని, అగ్నిని, వాయుదేవుని, చంద్రుని, దశదిశలను, దిక్పాలకు లను, వృక్షాలను, నక్షత్రాలను, నవగ్రహాలను—అందరినీ ఉద్దే శించి పదే పదే నమస్కరిస్తూ యీవిధంగా వేడుకొన్నది:

ఓ వనదేవతలారా! వనంలోఉండే సిద్ధులారా! మీ అందరికీ నమస్కరిస్తున్నాను. నాకుమారుడు అడవిలో తిరుగు తున్నప్పుడు మీరందరూ వాణ్ణి రక్షించండి. ఓ చంపక, అశోక, పున్నాగ, సరళ, అర్జున, కింశుకాది సమస్తవృక్షము

లారా! మీకు నమస్కరించి వేడుకొంటున్నాను. బాలుడు, ఏకాకి, సీనుడు అయిన నా కుమారుడు యీ భయంకరమైన అరణ్యాలలో తిరుగుతున్నప్పుడు వాణ్ణి రక్షించేభారం మీదే. నామాట వినా్నరకదూ? తల్లిదండ్రులు లేనివాడై, అనాథుడై, దీనమనస్కుడై, వ్యాకులచిత్తుడై, దుఃఖార్తుడై, మహాశోకంలో మునిగినవాడై, ఆకలి-దప్పులతో అలమటించి తిరిగే నా పుత్రుణ్ణి ఓ వనములారా!—మీరందరూ ఆశ్రయం ఒసగి రక్షించండి. వాడికి ఏ ఆపదా రాకుండా కాపాడండి. నా ప్రార్థన విన్నారకదూ?—"

ఇట్లు పలికి నంద, కొడుకుపై గల ప్రేమవలన అతనిని విడిచిపెట్టలేక మిక్కిలి శోకాగ్నిసంతప్త అయినది. బిడ్డతో ఎడబాటుగలిగిన పక్షిలాగా, చెట్టునుండి వేరుచేయబడి నేల కూలిన తీగెలాగా కళ్ళుపోయిన గ్రుడ్డిదానిలాగా విల విల బోతూ, మాటిమాటికీ వెనక్కు తిరిగిచూస్తూ, అడుగులు తడబడనడుస్తూ తిరిగి వ్యాఘ్రుంచెంతకు పయనమైంది. కాని ఆవిధంగా తన తల్లి అయిన నంద ప్రయాణమైన వెంటనే ధేను కుమారుడుకూడా శీఘ్రంగా బయలుదేరి మహాభయంకరము, మృత్యుసదృశము అయిన పెద్దపులిదగ్గరికి వచ్చాడు. అంతట నంద, వ్యాఘ్రుంచెంతకు వచ్చి యిట్లా అన్నది :—

"ఓ వ్యాఘ్రరాజా! నేను వచ్చాను. నీతో చెప్పిన ప్రకారం మాటతప్పక—సత్యధర్మమున నిలిచి తిరిగీ నీ కడకు యేతెంచాను. ఇక నీ యిష్టప్రకారం నా మాంసం భక్షించి తృప్తిచెందవలసినది. నా రక్తాన్ని కడుపునిండా త్రాగి నీ పాంచభౌతికమైన దేహాన్ని సంతుష్టిపరుచుకోవలసినది. ఆ

విధంగా నేను మరణించిన తరువాత నా కుమారునికిగాహా చంపి తినవలసినది—”

అప్పుడు నందను చూచి వ్యాఘ్రం యిట్లా బసులు పలికింది—

ఓ ధేనుకా! ఓ కల్యాణి! ఓ సత్యవాదినీ! నీకు స్వాగతం! సత్యవ్రతులైనవారికి లోకంలో ఏమాత్రం అశుభమంటూ కలుగదు. ఓ ధేనుకా! నీవు తిరిగీ నా దగ్గరికి వస్తానని చెప్పి ఇదివరకు శపథంచేసి వెళ్ళావు. ఇది సాధ్యమేనా!— అని నాకు సందేహం కలిగింది. ఆ సందేహం నివృత్తిచేసుకొందామనుకున్నాను. నీ సత్యనిష్ఠ ఎటువంటిదో పరీక్షిద్దామని కుతూహలపడ్డాను. అందుకై నాకు నేనే నిన్ను వదలిపెట్టాను. లేకపోతే నాబారినపడి తిరిగీ తప్పించుకోవటం ఎట్లా సాధ్యమవుతుంది? ఓ ధేనుకా! నీవు నీ మాటను నిలుపుకొన్నావు. శపథంచేసినప్రకారం—ఆడినమాట తప్పని వానిలనాకడకు యేతెంచావు. నా పరీక్షకు తట్టుకొన్నావు. సత్యనిష్ఠ గొప్పదని నిరూపించావు. కనుక ఓ గోరత్నమా! నీ సత్యనిష్ఠయే నిన్ను బ్రతికించినది. ఇకనుంచి నీవు నాకు సోదరివి. నీ కుమారుడు నాకు మేనల్లుడవుతున్నాడు. ఓ ధేనుకా. సమస్తలోకాలూ కూడా సత్యంవలననే నిలుస్తున్నాయి! సత్యాన్నిమించిన ధర్మం లోకంలో లేదు. ఓ గోరత్నమా! నీ క్షీరంవలన జీవించే లోకాలు ఎంతో ధన్యమైనవి. సత్యవాదినివైన నీవు సంచరించే భూములు, నీవు మేతమేసే ప్రదేశాలు ఎంతో పవిత్రమైనవి, ఎంతో పుణ్యప్రదమైనవి. నీ పాలను త్రాగినవారు నిజంగా కృతార్థు లవుతున్నారు. వాళ్ళ

జన్మ తరిస్తున్నదిసుమా ! ఓ ధేనుకా ! నీ దర్శనంవలన నా జన్మకూడా ధన్యమైంది. ఇంతకుమున్ను నేను ఎన్నెన్నో జీవ రాసులను బలిగొన్నాను. నేను మహా పాపిని, దురాచారుణ్ణి. నృశంసుణ్ణి. జీవఘాతకుణ్ణి. నేను చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తం లేదు. నేను ఎటువంటి లోకాలకు పోతానో తెలియదు. అటువంటి నాకు ధర్మాత్మురాలివి, సత్యవాదినివి అయిన నీ దర్శనభాగ్యం లభించింది. సత్యనిష్ఠకు ఆధారమైన నీ జీవితాన్ని చూస్తున్నకొలదీ నా హృదయం పశ్చాత్తప్త మవుతున్నది. నే నింక పుణ్యతీర్థాలకు వెళతాను. నేను ఒనర్చిన ఘోరమైన పాపాలకు విమోచనం చేసుకొంటాను. అగ్నితో దహించివేసుకొన్నట్లు నా పాపకర్మ లన్నిటినీ పోగొట్టుకొంటాను. నా పాపాలు పోవడానికి నీవు చెప్పవలసినది యేమైనా ఉంటే చెప్పమని ప్రార్థిస్తున్నాను. ఓ ధేనుకా ! నీవు ఉపదేశం యిచ్చినట్లైతే నాకదే పదివేలు."

అప్పుడు నంద అను పేరుగల ఆ ధేనువు యిట్లా చెప్పింది :

"ఓ వ్యాఘ్రరాజా ! కృతయుగంలో తపస్సు ప్రధానం. త్రేతాయుగంలో జ్ఞానం ప్రధానం. ద్వాపరయుగంలో యజ్ఞయాగాది క్రతువులు ముఖ్యమైనవి. కలియుగంలో ఒక్క దానంమాత్రమే ప్రధానమైనది. కాబట్టి నాకు చూడ అన్నింటిలోకీ దానమే ఉత్తమధర్మమని తోచుచున్నది. చరాచరములగు సమస్త భూతాలకుకూడా ఎవడు భయం తీర్చి – అభయమిస్తున్నాడో అతడే ఉత్తమదాత అని నా అభిప్రాయం. అనగా – అహింసను మించిన శ్రేష్ఠమగు

దానం లేనేలేదు. అన్ని ధర్మాలుకూడా అహింసలో ఇమిడి ఉన్నాయి. యోగమనే మహావృక్షానికి ఈ అహింసయే తాపత్రయ వినాశిని అవుతాయి. ఇందులో సందేహంలేదు. ఓ వ్యాఘ్రమా! నన్ను అడుగుతున్నావే కాని—నీకు సర్వం తెలుసును—"

అప్పుడు వ్యాఘ్రం ఇట్లా చెప్పింది—"ఓ ధేనుకా! నేను పూర్వం ఒక ఆడులేడిచే శపించబడినవాడనై, ఈ వ్యాఘ్ర రూపం పొందాను. ఇప్పటివరకూ ఎన్నెన్నో ప్రాణాలను వధిస్తూ రావడంవలన ఆ విషయమంతా నాకు మరుపునకు వచ్చినది. ఇప్పుడు సాధువైన నీ సంపర్కంవలన, నీ ఉపదేశం వలన, నాకు పూర్వస్మృతి కలిగినది—"

అంతట పూర్వం శాపంవలన వ్యాఘ్రరూపం ధరించిన ఆ ప్రభంజనుడికి, శాపవిముక్తి కలిగింది. అతను వ్యాఘ్ర రూపం విడిచి తిరిగి, బలరూప సమన్వితుడైన రాజరూపం ధరించాడు. అంతలో అక్కడ ధర్మదేవత ప్రత్యక్షమై, ధర్మాత్మురాలు, సత్యవాదిని, కీర్తివంతురాలు అయిన నందకు దర్శనమిచ్చింది.

అప్పుడు ధర్మదేవత నందనుచూచి—

"ఓ నందా! నేను ధర్మదేవతను. నీ సత్యనిష్ఠకు మెచ్చి నీకు వరం ఇవ్వ వచ్చాను. ఓ దేవీ! నందా! ఏం కావాలో కోరుకో" అని అడిగింది.

అంత నంద—

"ఓ ధర్మదేవతా! నీకు నా నమస్కారం. ఈ కథ జరిగిన ఈ ప్రదేశం, నీవు అడుగుపెట్టిన ఈ భూమి ఒక శుభ

ప్రదమైన ధర్మదాయకమైన, మునిసేవితమైన పుణ్యతీర్థం అయ్యేటట్లు నాకు వరం ఇవ్వవలసినది''— అని కోరింది. అప్పుడు ధర్మదేవత - అట్లే అగుగాక! అని వరం ఒసగి అంతర్ధానమైంది.

---

# 13. మరుత్తోపాఖ్యానము

క్రౌష్టుకి మార్కండేయుని చూచి—

''ఓ మునీంద్రా! అవేక్షితుని కుమారుడు, మహాత్ముడు, అయిన మరుత్త చక్రవర్తి చరిత్ర నాకు వినాలని కుతూహలంగా ఉన్నది. చక్రవర్తి మహాభాగుడు, శూరుడు, కాంతిమంతుడు, మహామేధావి, ధర్మమూర్తి, కీర్తిశాలి, ప్రజలను న్యాయంగా పాలించినవాడు అయిన ఆ మరుత్తుని చరిత్ర నాకు వినిపించకోరుతున్నాను''— అని అడిగాడు.

అప్పుడు మార్కండేయుడు ఈ విధంగా చెప్పసాగాడు:

ఓ మహాత్మా! మరుత్తుడు తన తండ్రి ఆజ్ఞ ప్రకారం, తాతగారివలన పట్టాభిషిక్తుడై పృథ్వీతలానికి రాజయినాడు. ఆ విధంగా రాజయి సకల దీవులలోనూ తన చక్రానికి ఎదురు లేకుండా ఏలాడు. తన రథగతికి ఆకాశమున, పాతాళమున, జలములందున - ఎక్కడాకూడా అడ్డుఅనేది లేకుండా సమస్త భూమండలాన్ని జయించి పాలించాడు. అంతులేని ధన సంపదను సాధించి, అనేక యజ్ఞయాగాది క్రతువు లొనర్చాడు.

దేవతలను సంతుష్టుల కావించాడు. బ్రాహ్మణులకు, ఋత్విక్కులకు, పురోహితులకు భూరిదక్షిణలు ఒసగాడు. వారి ఆదేశానుసారం గొప్పగొప్ప దానాలు చేశాడు. ఎల్లప్పుడూ బ్రాహ్మణోత్తములను పూజిస్తూ, సమస్త ప్రజలను కన్నతండ్రి వలె చూస్తూ న్యాయంగా పరిపాలన సాగించాడు. ఆ మహాత్ముని రాజ్యంలో ఇతర వర్ణాలవారుకూడా ఆయనవలన అధిక ధనాన్ని పొంది నిరంతరం ఇష్టపూర్తములు మొదలుగాగల ధర్మాలుచేస్తూ వచ్చారు. మహాత్ముడైన మరుత్త చక్రవర్తి కేవలం రాజ్యపాలనలోనే కాక యజ్ఞాలుచెయ్యడంలో సుక్కలి వినుతికెక్కాడు. ఆయన కావించిన యజ్ఞాలలో వైభవం ఇంత – అంత అని చెప్పనలవికాదు. ఇంద్రాది దేవతలు సయితం నిస్తుపోయేటట్లు యజ్ఞాలొనర్చాడాయన. ఆంగిరసుని పుత్రుడు, బృహస్పతులవారి తోబుట్టువు, తపోనిధి అయిన సంవర్తుడనే మహాత్ముడు ఆయన యజ్ఞాలకు ఋత్విక్కుగా అలరించాడు. మరుత్త చక్రవర్తి–సంవర్తునియాజ్ఞ, సురసేవితమూ అయిన ముంజవమనే దివ్యపర్వతాగ్రాన గల శిఖరాన్ని తన శక్తిచేత పడగొట్టాడు. అక్కడ అపరిమితమైన ధనం లభించగా దానిని గైకొని ఆ ప్రదేశాన్ని యజ్ఞభూమిగా చేశాడు. అక్కడ బంగారుమయమైన స్థలాలలో గొప్పగొప్ప భవనాలు, శాలలు, గృహాలు సమస్తోపకరణాలతో నిర్మించాడు. బంగారపు స్తంభాలు నెలకొల్పాడు. ఆ విధంగా సమస్తమునూ కనకమయంగాచేసి మరుత్త చక్రవర్తి అక్కడ మహాయజ్ఞయాగాది క్రతువు లెన్నో కావించాడు. ఆ యజ్ఞాలకు స్వర్గలోకాధిపతి అయిన దేవేంద్రుడు, దేవతలతోకూడి

వచ్చాడు. గొప్పగొప్ప మునీశ్వరులు, బ్రాహ్మణోత్తములు అరుదెంచారు. మరుత్తచక్రవర్తి సోమమున ఇంద్రాది దేవతలందరినీ తృప్తినొందించాడు. బ్రాహ్మణులకు సమగ్ర దక్షిణాలు ఒసగి సంతుష్టుల కావించాడు. అంతేకాదు, వారికి సువర్ణమయములైన భవనాలు, గృహాలు ఇంకా సమస్త వస్తు సంపదలు దానంగా ఇచ్చాడు. బ్రాహ్మణులకేకాక, ఇతర వర్ణాలవారికికూడా ధనద్రవ్యాదులిచ్చి సంతోషపెట్టాడు. ఆ మరుత్త భూపతి సకలమునూ దానమొసగి, సఫలీకృత మనోరథుడై మళ్ళీ తన రాజ్యానికి ఏతెంచాడు. తిరిగి ఎప్పటివలె ప్రజలను న్యాయంగా పాలిస్తూ వచ్చాడు.

అంతట తపోధనుడైన ఒక మునీశ్వరుడు అక్కడికి అరుదెంచాడు. మరుత్త చక్రవర్తిని చూచి ఇట్లా చెప్పాడు—

"ఓ మహారాజా! నేను మీ పితామహి (నాయనమ్మ) దగ్గరనుంచి వస్తున్నాను. ఆమెగారు నీతో కొన్ని వాక్యములు చెప్పమన్నది—ఆమాటలు చెపుతాను, శ్రద్ధగా ఆలకించవలసినది—" అని పలికి ఆముని, ఆయన పితామహి చెప్పిన వృత్తాంతం ఈ విధంగా చెప్పాడు—'నీ తాతగారు ఈ భూమండలాన్ని ధర్మంతో పరిపాలించి స్వర్గధామం చేరుకొన్నాడు. నేను ఔర్వాశ్రమ ప్రాంతంలో ఇప్పటిదాకా తపస్సు చేసుకొంటూ శాంతిగా ఉంటున్నాను. ఓ మరుత్తుడా! నీ తాత ముత్తాతలు—నీ పూర్వపు రాజులందరూ ఈ భూమిని పాలించి వెళ్ళారు కాని—ఎవరి తరంలోనూ ఈ భూమిమీద ఎక్కడా ఎటువంటికీడూ సంభవించలేదు—

అయ్యో! అటువంటిది—ఇప్పుడు, నీ తరంలో ఎన్నడూ ఎరుగని కీడు వాటిల్లినది! నీవు నిరంతరం భోగాలలో తేలుతూనో, లేక యజ్ఞాది కార్యకలాపాలలోనో ఉండిపోయి, చాతాంధుడవై ఈ భూమిమీద మనుష్యులెవరో - మహర్షులు కాని వారెవరో తెలుసుకోకుండా ఉన్నావు - ఓ మహారాజా! అదేమిటో చెప్పుతాను విను - పాతాళలోకంనుంచి అధిక దర్పంతో, ఘోరమైన సర్పాలు ఈ భూమిమీదికి వచ్చాయి. నిర్మల మూర్తులు, తపస్సంపన్నులు అయిన ఏడుగురు మునీశ్వరులను నిష్కారణంగా కాటేశాయి. ఆ ఏడుగురు మునులు తక్షణమే మృతిచెందారు. ఆ ఘోరమైన సర్పాలు అంతటితో పోక, నిర్మలమైన జలాశయాలను తమ చెమటలతోను, మలమూత్రాదులతోను, విషంతోను దూషితం కావించి, మునుల హవిస్సులన్నీ నాశనంచేసి వెళ్ళాయి. ఆ సర్పాలను తక్షణమే భస్మీపటలం చెయ్యగల శక్తి మునీశ్వరులకున్నది. ఉండికూడా అట్టి దండించడానికి తమకు అధికారం లేదని ఊరకొన్నారు. అందువలన బాధకారివి నీవు! ఓ రాజా! ధర్మయుక్తంగా శిరస్సున కిరీటం ధరించి పట్టాభిషిక్తుడు కాకుండా ఉంటున్నాడో అప్పటి వరకు మాత్రమే రాజు భోగాలు, సుఖాలు అనుభవిస్తూన్నాడు. అటుపైన రాజ్యపాలన అనే మహాభారాన్ని వహించి అనేక దుఃఖాలు పొందవలసినదే కాని, భోగాలు, సుఖాలు అంటూ వుండవు. ఓ నృపాలా! రాజు అయినవాడికి దేహధారణం భోగాలకోసం కాదు. అతను భూభారం వహించి స్వధర్మ పరిపాలన సాగించి, నిరంతరం అనేక

దుఃఖాలు పాలుకావలసిందే, తప్పదు. ఈ విధంగా రాజు ధర్మపరిపాలన పేరిట ఇహలోకంలో కష్టపరంపర లనుభవించి అటుపిమ్మట పరలోకంలో స్వర్గసౌఖ్యాలు పొందుతున్నాడు. కాబట్టి, ఓ మరుత్తచక్రవర్తీ! ఇకనైనా నీవు రాజ్య భోగాలు పరిత్యజించి పృథ్వీపాలన అనే క్లేశాన్ని అంగీకరించ వలసినది. నీవు దురాచారుడవైనందున ఆ దుష్ట సర్పాలవలన బ్రాహ్మణులు మరణించినప్పటికీ ఆ విషయం తెలుసుకో లేకుండా వున్నావు. ఓ రాజా! ఇక నేను వేరే చెప్పవలసిన పనిలేదు. పలు మాట లెందుకు? తక్షణమే దుష్టశిక్షణకు, శిష్ట రక్షణకు పూనుకోవలసినది. తద్వారా కలిగే ధర్మంలో ఆఱవభాగాన్ని పొందవలసినది. ఈ విధంగా శిష్టపరిపాలనకు పూనుకోక ఉపేక్షచేసినట్లయితే దుష్టులుచేసే ఆ పాపాలన్నీ రాజువైన నీకే తగులుతాయి. ఇందులో సందేహం ఎంత మాత్రంలేదు"—

అని ఈ విధంగా ఆముని, మరుత్తచక్రవర్తికి ఆయన పితామహి చెప్పినమాటలు తెలిపి—

"ఓ రాజేంద్రా! మీ నాయనమ్మ నాకు చెప్పిపంపిన విషయం సవిస్తరంగా నీకు నివేదించాను. ఇక నీ మనస్సుకు ఏది హితమని తోస్తుందో దానిని తక్షణం ఆచరించవల సినది"— అని పలికాడు.

## 2

ఈ విధంగా తెలిపి – మార్కండేయుడు క్రౌష్టుకితో ఇట్లు చెప్పసాగాడు:

ఓ మహాత్మా ! ఆవిధంగా ఆ ముని చెప్పిన మాటలు విని మరుత్తచక్రవర్తి చాలా సిగ్గుపడినాడు. తన్ను తాను నిందించుకొన్నాడు. పెద్దపెట్టున నిట్టూర్పులు విడిచాడు. వెంటనే ధనుర్బాణాలు చేతపట్టాడు. దివ్యాస్త్రాలు గ్రహించాడు. బయలుదేరి వెళ్ళి జాహ్నవి ఆశ్రమం చేరుకొన్నాడు. ఆతృతగా వెళ్ళి అక్కడ తన పితామహునికీ, సమస్త మునులకున్నూ మ్రొక్కాడు. పాములచేత చచ్చిపడి ఉన్న మునీంద్రులను చూచి మహాత్ముడైన ఆ మరుత్తచక్రవర్తి, దుఃఖ వ్యాకులం చెందాడు. తన్ను తాను తిట్టుకొన్నాడు – "అయ్యో! నే నెంత అశ్రద్ధ చేశాను! ఇంతటి ఘోర దృశ్యం నేడు నన్ను చూస్తున్నదే" – అని ఎన్నో విధాలుగా పరితపించాడు – అంతట మహాక్రోధం వహించి, గర్జిస్తూ ఇట్లు పలికాడు ——

"దుష్టమైన ఈ సర్పాలన్నింటినీ నా బాణాలతో[6] సంహరిస్తాను. వీటి మదం అణచుతాను" – అని గంభీరంగా పలుకుతూ మహాకోపంతో భగ్గున మండుతూ, సంవర్తకమనే మహాస్త్రాన్ని ధనస్సున సంధించాడు – ఓ దేవతలారా ! యక్ష, కిన్నర, ఖేచరగణములారా! ఓ మానవులారా! ఇక నా ప్రతాపం చూడండి. మహాత్ములైన ఈ మునులను కఱచి చంపిన ఈ సర్పాలన్నింటినీ సంహరిస్తున్నాను. పాతాళ లోకంలో ఉండే పాములన్నింటినీ నామ – రూపాలు లేకుండా భస్మీపటలం కావిస్తున్నాను" – అని ప్రతిజ్ఞలు పలుకుతూ మరుత్తచక్రవర్తి సంవర్తక మహాస్త్రాన్ని సర్వలోకంపై ప్రయోగించాడు.

అప్పుడా దివ్యాస్త్రం భయంకరమైన మంటల నెగజిమ్ముతూ బయలుదేరివెళ్ళి, పాతాళలోకంలో ప్రవేశించింది. సర్పాలన్నింటినీ సమూలంగా దహించడం మొదలుపెట్టింది. అప్పుడు నాగలోకమంతటా హాహాకారావాలు చెలరేగాయి. సర్పకోటి యావత్తూ మహాభయంతో తల్లడిల్లింది. తల్లులు-పిల్లలు, తండ్రులు – కొడుకులు, అంతా ఆర్తనాదాలు చేస్తూ ఆ మహాస్త్రజ్వాలలకు ఆహుతి కాజొచ్చాయి. అంతట ఆ సర్పాలన్నీ దిక్కూ – మొక్కూ కానక, పడగలు, తోకలు కాలిపోగా, వాలిపోగా ఆర్తనాదాలు చేస్తూ, తమ వస్త్రాలు, ఆభరణాలు మున్నగు సమస్త సంపదలు ఎక్కడి వక్కడ విడిచిపెట్టి, పరుగులుతీస్తూ పాతాళలోకంనుంచి బయలువెడలివచ్చాయి. ఆవిధంగా వచ్చి మరుత్తిచక్రవర్తి యొక్క తల్లిని శరణుజొచ్చాయి

పూర్వం ఆమె తమకు వరం ఇచ్చి ఉండడంచేత సర్పాలన్నీ ఆమెచెంతకు వెళ్ళి, నమస్కారాలు చేసి ఆతల్లి నిట్లా శరణువేడుకొన్నాయి —

"తల్లీ ! పూర్వం మాకు నీవు దయతో ఒక వరం ఇచ్చావు. అది ఇప్పుడు జ్ఞాపకం తెచ్చుకోమని వేడుతున్నాం తల్లీ. నీ కుమారుడు వేసిన సంవర్తకాస్త్రంవల్ల నశించిపోకుండా మమ్ములను కాపాడవలసినది. అమ్మా! నీ కుమారుడు అస్త్రం ప్రయోగించి సమస్త నాగలోకాన్ని దహింపనెంచాడు. ఇప్పుడు నీవే మాకు దిక్కు. ఏవిధంగానైనాసరే నీ కుమారుని వారించి, సర్పకోటిని యావత్తూ నాశనంకాకుండా రక్షించవలసినది తల్లీ. నిన్ను శరణువేడుతున్నాం. ఓ మహా

సాధ్వీ ! ఓ యశస్వినీ ! ఈ ఆపదనుంచి మమ్మల్ను కాపాడే వారు నీవు తప్ప మరెవ్వరూ లేరు"—

ఈవిధంగా భయార్తులై, దీనులై, గద్గదకంఠంతో తనను శరణువేడుకొన్న ఆ సర్పరాజుల పలుకులు విని మరుత్తునితల్లి, తాను పూర్వం ఆ నాగరాజులకు ఇచ్చిన వరం జ్ఞప్తికి తెచ్చుకొన్నది. వెంటనే ఆ మహాసాధ్వి తొట్రుపాటు చెంది తన భర్తనుచూచి —

"స్వామీ ! పూర్వం ఈ నాగరాజులు నన్ను పాతాళలోకంలోకి తీసుకొనివెళ్ళి, ప్రార్థించగా వారికి నేను అభయదానంచేశాను. కాబట్టి నేనిచ్చిన అభయదానానికి భంగం రాకుండాను, నా పలుకులు అసత్యం కాకుండాను, వెంటనే మీరు మీ కుమారుని ఎట్లాగైనాసరే వారించి, ఈ నాగ రాజులను కాపాడండి"— అని పలికింది.

అప్పుడా సాధ్వి పలుకులు విని అవేక్షితుడు —

"దేవీ ! ఈ సర్పాలు ఘోరమైన అపరాధం చేశాయి. ఈ నాగరాజులమీద నీ కుమారుడు మహాకోపం వహించి ఉన్నాడు. అతని కోపాన్ని నేను ఎట్లా చల్లార్చేది? ఇది ఏవిధంగా సాధ్యమవుతుంది ? "— అని చెప్పాడు.

అది విని నాగరాజులు తల్లడిల్లి —

" ఓ అవేక్షిత మహారాజా ! తాము మహాత్ములు. ఇట్లా అనకండి. మేము శరణాగతులమై వచ్చాం. మాకు ప్రసన్నుడవు కమ్ము. ఆర్తులను రక్షించడానికేకదా క్షత్రియులు

శస్త్రాలు ధరించింది? కాబట్టి మీరు మీకుమారుని వారించి మమ్మల్ని కాపాడండి''— అని ప్రార్థించారు.

అప్పుడు వారి ప్రార్థనలు విని పూజ్యుడైన అవేక్షిత మహారాజు మనసు కరిగింది. ఆ మహాత్ముడు దయార్ద్ర చిత్తుడై తన భార్యతో —

''దేవీ! నీవు చెప్పినప్రకారం నేను మన కుమారుడైన మహుత్తుని వారిస్తాను. నాగరాజు లందరినీ అవశ్యం రక్షిస్తాను. ఓ కల్యాణీ! ఎవడైనాసరే శరణాగతుడైనవానిని పరిత్యజించకూడదు. అందులోనూ క్షత్రియుడైనవాడు ఆ పని అసలు చెయ్యకూడదు. శరణన్నవారిని రక్షించడం పరమ ధర్మం. కనుక ఓ సాధ్వీ! చెప్తున్నాను విను - మన కుమారుడైన మహుత్తుడు తన అస్త్రాన్ని తక్షణం ఉపసంహరించాడా సరే - లేదా నేను నా దివ్యాస్త్రంతో దానిని నివారించి ఈ నాగలోకా న్నంతటినీ కాపాడతాను'' అని పలికాడు.

ఈవిధంగా మహా యశస్సంపన్నుడు, రాజశ్రేష్ఠుడు, అయిన అవేక్షితుడు ప్రతిజ్ఞ చేసి, నాగరాజు లందరినీ కాపాడ కంకణం కట్టుకొన్నవాడై, దివ్యమగు ధనుర్బాణాలు ధరించాడు. తన భార్యను వెంటతీసుకొని శీఘ్రంగా భార్గవుని ఆశ్రమానికి బయలుదేరి వెళ్ళాడు.

అని తెలిపి మార్కండేయుడు, క్రౌష్టుకితో మళ్ళీ ఈ ప్రకారం చెప్పసాగాడు :

ఓ క్రౌష్టుకిమునీంద్రా! అట్లు అవీక్షితుడు భార్యా సహితుడై భార్గవ ఆశ్రమానికి వెళ్ళి, అక్కడ తన కుమారుడైన మరుత్తుని చూచాడు. అప్పుడు మరుత్తచక్రవర్తి మహోగ్రమైన ధనుస్సును తాల్చి దిక్కులు మండిస్తున్నాడు. అతని కళ్ళు ఎర్రగా — జ్యోతుల్లా వెలుగుతున్నాయి. తీవ్రమైన కోపంతో కనుబొమలు ముడిపడి ఉన్నాయి. ప్రళయతుల్యమైన అనలాస్త్రాన్ని పాతాళానికి ప్రయోగిస్తున్నాడు. ఆ మహాస్త్రం నుండి భయంకరమైన అగ్నిజ్వాలలు బయలుదేరి భూమ్యాకాశాలను నింపుతున్నాయి. ఆ విధంగా ఉగ్రరూపం దాల్చి ఉన్న కుమారుని చూచి అవీక్షితుడు, భార్యాసహితుడై అతని దగ్గరకు వెళ్ళాడు. మెల్లగా ఇట్లా అన్నాడు —

"నాయనా! నీ కోపం, నీ సాహసం చూస్తుంటే లోకాలు తల్లడిల్లుతున్నాయి. ఇంతటి ఉగ్రరూపం నీకు తగదు నాయనా. ఇకనైనా నీ సంవర్తక మహాస్త్రాన్ని ఉపసంహరించు తండ్రీ" — అని పలికాడు.

అప్పుడా పలుకులు విని మరుత్తచక్రవర్తి, ఏమాత్రం అశ్రద్ధచేయక తన తల్లిదండ్రులను చూచాడు. అట్లు చూచి చేతిలో ధనుస్సు ఉంచుకొనే, సగౌరవంగా తల్లిదండ్రులకు మ్రొక్కాడు. తరువాత తండ్రినిచూచి ఈవిధంగా పలికాడు—

"తండ్రీ! ఏమిటి? నన్ను అస్త్రాన్ని ఉపసంహరించమంటున్నారా? నాయనా! ఏమిమాట ఇది! ఈ సర్పాలు నా సామర్థ్యాన్ని, నా పరాక్రమాన్ని తృణీకరించాయి.

పుణ్యాత్ములు, తపస్సంపన్నులు అయిన ఏడుగురు ఋషులను నిష్కారణంగా కఱచి చంపాయి. ఇంతటిదుష్టులు. క్రూరులు ఘోరమైన అపరాధంచేసినవారు అయిన ఈ నాగరాజులను నేను ఎట్లా మన్నిస్తాను, వీల్లేదు. తండ్రీ ? మీరు అడ్డుమాట చెప్పకండి. బ్రహ్మహత్యకు ఒడిగట్టిన ఈ నాగలోకాన్ని నశింపచేస్తాను. ''—

కుమారుడు చెప్పినది విని అవేక్షితుడు మళ్ళీ ఇట్లా పలికాడు —

"నాయనా ! బ్రాహ్మణులను చంపిన పాపానికి ఈ పాములు నరకంలోపడతాయి. అంతేకాని నీకెందుకు వాటిమీద పగ? మన కీవిషయంలో ప్రమేయంలేదు కుమారా. నామాట విని ఇకనైనా అస్త్రం ఉపసంహరించు"—

అప్పుడు మరుత్తుడు తండ్రిమాటలకు ఈరీతిగా బదులు చెప్పాడు—

" తండ్రీ ! సమస్తమూ ఎరిగిన మీరుకూడా ఇట్లా అంటున్నారేమిటి ? ఘోరమైన పాపంచేసిన ఈ సర్పాలను నిగ్రహించనట్లయితే, ఆ పాతకం నాకు తగిలి నేనే నరకానికి పోతున్నాను. అంతేకాని ఈ పాము లెన్నటికీ నరకానికిపోవు. తండ్రీ ! పృథ్వీపతినగు నేను దుష్టులను దండించాలేకాని ఉపేక్షించకూడదు."

అంతట అవేక్షితుడు కుమారుని చూచి తిరిగి ఇట్లు పలికాడు :

"కుమారా! ఈ నాగరాజులు వచ్చి నన్ను శరణు వేడుకొన్నారు. వీళ్ళకు నేను అభయమిచ్చాను. కాబట్టి కోపం మాని, నీ అస్త్రాన్ని ఉపసంహరించు."

తండ్రిమాటలు విని మరుత్తుడు మళ్ళీ వినయంగా ప్రత్యుత్తరం ఒసగాడు—

"తండ్రీ! దుష్టులు, మహాపాపాత్ములు అయిన ఈ సర్పాలను నేను ఎంతమాత్రం క్షమించను. మీరా మాట ప్రమాణం చేసుకొని, నా కర్తవ్యాన్ని నేను నిర్వహిస్తాను. దుష్టులను శిక్షించడం, శిష్టులను రక్షించడం రాజుకు పరమ ధర్మం. అట్లు భావించిన రాజు స్వర్గలోకాలను పొందుతున్నాడు. దానిని తప్పినవాడు నరకం పొందుతున్నాడు."

ఈ రీతిగా జవాబుచెప్పిన కుమారునిమాటలు విని అవేక్షితుడు మిక్కిలి నొచ్చుకొన్నాడు.

"ఓరీ దురాత్మకా! నేను ఎంతచెప్పినా వినక, నన్ను శరణువేడుకొన్న ఈ నాగరాజులను సంహరించ బూనుకొన్నావు. అస్త్రాన్ని ఉపసంహరించకుండా ఉన్నావు. ఇక నిన్ను ఎంతమాత్రం సహించను. అస్త్రవిద్యలు నేర్చిన మొనగాడివు నీ వొక్కడివేనా? ఇటువంటి అస్త్రాలేవీ నాదగ్గర లేవను కున్నావా? చూపిస్తాను చూడు నా ప్రతాపం! నీ దురాగ్రహాన్ని అణచివేస్తాను, చూడు"— అని ఆవేశంగా వీరాగ్రేసరుడైన అవేక్షితుడు కుమారునిపై కోపించినవాడై, కన్నుల నుండి ఎఱ్ఱని నిప్పులురాల ధనస్సును ఎక్కుపెట్టాడు. భయంకరమైన అగ్నివర్షాన్ని కురిపించే కాలాస్త్రాన్ని సంధించాడు.

ఆవిధంగా అవేక్షితుడు జగత్తునంతా సంహారం చేస్తుందా అన్నట్లున్న భయదకాలాస్త్రాన్ని వింట సంధించగా—అప్పుడు ధరణి కంపించింది. లోకాలన్నీ గజగజ వణకాయి. మునులంతా మహా భీతిచెందారు.

అట్లు తండ్రి సంధించిన అస్త్ర ఘోరత్వాన్ని చూచి, మహోత్సాహుడైన మరుత్తుడు యిట్లు పలికాడు :

"తండ్రీ! నేను దుష్టులను సంహరించడానికి యీ సంవర్తకాస్త్రాన్ని ప్రయోగించాను. కాని యెంతమాత్రం ధర్మం తప్పని నామీద మీరు మళ్ళీ ఆ దివ్యాస్త్రాన్ని ప్రయోగించబూనుకున్నారు. తండ్రీ! ఇది మీకు న్యాయంకాదు. నేను న్యాయంగా ప్రజలను పరిపాలిస్తున్నాడను, దోషరహితుడను. ఇక నన్ను మీరు చంపబూనుకోవడానికి కారణమేమిటి?"—

అప్పుడు అవేక్షితుడు తన పుత్రుడైన మరుత్తునకు యీవిధంగా చెప్పాడు—

"ఓరీ! భయంతో శరణాగతులైనవారిని నేను రక్షించబూనుకొన్నాను. నీవు అందుకు అడ్డుతగిలావు. కాబట్టి నిన్ను ఎంతమాత్రం విడిచిపెట్టను. ముందు నన్ను నీవు చంపి, తరువాత నా శరణుచొచ్చిన యీ సర్పాలను నీవు సంహరించడమో, లేక నేను నా దివ్యాస్త్రంతో నిన్ను వధించి, ఈ సర్పకోటిని కాపాడటమో—ఈ రెంటిలో ఏదో ఒకటి ఇప్పుడు జరిగితీరాలి. భయార్తుడై శరణుజొచ్చినవాడు శత్రువైనా సరే దయతలచి అతనిని రక్షించాలి. అట్లా రక్షించనివాని

అప్పుడా తపోధనులైన మునులనుచూచి మరుత్తుడు—
"ఓ మహాత్ములారా! రాజునైన నాకు దుష్టులు, అపరాధులు అయిన ఈ నాగులను శిక్షించడం సద్ధర్మం కాదా? ఇందులో నాదోష మేమున్నది?" అని పలికాడు.

అంతట అవేక్షితుడు ఆ ఋషులతో—

"ఓ పుణ్యాత్ములారా! ఈ సర్పాలన్నీ వచ్చి నన్ను శరణు వేడుకొన్నాయి. వీటిని రక్షించడం నా కర్తవ్యం. ఆర్తులై ఉన్న ఆ సర్పాలను చంప సమకట్టిన నా కుమారుడు అపరాధి కాడా? మీరే సెలవియ్యండి మహాత్ములారా!"— అని చెప్పాడు.

ఆ తండ్రీకొడుకు లిట్లా చెప్పగా విని ఋషులు ధర్మమూర్తులైన ఆ ఇరువురిని చూచి ఈ విధంగా వచించారు—

"నాయనలారా! ఈ నాగరాజులు చెప్పుతున్నమాటలు వినండి. దుష్టసర్పములచే మృతులైన ఆ మునీంద్రుల నేడుగురినీ తిరిగి క్షణమే బ్రతికిస్తామని చెప్పుతున్నారు. ఈ నాగరాజు లందరూ మహాభీతితో తల్లడిల్లి ఉన్నారు. కాబట్టి ఇంక మీరు ఈ స్పర్ధ విడువండి. ప్రసన్నులు కండి. ఓ రాజశ్రేష్ఠులారా! మీ రిరువురూ సత్యప్రతిజ్ఞులు. సద్ధర్మపరులు. క్షత్రియులలో మీవంటివారు లేరు. ఇక ఈ పోరు మానండి—

అప్పుడు అవేక్షితుని తల్లిఅయిన వీర అతనిని సమీపించి—"నాయనా! నీ కుమారుడైన మరుత్తుడు నా ఆజ్ఞ ప్రకారం ఈ సర్పాలను దండించ బూనుకొన్నాడు. చివరకు

కార్యసఫలమైనది. మృతులైన మునీశ్వరులు తిరిగి బ్రతుకుటవలన నీ కుమారుడైన మరుత్తుడు కృతార్థుడైనాడు. నిన్ను శరణుజొచ్చిన నాగరాజులున్ను భయముక్తులైనారు. కావున నీవున్ను ధన్యుడవైనావు" — అని తల్లి అతని దీవించినది.

తరువాత అవేక్షితుని భార్యయైన వైశాలిని భర్తకు నమస్కరించి, సర్పములను రక్షించుటకోసం తాను, తన భర్తను పంపిన వృత్తాంతమంతా ఆయనకు వివరించి—"స్వామీ! నీ అనుగ్రహంవలననే నీ కుమారుడున్ను, నా మాతామహులున్ను కృతార్థులై, సంతుష్టులైనారు" అని పలికింది.

అంతట తండ్రీ కొడుకులైన అవేక్షితుడున్ను, మరుత్తుడున్ను, ఎవరి దివ్యాస్త్రాన్ని వారు ఉపసంహరించారు. తరువాత విషాన్ని హరించే దివ్యౌషధాలు తెచ్చి నాగరాజులు, ఆ మృతిచెందిన మునీశ్వరులను మరల బ్రతికించి, అందరివలన సెలవుగైకొని, నిర్భీతులై తమ లోకానికి తాము వెళ్ళిపోయినారు.

అనంతరం మహాత్ముడైన మరుత్తుడు వచ్చి తండ్రి పాదాలకు మ్రొక్కాడు. అప్పు డవేక్షితుడు, కుమారుని సంతోషంతో దీవించాడు. తరువాత అవేక్షితుడు మహా పతివ్రత, పూజ్యురాలు అయిన తన తల్లికి, తక్కిన మునులకు నమస్కరించి, వారి ఆజ్ఞప్రకారం, భార్యతోను కుమారుడైన మరుత్తునితోను దివ్యరథం ఎక్కి, తమ పట్టణానికి వెళ్ళిపోయినాడు—

ఓ, మునీంద్రా! ఆవిధంగా మహాత్ముడైన మనుత్త చక్రవర్తి, పరమధార్మికుడై కీర్తిసంపన్నుడై ఈ భూమండలాన్ని పరిపాలించాడు—

అని మార్కండేయుడు, క్రోష్టుకికి మనుత్త్రోపాఖ్యానం వినిపించాడు.

---

# 14. చక్షుస్తీర్థవర్ణనం

పూర్వం ఒక పర్వతశిఖరంపై శ్రావన మను పేరుగల ఒక పట్టణం ఉన్నది. ఆ పట్టణాన్ని శ్రావను డనే రాజు స్వధర్మ పరాయణుడై పరిపాలిస్తున్నాడు.

ఆనగరంలో వృద్ధకౌశికు డనే బ్రాహ్మణుడు నివసిస్తు న్నాడు. ఆయన కొక కుమారుడు కలడు. అతని పేరు గౌత ముడు. అతను విద్యాభ్యాసం చేసి వేదవిదుడైనాడు. కాని తల్లి మనోదోషంవల్ల విపరీతబుద్ధి కలవాడై సంచరించ సాగాడు.

గౌతమునకు ఒక వైశ్యస్నేహితు డున్నాడు. అతని పేరు మణికుండలుడు. అతను చాలా భాగ్యవంతుడు. ఆవిధంగా ఆవైశ్యునికీ బ్రాహ్మణునికీ, ఆశ్రీమంతునికీ దరిద్రు నికీ మిక్కిలిస్నేహం కుదిరింది. గౌతమ మణికుండలు లిరు వురూ ఎంతోసహవాసంగా, అన్యోన్యంగా ఉంటూవచ్చారు.

ఇట్లా ఉండగా ఒకనాడు విపరీతబుద్ధిగల గౌతముడు తన వైశ్య స్నేహితుడైన మణికుండలుని రహస్యంగా పిలిచి—

"ఓయీ! మిత్రమా! మనం ధనం ఆర్జించటంకోసం పర్వతాలు, సముద్రాలు దాటి విదేశాలకు వెళదాం. సౌభాగ్యానుకూల్యం లేనట్లయితే యౌవనం వ్యర్థమైపోతున్నది కదా! కనుక మనం దూరదేశాలకు వెళ్ళి కావలసినంత ధనం గడిద్దాం. సుఖపడదాం"— అని చెప్పాడు.

అది విని వైశ్యుడైన మణికుండలుడు— --

"ఓయీ! స్నేహితుడా! నాకు పిత్రార్జితమైన ధనం ఎంతో ఉన్నది. ఇంకా నేను ధనం గడించటం ఎందుకు?"— అని జవాబుచెప్పాడు.

అప్పుడు మళ్ళీ గౌతముడు తన స్నేహితుని చూచి—
"ఓయీ! మణికుండలా! లోకంలో జ్ఞానం విషయంలోను, ధర్మం విషయంలోను, అర్థం విషయంలోను, కామంవిషయం లోను సంతృప్తిపడి ఊరుకోరాదు. సమస్తజీవులకు ఇవే అభివృద్ధి హేతువులు. కనుక ప్రతిఒక్కరూ వీటిని సాధించితీరాలి. అంతేకాదు. సమస్తజీవులున్నూ వాటి వాటి స్వయంకృషి వల్లనే జీవిస్తున్నాయి కదా! ఇంకొకరి మోచేతిగంజి త్రాగుతూ బ్రతికేవాడు హీనుడు. వాడు అనేక కష్టాలపాలవుతున్నాడు. మాటవరుసకైనా సరే, పిత్రార్జితమైన ద్రవ్యాన్ని ఆశించని వానినే తల్లిదండ్రులు ప్రశంసిస్తారు. గౌరవిస్తారు. స్వశక్తివల్ల, తన రెక్కల కష్టంమీద ఎవడు ధనం ఆర్జిస్తున్నాడో, ఎవనికి పిత్రార్జితమైన ఆస్తితో పని

లేదో వాడేలోకంలో గణనకెక్కుతున్నాడు. ఎవడు స్వయంగా ద్రవ్యం ఆర్జించి తన తల్లిదండ్రులకుగాని తక్కినబంధువులకు గాని పెడుతున్నాడో అతడే నిజంగా పుత్రు డని పిలువబడు తున్నాడు. అట్లా చెయ్యనివాడు పుత్రుడుగాడు, వట్టి యోని కీటకము !—" అని చెప్పాడు.

తన స్నేహితుడు, బ్రాహ్మణుడు అయిన గౌతముని బోధనలు విని, వైశ్యుడైన మణికుండలుడు వెంటనే కొన్ని రత్నాలను సంగ్రహించుకొనివచ్చి గౌతమునికి ఇచ్చాడు. అంతట గౌతముడు—ఈధనంతో దేశదేశాలు తిరిగి ఎంతో ద్రవ్యం ఆర్జించి, గొప్పసంపన్నులమై ఇంటికి చేరవచ్చునని— ఆవైశ్యపుత్రునకు ఎన్నెన్నో ఆశలు కల్పించాడు. కాని గౌత ముడు పాపాత్ముడనీ, ద్రోహబుద్ధి కలవాడనీ, తనను మోసం చేస్తాడని మణికుండలుడు ఎంతమాత్రం గ్రహించలేక పోయినాడు.

ఆ విధంగా ఆ స్నేహితు లిద్దరూ తల్లిదండ్రులకు తెలియకుండా దేశాటనానికి బయలుదేరారు. బ్రాహ్మణు డైన గౌతముడు, ఎంతవరకూ ఆ వైశ్యపుత్రుని ధనము అపహ రించ చూస్తూ వచ్చాడు —"ఏదో ఉపాయం పన్ని ఈ మణి కుండలుని ధనం యావత్తూ కాజేస్తాను. ఆ ధనంతో సమస్త సుఖాలు అనుభవిస్తాను. లోకంలో రమ్యమైన పట్టణాలు ఎన్నెన్నో ఉన్నాయి. అవన్నీ తిరిగి చూస్తాను. మనోహర రూప సంపన్నులగు స్త్రీలు ఎందరెందరో ఉన్నారు. వారిని పొంది సుఖిస్తాను. హాయిగా ఆటలతో పాటలతో కాలం

వెళ్ళబుచ్చుతాను. వైశ్యుడైన ఈ మణికుండలుని ఏవిధంగా నైనా దక్కించుకొని సమస్త భోగాలు అనుభవిస్తాను"- అని ఈ విధంగా గౌతముని మనస్సులో ఆలోచనలున్నూ దురాలోచనలు బయలుదేరాయి. మణికుండలుని ఎట్లా మోసగించి అతని ధనం అపహరిద్దామా అని అతడు నిరంతరం దురాలోచనలు చేయసాగాడు.

అంతట ఒకనాడు ఆ గౌతముడు తన స్నేహితుడైన మణికుండలునితో ఈ విధంగా పలికాడు—

"ఓయీ! మిత్రమా! ఈ లోకంలో ధర్మాత్ముడైన మనుష్యుడు సుఖపడుతున్నాడా! పుష్టి, సుఖము, ప్రతిష్ఠ — అన్నీ అధర్మపరునకే లభిస్తున్నాయి! ధర్మాత్ములకు మాత్రం ఈ లోకంలో స్థానంలేదు. ధర్మాత్ముడైన నాకేమో అంతులేని కష్టాల పాలుకావడం మనం కళ్ళారా చూస్తున్నాము - కాబట్టి కష్టాలకు, దుఃఖాలకు హేతువైన ధర్మాన్ని అవలంబించి ప్రయోజనం లేదు"—

అది విని వైశ్యుడైన మణికుండలుడు—

"స్నేహితుడా! నీవు పొరపడుతున్నావు. ఎప్పుడైనా సరే ధర్మమే సుఖహేతువు. అధర్మంవల్లనే దుఃఖం, భయం, శోకం, దారిద్ర్యం, క్లేశం - ఇవన్నీ సంప్రాప్తిస్తున్నాయి. ధర్మంగా ప్రవర్తించడంవల్లనే ముక్తి లభిస్తుంది. స్వధర్మాన్ని తప్పక అనుష్ఠించేవాడికి ఎప్పుడూ నాశనంలేదు. కనుక నీవు చెప్పింది తప్పు"- అని ప్రత్యుత్తరం ఒసగాడు.

ఈ విధంగా ఆ స్నేహితులిరువురిమధ్య వాదోపవాదాలు చెలరేగాయి. అధర్మం మంచిదంటున్నాడు గౌత

ముడు. కాదు, ధర్మమే శ్రేష్ఠమైనదంటున్నాడు మణికుండ లుడు. ఇట్లా వారి వివాదం ఎంతకూ తెగకుండా వచ్చింది. చివరకు వారిద్దరూ పందెములు వేసుకొన్నారు. ఎవడి మాట గెలిస్తే వాడిచే ఆ ధనమంతానని పందెం. ఇంకేం? వారా విధంగా పణములనొడ్డి దారినపోయేవారిని పిలిచి ధర్మా నికి ప్రాబల్యమూ లేక అధర్మానికి ప్రాబల్యమా? – చెప్పమని అడిగారు. అప్పుడు త్రోవనపోయేవారు చాలామంది – ధర్మంగా ప్రవర్తించటంవల్ల మానవులైనోళ్ళ ఇక్కట్ల పాలవు తున్నారనియు, లోకంలో అధర్మపరులే ఎక్కువ సుఖపడు తున్నారనియు నిర్ణయం చెప్పారు. దానితో వైశ్యుడైన మణికుండలుని ధనం యావత్తూ గౌతముడు గెల్చుకొన్నాడు.

ఈ విధంగా అతన్ని పందెంలో ఓడించి, తరువాత గౌతముడు—

"ఓయీ! మణికుండలా! నీవు పందెంలో ఓడిపోయి నావు. ఇప్పటికైనా చెప్పు? ఇప్పుడుకూడా ధర్మమే గొప్ప దంటావా?"– అని అడిగాడు.

అందులకు మణికుండలుడు—

"ఓయీ! బ్రాహ్మణుడా! ఇప్పటికీ నాకు ధర్మమే శ్రేష్ఠమని అనిపిస్తున్నది. పురుషార్థాలు నాలుగింటిలోనూ ధర్మమునకుగల స్థానం గొప్పది. సందేహంలేదు." అని బదులు చెప్పాడు.

మళ్ళీ ఈ తడవకూడా వారిద్దరూ పందెములు ఒడ్డారు. ఓడినవాడికి కరాచ్ఛేదం (చేతులు తెగనరుకుట) అని పందెం వేసుకొన్నారు. తిరిగి త్రోవనపోయేవారిని పిలిచి

అడిగాడు. కాని దురదృష్టవశాత్తూ ఈసారికూడా సత్యవ్రతుడైన మణికుండలుడు ఓడిపోయినాడు. అట్లా ఓడిపోయి ఆ ధర్మాత్ముడు పందెం వేసుకొన్నప్రకారం తన చేతులు నరికించుకొన్నాడు.

అప్పుడు మళ్ళీ పాపాత్ముడైన గౌతముడు——

"ఓయీ! మణికుండలా! ఇప్పటికైనా ధర్మమే దొడ్డదంటావా?"— అని అడిగాడు.

అందుకు మణికుండలుడు ఏమాత్రం చలించక——

"ఓయీ! బ్రాహ్మణోత్తమా! ప్రాణాలు పోతున్నా సరే – నాకు ధర్మమే గొప్పది. తల్లి, తండ్రి, స్నేహితులు, బంధువులు – అందరికన్నాకూడా ధర్మమే శ్రేష్ఠమైనది"– అని జవాబు చెప్పాడు.

దానితో తిరిగి వారి వివాదం పెరిగింది. ఆ విధంగా ఆ బ్రాహ్మణుడు, వైశ్యుడు వాదించుకుంటూ సంచారంచేసి చివరకు యోగీశ్వరుడగు శ్రీమహావిష్ణువు వెలసిన గంగా తీరానికి చేరుకొన్నారు. అక్కడే ఒక మునీశ్వరుడు వారికి తటస్థపడినాడు. అప్పుడు – అక్కడకూడా వణిక్ప్రముఖుడైన మణికుండలుడు, ధర్మాన్ని గురించి ప్రశంసిస్తూవచ్చాడు. అంతట గౌతముడు అతనిని చూచి——

"ఓయీ! నీవు ధనం పోగొట్టుకొన్నావు. చేతులున్నూ పోగొట్టుకొన్నావు. ఈ విధంగా సమస్తాన్నీ కోల్పోయి దీన స్థితిలో ఉండీకూడా ఇంకా ధర్మం గొప్పదని చెప్తావేమిటి? ధర్మాన్ని ఆశ్రయించినవారికి ఏగతి పడుతుందో ప్రత్యక్షంగా

అనుభవిస్తున్నావు. ఇప్పుడుకూడా ధర్మమే శ్రేష్ఠమం టావా ?''- అని అడిగాడు.

అందుకు వైశ్యపుత్రుడైన మణికుండలుడు—

''ఓ, ద్విజోత్తమా! ధర్మంకంటె శ్రేష్ఠమైనదేదీ లేదు. ఇప్పటికీ నేను ఈ మాటే చెపుతున్నాను. ముల్లో కాలలోనూ ధర్మం ఒక్కటే ఉత్తమమైనది. బ్రాహ్మణులకు, గుగావులకు, దేవతలకు, వేదాలకు, జనార్దనుడగు ఆ శ్రీమ హావిష్ణువుకు - అందరికీ ధర్మమే ఆధారం. ధర్మాన్ని దూషిం చినవాడు ఘోరమైన పాతకం పొందుతున్నాడు. అటువంటి పాపాత్మునకు ప్రాయశ్చిత్తంలేదు. ఓయీ! ధర్మమే గొప్ప దని మళ్ళీ నీకు ఈ పావన గంగాతీరంలో .చెపుతున్నాను''- అని బదులు పలికాడు.

అప్పుడు గౌతమునకు కోపం వచ్చింది. అవుతే చూదాం - మళ్ళీ పందెం పెట్టమన్నాడు. మళ్ళీ వారిరువురూ పణములు ఒడ్డారు. ఈతడవ ఓడినవాడు కన్ను లూడబెరి కించుకొనేటట్లు పందెం వేసుకొన్నారు. అందులకు అక్క డున్న మునిని తీర్పరిగా ఏర్పరుచుకొన్నారు. కాని ఈమాటు కూడా దురదృష్టవశాన, ఆముని చెప్పిన తీర్పుప్రకారం వైశ్యు డైన మణికుండలుడు ఓడిపోయినాడు. అట్లా ఓడిపోయి ఆధర్మాత్ముడు ఒప్పందం ప్రకారం కన్నులు ఊడబెరికించు కొన్నాడు. ఆవిధంగా స్నేహితుని మోసగించి, అతను దుస్థి తికి లోనయిన తరువాత గౌతముడు చేచిక్కిన ధనంతో, యథేచ్ఛగా వెళ్ళిపొయ్యాడు. అంతట మునియున్ను, నేత్ర

హీనుడైన మనిషినయ్యాను, గోదావరీతీరాన శ్రీమహా విష్ణువు వెలసిన గౌతమీనదిని సేవించి తరించాను.

అక్కడ ఆ ఆస్తిక్యశ్రేష్ఠుని చూసి నాస్తికుడు ఇలా వానితో ఇట్లా అన్నాడు :–

"ఓయీ! వైశ్యుడా! నీవు ఎల్లప్పుడూ ధర్మాన్ని ప్రశంసిస్తూ చివరకు ఎంతటి విపత్తుకి లోనయ్యావో చూడు! నీకు కళ్ళుపోయినవి, చేతులు పోయినవి, చివరకు సంపదకూడా పోయినవి. నాయనా! ధర్మాన్ని ఆశ్రయించిన నీకు ఎంతటి దుర్గతి సంభవించింది! ఇక నీ గతి ఏమిటి? నీ పరిస్థితి విచారించుకో. నా దారిన నేను పోతున్నాను". –

ఈవిధంగా చెప్పి ఆ దుష్టుడు తన దారిన తాను వెళ్ళిపోయినాడు. అంతట నిర్ధనుడు, చేతులు లేనివాడు, నేత్రహీనుడు అయిన ఆ వైశ్య శ్రేష్ఠుడు కేవలం ధర్మాన్నే స్మరిస్తూ, దిక్కు – మొక్కు లేనట్టి అనేకవిధాల చింతిస్తూ, నిరుత్సాహంతో, శోకసాగరంలో మునిగిపోయి ఎటూ వెళ్ళలేక అక్కడే పడిఉన్నాడు.

అంతట పొద్దు క్రుంకింది. చంద్రోదయం అయింది. ఆనాడు శుక్లపక్ష ఏకాదశి. ఆ పుణ్యదినమున విష్ణుభగవానుని అర్చించడానికై, రాక్షసశ్రేష్ఠుడు, విష్ణుభక్తుడు అయిన విభీషణుడు తనకుమారునితోను, ఇతర రాక్షసులతోను అప్పుడు అక్కడికి అరుదెంచాడు. వారంతా ఆ పావన గంగా – గౌతమీ జలాలలో స్నానాలు ఆచరించి విష్ణుదేవుని భక్తితో పూజించసాగారు. అప్పుడు విభీషణుని కుమారుడైన వైభీషణి, ఆ గౌతమీతీరాన శ్రీహరి సన్నిధిలో ధర్మమునే

స్మరిస్తూ, శోకసాగర నిమగ్నుడై పడిఉన్న వైశ్యపుత్రుని చూచి మిక్కిలి జాలిచెందాడు. ఆవైశ్యుని వృత్తాంతమును, పూర్వమే అతని విలాపమువలన విని వైభీషణి, ఆవిషయం యావత్తూ తనతండ్రి అయిన విభీషణునకు నివేదించాడు. అంతట లంకాధిపతి అయిన విభీషణుడు తన కుమారునితో ఈవిధంగా చెప్పాడు :

నాయనా ! పూర్వం నాకుగురువు, సఖుడు, మాన్యుడు అయిన శ్రీరామచంద్రమూర్తి ఆజ్ఞాప్రకారం మహాభక్తుడు, పూజ్యుడు అయిన హనుమంతుడు లక్ష్మణస్వామిని బ్రతికించడానికై మృతసంజీవినిని తీసుకురావడానికై హిమవత్పర్వతానికి వెళ్లాడు. ఆవిధంగా సంజీవిని తెచ్చి లక్ష్మణుని బ్రతికించిన పిమ్మట మళ్ళీ దానిని యథాస్థానంలో చేర్చడానికై వెళ్ళేటప్పుడు మహాపరాక్రమవంతుడైన ఆహనుమంతుని వేగానికి విశల్యకరణి అను ఓషధి, యోగీశ్వరుడగు శ్రీహరి వెలసిన ఈ పుణ్యక్షేత్రంలో జారిపడినది. దానిప్రభావం వలన మృతిచెందినవారు సయితం మరల జీవిస్తారు"—

విభీషణుడు ఇట్లాచెప్పగా విని వైభీషణుడు – "తండ్రీ ! ఆఓషధి ఎక్కడ ఉన్నదో నాకు చూపించు. దీనస్థితిలో ఉన్న ఈవైశ్య పుత్రునికి సహాయంచేస్తాను. ఒకప్రాణిని రక్షించడం ముల్లోకాలలోనూ పరమధర్మం కదా "— అని అడిగాడు.

ఆవిధంగా పరహిత కార్యమునందు ఆసక్తుడై ఉన్న కుమారుని చూచి మహాభక్తుడైన విభీషణుడు మిక్కిలి సంతసించాడు. అతనికి ఆఓషధిని చూపించాడు. – " నాయనా

ఈఓషధి కొమ్మను తెచ్చి ఇతని హృదయంపై ఉంచినట్లయితే, మళ్ళీ ఇతను పూర్వంవలె సర్వశక్తిసంపన్నుడు కాగలడు''— అని చెప్పాడు.

అప్పుడు పక్షులమేలు కోరే ఆవిహంగముని కుమారుడు విశల్యకరణి అను ఓషధిని తెచ్చి గ్రుడ్డివాడై, అంగహీనుడై పడిఉన్న వైశ్యపుత్రుని హృదయంపై ఉంచాడు. వెంటనే మణికుండలునకు మళ్ళీ కళ్ళువచ్చాయి. చేతులున్నూ మొలిచాయి. అతడు సకలశక్తి సంపన్నుడై మహాతేజస్సుతో ప్రకాశించసాగాడు. మహా మన్త్రౌషధుల ప్రభావం ఎవ్వరికీ తెలియదు!

అంతట ఆ మణికుండలుడు సర్వశక్తులూ కలవాడై లేచి, భగవంతుని మహిమను కొనియాడుతూ ఆ విశల్యకరణి కొమ్మను గైకొని, ఆ గంగా - గౌతమీ జలాలలో స్నానమాచరించాడు. ధర్మాన్ని స్మరిస్తూ భక్తితో అక్కడ వెలసిన శ్రీమహావిష్ణువుకు నమస్కరించి, పూజించాడు. తరువాత బయలుదేరి వెళ్ళి అనేక పట్టణాలు తిరుగుతూ, సంచారం చేయసాగాడు.

ఈ ప్రకారం తిరిగి తిరిగి చివరి కతడు ఒక దేశం చేరుకొన్నాడు. ఆదేశం పరిపాలించే రాజుకు ఒక్కతే కూతురు. ఆమెకు కళ్ళుపోయినవి. అంతట ఆరాజు గ్రుడ్డిదైన తన కుమార్తెకు ఎవడైతే కళ్ళుతెప్పిస్తాడో, వాడు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో ఏవర్ణానికి చెందినవాడుకానీ, దేవతయేకానీ, దానవుడేకానీ, గుణవంతుడేకానీ, గుణహీనుడేకానీ - అతనికి తనరాజ్యంతోసహా కుమార్తెనిచ్చి

పెండ్లిచేస్తానని దేశదేశాలలో చాటింపు చేయించాడు. పుత్రికా దుఃఖంతో మహాబలాఢ్యుడైన ఆరాజు ఆవిధంగా చాటింపు చేయించిన వార్త విని వైశ్యపుత్రుడైన మణికుండ లుడు, తనవద్దనున్న విశల్యకరణి అను ఔషధిని తీసుకొని అక్కడికి వెళ్ళాడు. రాకుమార్తెకు కండ్లు తెప్పిస్తానని చెప్పాడు. అట్లా చెప్పి మణికుండలుడు మహారాజు అనుమతి గైకొని, తనవద్దనున్న విశల్యకరణి అను ఓషధీ పల్లను రాజపుత్రిక నేత్రాలకు తాకించాడు. వెంటనే ఆ రాకుమారికి కండ్లు వచ్చాయి. అప్పుడా మహాద్భుతమును చూచి రాజు, తక్కినవారు మిక్కిలి ఆశ్చర్యపోయారు. అంతట మహారాజు "ఓ, వైశ్యశ్రేష్ఠుడా! నీకీ అద్భుతమైన శక్తి ఎట్లా వచ్చింది?"— అని అడిగాడు.

అప్పుడు మణికుండలుడు —

"మహారాజా! బ్రాహ్మణుల అనుగ్రహం వలన, ధర్మం అనే తపస్సువలన, దివ్యౌషధీ ప్రభావంవలన నాకిటు వంటి సామర్థ్యము లభించినది"— అని బదులుచెప్పాడు.

అది విని రాజు మిక్కిలి విస్మయం చెందాడు–'అయ్యా! మీరెవరో మహానుభావులు కాని సామాన్యులు కారు! బహుశః తాము దైవాంశ సంభూతులై ఉంటారు! లేకపోతే అన్యులకు ఇంతటి సామర్థ్యం వస్తుందా? అయ్యా! నారాజ్య సర్వస్వంతోపాటు నాకుమార్తెను కూడా తాము పరిగ్రహించి నన్ను కృతార్థుణ్ణి చెయ్యండి–' అని పలికాడు.

ఇట్లా సంకల్పించి ఆరాజు తన కుమార్తెను వైశ్య పుత్రునకు ఇచ్చి మహావైభవంగా వివాహం చేశాడు. తన

రాజ్యాన్ని సయితం అతనికి అప్పగించి తాను అరణ్యాలకు వెళ్ళిపోయినాడు.

ఆ విధంగా మణికుండలుడు భాగ్యాన్ని, రాజ్యాన్ని పొంది రాజ్య పరిపాలన చేయసాగాడు. కాని అన్నివిధాలుగా సమస్త సౌఖ్యాలు ఉన్నప్పటికీ అతనికి మనశ్శాంతి లేక నిరంతరం చింతించసాగాడు—

"మిత్రుడు లేని ఈ రాజ్యం ఏటికి? మిత్రుడు లేని ఈ సుఖం నాకు దేనికి!—" అని ఈ విధంగా ధర్మాత్ముడైన మణికుండలుడు, తనకు అపకారం చేసినవాడికి కూడా మేలు చేయ నెంచినవాడై తన బ్రాహ్మణ స్నేహితుడైన గౌతముని గురించి ఎల్లప్పుడూ తలపోస్తూ పరితపించసాగాడు.

ఇట్లా ఉండగా మణికుండలుని స్నేహితుడైన గౌతముడు తన ధనమునంతయూ కోల్పోయి తిరిగి తిరిగి చివరకు ఆ రాజ్యానికి వచ్చాడు. అప్పుడు అతడు చారులవలన రాజు సన్నిధికి గొనిపోబడినాడు. అంతట మహారాజయిన మణికుండలుడు తన స్నేహితుని చూచి ఎంతో సంతోషించాడు. తాను అటువంటి స్థితిలో ఉన్నప్పటికినీ, అతడు తనకు ఘోరమైన అపకారం చేసినవాడైనప్పటికినీ, ధర్మాత్ముడైన మణికుండలుడు అవేవీ తలపోయక — తన పూర్వమిత్రుడైన గౌతముని ఆదరించాడు. సమస్త మర్యాదలూ చేసి గౌరవించాడు. చివరకు ఎన్నెన్నో ధర్మాలు ఉపదేశించాడు. చివరకు అతని చేత గంగా స్నానం కూడా చేయించి, అతని పాపాలన్నీ క్షాళనం కావించాడు.

అంతట గౌతముని తండ్రి అయిన వృద్ధకౌశికుడు కూడా తన కుటుంబంతో సహా అక్కడికే వచ్చి అక్కడనే ఉండిపోయినాడు.

తరువాత వైశ్యశ్రేష్ఠుడు, ధర్మాత్ముడు అయిన మణికుండలుడు ఆ బ్రాహ్మణోత్తముల సహాయంతో గంగా తీరమున, మోక్షప్రదములగు అనేక యజ్ఞయాగాది క్రతువులు చేశాడు.

ఆవిధంగా యోగీశ్వరుడగు శ్రీ మహావిష్ణువు వెలసిన అగులగా – గౌతమీ తీరంలో, విశల్యకరణి అను ఓషధీ ప్రభావంవల్ల మణికుండలు డనే ధర్మాత్మునకు కళ్ళు వచ్చిన కారణాన దానికి చక్షు (కన్ను) తీర్థమని అప్పటి నుంచీ పేరు వచ్చినది.

ఈ చక్షుతీర్థం అత్యంత పుణ్యప్రదమైనది, మన శ్శాంతిని చేకూర్చునది, మోక్షదాయకమైనదీను. ఈ పుణ్య తీర్థాన్ని సేవించినవారు మహా పాతకములనుండి విముక్తులవుతున్నారు.

---

# 15. జడభరతోపాఖ్యానము

ప్రాయోపవిష్టుడై ఉన్న పరీక్షిన్మహారాజుకు శ్రీ శుకయోగీంద్రుడు ఈ విధంగా చెప్పసాగాడు:-

ఋషభదేవుని జ్యేష్ఠకుమారుడు, మహాభాగవతుడు అయిన భరతుడు భగవంతుని ఆదేశానుసారం రాజ్యపాల

నకు పూనుకొన్నాడు. విశ్వరూపుని కుమార్తె అయిన పంచజని అను ఆమెను పరిణయమాడాడు. ఆమెవలన భూతాది అయిన అహంకారం భూత సూక్ష్మపంచకం వలె అన్ని విధాలా తనకు అనురూపులైన అయిదుగురు కుమారుల్ని – సుమతి, రాష్ట్రభృత్తు, సుదర్శనుడు, ఆవరణుడు, ధూమ్రకేతుడు అను వారలను పొందాడు. అజనాభ మను పేరు గల ఈ వర్షం, భరతుడు పరిపాలించిన ఆనాటినుంచీ, భారతవర్షం అని ప్రసిద్ధి కెక్కింది. సమస్త విషయాలూ తెలిసిన భగవత్ చక్రవర్తి నిజ ధర్మాన్ని అనుసరిస్తూ, తన తండ్రి తాతల వలెనే అత్యంత వాత్సల్యంతో ప్రజలను స్వధర్మపరాయణులుగా నొనర్చి రాజ్యపాలన చేయసాగాడు. అంతేగాక నానా విధాలయిన దర్శ, పూర్ణమాస, చాతుర్మాస్య, పశుసోమాత్మకములైన యాగముల, ప్రకృతి వికృతి రూపవిశిష్టమైన యజ్ఞ క్రతువుల, శ్రద్ధాహుతాగ్నిహోత్రుడై ఎల్లప్పుడూ చాతుర్హోత్ర విధానంతో యజ్ఞేశ్వరుడైన భగవంతుని ఆరాధించాడు. ఆ విధంగా నానాయాగములు చేసేటప్పుడు, అందు పొడము కర్మ ఫలమైన ధర్మాఖ్యమగు అపూర్వమును సర్వ యజమానాంతర్యామిత్వం వలన ప్రయోజనకర్తయై, ఆయా దేవతలకు నియామకుడగుట వలన పరదేవతయై, భాసిల్లు భగవంతుడగు వాసుదేవుని యందే భావిస్తూ, తద్భావనా నైపుణ్యమున రాగాది కషాయముల నిరసించినవాడై, ఆయా యాగములందు ఆయా మంత్రముల అధ్వర్యుడు – ఆయా దేవతల గ్రహించునప్పుడు యజమాని అయిన తాను ఆయా దేవతలను పరమేశ్వరుని విరాట్ స్వరూపమున అనుసంధించి

ధ్యానిస్తూ వచ్చాడు. అటువంటి కర్మ విశుద్ధివలన పరిశుద్ధ చిత్తుడైన ఆ భరతుని హృదయాకాశంలో శంఖచక్రగదా ఖడ్గ కౌస్తుభ శ్రీవత్స వనమాలాలంకృతుడై, నిజ పురుష హృదయ లేఖితునివలె, నిత్య నిశ్చల ప్రకాశుడై వెలుగొందు ఆ వాసుదేవునిపై పరమభక్తి ఏర్పడి దినదినాభివృద్ధి చెందుతూ వచ్చింది. ఆ విధంగా భరతుడు పెక్కువేల సంవత్సరాలు రాజ్యమేలి, తండ్రి తాతల నాటినుండి వచ్చిన ఆ రాజ్యాన్ని తన కుమాళ్ళకు యథా విభాగంగా పంచి ఇచ్చాడు. తాను సకల సంపదలకు నిలయమైన నిజమందిరం నుండి బయల్వెడలి, సన్యసించ నెంచినవాడై పులహాశ్రమానికి వెళ్ళిపోయాడు. ఆ ఆశ్రమ మహిమ ఇంత - అంత అని చెప్ప నలవికాదు. భగవంతుడు ఇప్పటికీ అక్కడ భక్తులకు ఇచ్ఛానురూపంగా ప్రత్యక్షమవుతూ ఉంటాడు. మరిన్నీ ఆ పులహాశ్రమమున, ఊర్ధ్వ అధోభాగముల అంతరాది చక్రముల ఒప్పు సాలగ్రామ శిలలతో నిండిన గండకీనది ప్రవహిస్తూ అంతటా పవిత్రం చేస్తున్నది. ఆ ఆశ్రమోపవనం లో భరతుడు ఒంటిగా ఉంటూ వచ్చాడు. నానా విధాలయిన పుష్పాలతోను, చిగుళ్ళతోను, తులసీ దళాలతోను, నిర్మల జలాలతోను, కందమూలాది నైవేద్యాలతోను, భగవంతుని ఆరాధించసాగాడు. ఆ ఒంటరి ప్రదేశంలో విషయ వాంఛలన్నీ వర్జించి, విశుద్ధమగు ఆహారం స్వీకరిస్తూ, ఇంద్రియనిగ్రహాంకలవాడై భగవద్భక్తుడైనాడు. ఆవిధంగా నిరంతరం శ్రీహరి సేవచేస్తూ ఉన్నందున రానురాను భరతునకు భగవంతునిపై అనురాగం వృద్ధి అవుతూ వచ్చింది.

2

ఇట్లా ఉండగా ఒకనాడు భరతుడు గండకీనదిలో స్నాన మాచరించి నిత్యకృత్యాలు తీర్చుకొని ప్రణవం జపిస్తూ మూడునిమిషాలపాటు ఆ మహానదీ తటమున కూర్చున్నాడు. ఆ తరుణంలో నిండుగర్భిణిగా ఉన్న ఒక లేడి దప్పిగొని అక్క-డికివచ్చి నదిలో నీళ్ళు త్రాగుతుండగా, అంతలో ఆ సమీ-పంలోనుంచి భయంకరమైన సింహగర్జన వినిపించింది. అప్పుడు సహజంగా పిఱికి స్వభావంకల ఆ ఆడు లేడి బెదరి బెదిరి అటు-ఇటు చూస్తూ వ్యాకుల చిత్తంతో నీళ్ళు త్రాగ డం మాని భయాతిరేకాన తటాలున ఎగిరి దూకింది. ఆ దూకేటప్పుడు నిండుచూలుగల ఆ లేడి కడుపులోనుండి బిడ్డజారి ఆ నదీ ప్రవాహంలో పడింది. ఆ లేడికూడా గర్భ పాతంవలన, ఉల్లంఘనం వలన, సింహభయం వలన మిక్కిలి అలసటచెంది, తన గుంపును ఎడబాసినందుకు ఖిన్నయై ఆ నదీతీరాన ఒక గిరిసమీపంలోపడి మరణించింది. అంతట, తల్లిచచ్చి - తనవారెవ్వరూలేక, దిక్కు-మాలి నదీప్రవా హంలో కొట్టుకొని పోతున్న ఆలేడిపిల్లను రాజర్షి అయిన భరతుడు చూచాడు. కరుణార్ద్రచిత్తుడై దానిని తన ఆశ్ర మానికి తీసుకొనివచ్చి ప్రేమతో పెంచసాగాడు. పూటపూట దానికి కావలసిన మేత పెడుతూ, క్రూరమృగాలవల్ల దానికే ప్రమాదం రాకుండాచూస్తూ, లాలనతో పెంచుతూ వచ్చాడు. ఆవిధంగా భరతుడు ఆ లేడిపిల్లపై అత్యంత ·అభిమానం పెట్టుకొన్న కారణాన అతని స్నానసంధ్యాద్య నుష్ఠానాలు, నియమాలు, అహింసాది గుణాలు, ఈశ్వర పరి

చర్యాదులు – అన్నీ క్రమక్రమంగా, ఒకదాని వెంట ఒకటి మానివేస్తున్నాడు. అంతట భరతుడు మనసులో ఈవిధంగా తలపోయసాగాడు"—

"అయ్యో! ఈ లేడిపిల్ల కాలచక్ర పరిభ్రమణ వేగాన తనవారి నందరినీ వదలి, దిక్కు-లేక నన్ను శరణు జొచ్చింది. నేనే తనకు తల్లిననీ, తండ్రిననీ, అన్నదమ్ములనీ, బంధువులనీ, జ్ఞాతులనీ, తన గుంపులోని మృగాలనీ భావించి; నన్నుతప్ప మరెవ్వరినీ కానక నన్నే నమ్ముకొని ఉన్నది. కనుక అసూయ వదలి దీనిని పోషించడం అన్నివిధాలా నాకు కర్తవ్యం. లేనిచో శరణాగత పరిత్యాగదోషం నాకు సంభవిస్తుంది. సాధువులు ఉపశాంతులు. దీనవత్సలురైన పెద్దలు నిజంగా ఇటువంటప్పుడు స్వార్థాలను పరిత్యజించి రక్షణకు దీక్ష వహిస్తారు."

ఈవిధంగా నిశ్చయించుకొన్న సమ్రాట్ భరతుడు, ఆ లేడి పిల్లపై మిక్కిలి ఆసక్తి కలవాడైనాడు. కూర్చున్నా, పడుకున్నా, నడుస్తున్నా, స్నానంచేస్తున్నా—దానిని ఎడబాయక ఉంటున్నాడు. మిక్కిలి మక్కువతో, తాను ఫలాల కోసం, సమిధలకోసం కందమూలాలకోసం అడవికి వెళ్ళినప్పుడు క్రూరజంతువులు దాని కేమి కీడుచేస్తాయో అని తలచి తనతో వనాలకు తీసుకొనిపోతూ వచ్చాడు. త్రోవలో అది నడువలేదని దయతలచి అధికప్రేమతో దానిని తన మూపున ఎక్కించుకొని మోయసాగాడు. ఆశ్రమంలో ఉన్నప్పుడు తొడపైన, ఎదురురొమ్ముపైన కూర్చోపెట్టుకొని దానిని లాలిస్తూండేవాడు. దేవతార్చన చేస్తున్నప్పుడుకూడా దాని పైననే మనస్సంతా పెట్టుకొని మధ్య మధ్య లేచివెళ్ళి

చూస్తుండేవాడు. అది కనుపించకపోతే దానికి అన్నివిధాలా మేలుకలుగుతుండాలని దీవిస్తుండేవాడు. ఎప్పుడైనా ఆ లేడిపిల్ల కనుపించకపోతే తనసొమ్మంతా పోగొట్టుకొన్న దీనుని పగిది దాని ఎడబాటు సహించలేక మిక్కిలి చింతాక్రాంతుడై— "అయ్యో! అతిదీనుడగు యీ లేడికుఱ్ఱడు తల్లి చచ్చిపో యిన నిముషంనుంచీ నన్నే నమ్ముకొని ఉన్నాడు. అనార్యు డను, శఠ కిరాతప్రాయుడను, అభాగ్యుడను అగు నా తప్పిదా లన్నీ మన్నించి మరల నన్ను చేరవస్తాడా? ఈ లేడిపిల్ల మళ్ళీ క్షేమంగా యీ ఆశ్రమప్రాంతంలో పచ్చికమేస్తూ ఉండడం నేను కళ్ళారా చూస్తానా? అయ్యయ్యో! తోడేలుకాని, నక్కగాని, అడవిపందిగాని, పులిగాని దానిని భక్షించకుండా ఉన్నదా! అదిగో సకలలోకక్షేమోదయుడైన వేదమూర్తి సూర్యభగవాన్లు క్రుంకుతున్నాడు. నా లేడికుఱ్ఱడు యింత వరకూ యిల్లు చేరలేదు. వివిధ రుచిర శైశవ వినోదక్రీడల సంతోషపెట్టే నా చిన్నారి మృగరాజకుమారుడు నిర్భాగ్యుడ నైన నా చెంతకు చేరి మళ్ళీ నన్ను సుఖపెడతాడా? ఆడు కునేటప్పుడుగాని పరిహాసానికి మిథ్యాసమాధిలో నేను కళ్ళు మూసుకొన్నప్పుడుగాని అది కూర్మితో బెదరిబెదరి దగ్గరికి వచ్చి మృదువైన తన కొమ్ముకొనతో నన్ను అటుయిటు నిమిరేది. ఏదైనా చెయ్యరాని పని చేసినప్పుడు నేను దూషిం చినా, లేక కోపంతో తిట్టినా ఆ లేడికుఱ్ఱడు నా దగ్గరికి రావ డానికి వెఱచి, ఆటలుమాని నిశ్చలమైన ఋషికుమారునివలె ప్రవర్తిస్తూ ఒదిగి ఒదిగి, అణగి ఉండేవాడు. ఆహా! ఈ

చింతలేని వాడైనాడు. అంత అతనికి మహాకరసంభ్రమం వెదకి కొనివచ్చే సర్పంలాగా, అనుల్లంఘనీయమైన తీవ్రవేగముతో మృత్యుసమయం ఆసన్నమైంది. అప్పుడు భరతుడు, తన కుమారునివలె ప్రక్కనే పడుకొని దుఃఖిస్తున్న లేడిపిల్లయందే మనస్సు పెట్టుకొని దేహం త్యజించి ఆకారణాన తిరిగి తాను మృగజన్మ ఎత్తాడు. అయినప్పటికీ ప్రాక్తన తపోబలంవల్ల అతనికి పూర్వజన్మ సంస్మరణం కలిగింది. లేడిపిల్లపై మమకారమే తన మృగజన్మకు కారణమనీ, తాను కావించిన భగవదారాధనం వల్లనే తనకు పూర్వస్మృతి కలిగిందనీ తెలుసుకొన్నాడు. అందులకు ఎంతో పశ్చాత్తపించాడు:-

"అయ్యో! ఆత్మవంతుల మార్గమునుండి నేను భ్రష్టుడనైనాను. సమస్త సంబంధాలు వదలుకొని, వివిక్తమైన పుణ్యారణ్యంలో నివసించి, సర్వభూతాత్మభూతుడైన వాసుదేవుని పై శ్రవణ మనన కీర్తనారాధన స్మరణాత్మకమైన భక్తియోగమున సర్వకాలానికి సార్థకత్వం అలవరించుకొన్న నామనస్సు సంపూర్ణంగా సమాహితమైకూడా, అజ్ఞానం విజృంభించడంవల్ల లేడిపిల్ల విషయంలో శిథిలప్రయత్నమై చెడిపోయింది"—అని లోలోపల పరితపించి, గాఢమైన వైరాగ్యంతో తల్లి లేడిని వదలి, కాలాంజననామకమైన ఆ ప్రదేశం విడిచి, ఉపశాంతులగు మునివర్యులకు ప్రియము, శ్రీహరి క్షేత్రము, సాలగ్రామనామకము అయిన పులహాశ్రమానికి శీఘ్రంగా వెళ్ళిపోయాడు. అక్కడ సంగమునకు అమితంగా భయపడుతూ ఏకాకిగా కాలం తెల్లవారుస్తూ, ఎండుటాకులు, ఎండుగడ్డి పరకలతో దేహయాత్ర నడు

కానికంతకూ కనపడుతూ వచ్చాడు. అతను జడుడైనప్పటికీ తండ్రి ధర్మవిధి ననుసరించి, అతనికి ఉపనయనం చేశాడు. శౌచాచమనాదికర్మనియమాలను బోధించాడు. సమావర్తనాంతములగు సంస్కారాలు యథావిధి కావించాడు. కాని ఎంత చెప్పించినా ఆ పిల్లవాడు వేదోచ్చారణం సక్రమంగా చేయలేకపోతున్నాడు. గ్రీష్మ, వసంతఋతువులతో కూడిన నాలుగు మాసాలపాటు వ్యాహృతిప్రణవములతో త్రిపాదగాయత్రిని చెప్పినప్పటికీ సరిగా గ్రహించలేకపోయినాడు. ఆవిధంగా అతను శౌచాచమన, అధ్యయన, వ్రత, నియమ, గురుసేవాగ్ని పరిచర్యాదులైన ఉపకుర్వాణబ్రహ్మచారి ధర్మములందు సమర్థుడు కాకపోయినప్పటికీ, తండ్రి పుత్రవాత్సల్యంతోను, పుత్రానుశాసనం పితృధర్మమన్న తలంపుతోను, ఎంతో ఓపికతో బోధించాడు. అయినా అతను ఉన్మత్తునివలె, జడునివలె ఉండి వాటిని సక్రమంగా గ్రహించలేకపోయినాడు. తుదకు తండ్రి విఫలమనోరథుడయి కొంతకాలానికి అంత్యదశ సమీపించగా మృతుడయినాడు. అప్పుడా బ్రాహ్మణుని చిన్నభార్య తన కొడుకును, కుమార్తెను సవతికి అప్పగించి తాను భర్తతో సహగమనం చేసి మృతినొందింది. ఆ రీతిగా తండ్రి మరణించిన వెనుక కేవలం కర్మమాత్రనిష్ఠులగు అతని కుమాళ్ళు భరతుని ప్రభావం ఎరుంగక అతనొక జడుడని భావించారు. తండ్రివలె అతనికి యుక్తకర్మాదులు నేర్పడం మానుకొన్నారు. ఆ భరతుడు తన మహిమ తెలియని ప్రాకృతమానవులు తనను పిచ్చివాడనీ, జడుడనీ, చెవిటివాడనీ పిలిచినప్పటికీ, వాటికి తగినట్లుగానే అతను ప్రవర్తిస్తూ

ఇట్లా ఉండగా ఆ దేశంలో శూద్రుడైన ఒక దొంగల నాయకుడు సంతాన ప్రాప్తికోసం భద్రకాళికి నరబలి ఇచ్చి పూజించ పూనుకొన్నాడు. అందుకు తగిన పురుష పశువు కోసం అతని పరిచారకులు అంతటా వెదకసాగారు. కాని వారికెక్కడా అటువంటివాడు లభించలేదు. అంతట ఒకనాటి రాత్రి అన్నల ఆజ్ఞ చొప్పున చేనికి కాపలివెళ్ళి మంచెపై కూర్చొనిఉన్న జడాకారుడైన భరతుని ఆ పరిచారకులు అకస్మాత్తుగా చూచారు. "ఆహా! ఇతడు మనపనికి తగినవాడు. వీనిని పట్టుకొనిపోయి మన ప్రభువుకార్యం నెరవేరుద్దాము"- అని వారు సంతోషించారు. వెంటనే భరతుని త్రాళ్ళతో కట్టి కాళికాలయానికి తీసుకొనిపోయారు. అక్కడ అతనికి విధివిధానంగా జలకమాడించి, వస్త్రాదులు కట్టి, గంధాదులు పూసి అలంకరించి కడుపునిండ భోజనంపెట్టి ధూపదీపాదు లొసంగి, మెడలో పూలదండలు వేసి, ఫలోపహారాలతో బలి పూజావిధానాలు పూర్తి కావించి, మేళతాళాలతో ఆ నరపశువును బలి ఇవ్వడానికై భద్రకాళిచెంతకు తీసుకొని వెళ్ళారు. అప్పుడా దొంగలనాయకుని పురోహితుడు ఆ నర పశువు రక్తంతో భద్రకాళిని తృప్తినొందించ నెంచినవాడై, అందుల కనువైన మంత్రాలు చదివి ఖడ్గం చేత పట్టు కొన్నాడు. అయ్యో! రజస్తమో ప్రవృత్తితో కలుషిత చిత్తులై, ధనమదాంధులై, భగవత్కళా విలాసమున వెలయు బ్రాహ్మణకులాన్ని లెక్కచేయక ఉత్పథమున ప్రవర్తించే నృశంసుల హింసాకాండ ఇటువంటిదా.? ఏంచెప్పాలి? అప్పుడా బ్రహ్మభూతుడైన బ్రహ్మర్షి పుత్రుడు - భరతుడు,

అంతట ఒకనాడు సింధుసౌవీర దేశపతి అయిన రహూగణుడు ఇక్షుమతీ నదీతీరానికి పోతూ అతని పల్లకి మోయడానికై బోయీలను వెదకి తెమ్మని బెస్తలలో కుల పతి అయిన వానికి ఆజ్ఞాపించి పంపించాడు. అప్పుడా బెస్త నాయకుడు భరతుని చూచాడు;-”

“వీడెవడో మంచి వయసులో ఉన్నాడు. బలిష్ఠుడుగా దృఢగాత్రుడుగా కనుపిస్తున్నాడు. ఎద్దులు, గాడిదలు మోసి నట్లుగా పల్లకి మోయగలడు”- అనుకొన్నాడు. వెట్టికి తాను పట్టుకొని వచ్చిన కొందరు బోయీలతోపాటు భరతునికూడా పట్టుకొని తీసుకివెళ్ళాడు. మహానుభావుడైన భరతుడు మారు మాటాడక ఆ రాజు పల్లకి మోయడానికి అంగీకరించాడు. ఆవిధంగా రాజు ఎక్కిన పల్లకి మోస్తూ భరతుడు జంతు హింసచేస్తానేమోనన్న భయంతో బాణం పోయేటంత లెక్క ముందుకు ముందుకు చూస్తూ ఒకవిధంగా నడవసాగాడు. తక్కిన బోయీలకు అతని నడకను అనుసరించి నడవడం సాధ్యం కాక పోయింది. దానివలన పల్లకి హెచ్చుతగ్గులుగా పోసాగింది. అప్పుడు రాజు “ఇదేమి పల్లకీ మోయడం!” అని బోయీలను అదలించాడు. బోయీలు తమను రాజు దండిస్తాడని భయపడినవారై,- “ఓమహారాజా! మేమంతా జాగ్రత్తగానే పల్లకి మోస్తున్నాం కాని వీడెవడో క్రొత్తబోయీ వచ్చాడు. వీడిప్పుడే పల్లకీమోయడం నేర్చుకుంటున్నట్లున్నది. సరిగా మోయడంలేదు. వీడితో సాగిపోవడం మాకు శక్యంకావడం లేదు”- అని విన్న

వింటున్నాను. అదివిని రహూగణుడు – "స్వామీ! సంసర్గ దోషంవల్ల ఒక్కడు చేసిన పాపానికి సకలజనులంతా ఫలం అనుభవించవలసి వస్తుంది–" అని పలుకుతూ, ఆ మాటలను పూజించిన వారిక్కూడా, క్షత్రియ స్వభావ సహజసిద్ధంగా, కొంచెం కోపం వచ్చినాగాని, బూటకపు నవ్వుతో నిష్ఠురంగా నిరూపిత బ్రహ్మతేజస్సంపన్నుడైన భగవానుడితో ఈ విధంగా పలికాడు :

"అరెరె! నీవు నిజంగా ఎంతో అలసిపోయావు గదా, ఎంతో సేపటినుంచి నీవొక్కడవే ఈ పల్లకి మోస్తున్నావు! పాపం; నీకు బలం లేదు. నీ అవయవాలు శుష్కించాయి. పైగా, ముసలివాడవు. నీకెంత కష్టం వచ్చింది! నా తోటి బోయీలు నీవంటివారు కారు!"– అని ఈ తీరుగా వక్రోక్తుల పరిహాసం చేసినప్పటికీ, పంచభూతాత్మకము, జ్ఞానకర్మేంద్రియాలతో కూడుకొన్నదీ, నిరంతరం వికారం చెందుతున్నదీ అయిన తన చరమ కళేబరంపైన 'నేను – నాది' అను అహంకార మమకారాత్మకమైన మిథ్యాభిమానం విడిచిపెట్టిన బ్రహ్మస్వరూపుడు కనుక, మహానుభావుడైన భరతుడు ఆ రాజు మాటలకు బదులు చెప్పక ఎప్పటి యట్లు పల్లకి మోయసాగాడు. పిమ్మట పల్లకి ఇంకనూ హెచ్చుతగ్గులుగా పోతూ ఉండడం చూచి రహూగణుడు ఆగ్రహపూరితుడైనాడు——

"ఓరీ! జీవన్మృతుడవై నీవు నన్ను లక్ష్యపెట్టక రాజాజ్ఞనే ఉల్లంఘిస్తున్నావుగా! అజాగ్రత్తగా ప్రవర్తిస్తున్న నీకు తగిన శిక్ష విధిస్తాను. అప్పుడు గాని నీకు వళ్లు తెలి

యము—" అని పరుషంగా పలికాడు. ఆ విధంగా రజస్త మోగుణాతిరేకంతో, భగవంతుని ఆశ్రయించినవారిని అవమానిస్తూ, తాను రాజునన్న అభిమానంతో పెద్ద విధాలుగా ప్రేలుతున్న ఆ రహూగణునిపై భరతునికి కృప కలిగింది. బ్రహ్మాసముడు, సర్వ జీవులకు స్నేహితుడు, బ్రాహ్మణ శ్రేష్ఠుడు అయిన భరతుడు, యోగీశ్వరునివలె శాంతంగా అల్ప సంస్కారంగల రహూగణుని చూచి నవ్వుతూ విగతస్మయుడై ఈ విధంగా పలికాడు— "రాజా! నీవు నాకు శ్రమాదులు లేవని పలికావు. అది అసత్యంకాదు. భారమనేది ఒకటి ఉన్నా, ఉండి దేహానికి కలిగినా, కలిగి అది నా కన్వయించినా, అప్పుడుగదా, భారశ్రమమును గణించవలసి ఉంటుంది! అట్లే గమనమున్ను, గంతవ్యదేశ మున్ను, గతిక్లేశమున్ను, ఆత్మకు తదన్వయమున గలిగి నప్పుడు దానిని కూడా లెక్కకు తీసుకోవలసి ఉంటుంది. అగంతా కూడా మిథ్యావ్యవహారం కనుక, అందులో ఏదీ చెల్లదు. అంతేకాక నీవు నన్ను బలిసిన వాడని అన్నావు. అది దేహధర్మమో లేక ఆత్మధర్మమో ఆలోచించ వలసి నది. ఆత్మకు బలవత్త్వముగాని, దుర్బలత్త్వముగాని కలుగ నేరవు. అన్యవహారం కేవలం మూర్ఖతా కల్పితము. భూతరాశి అయిన దేహం బలిష్ఠమైనప్పటికీ అది ఆత్మకు అన్వయించదు. కనుక ఆ విషయంలో కూడా నీ వన్నది నాపట్ల చెల్లదు. స్థూలత్వము, కృశత్వము, ఆదివ్యాధులు, ఆకలిదప్పులు, భయము, కలహేచ్ఛ, జర, నిద్ర, మదము, అహంకారము ఆదిగాగలవన్నీ దేహాభిమాన శూన్యుడనైన నాయెడల

కించి తటాలున పల్లకి దిగాడు. భరతుని పాదాలపై పడి సాష్టాంగ నమస్కారం కావించాడు. రాజునన్న దురభిమానం విడిచి, భరతుని అనుగ్రహం పొందదలచి ఈవిధంగా పలికాడు :

"ఓ మహాత్మా! యజ్ఞోపవీతం వలన నీవు బ్రాహ్మణుడవని భావిస్తున్నాను. బ్రాహ్మణులలో నీవెవ్వడవు? నీవు అవధూతయతులలో ఒకడవై ఉంటావని తోచుచున్నది. ఇంద్రుని వజ్రాయుధానికీ, ఈశ్వరుని శూలానికి, యముని దండానికి, సూర్య, చంద్ర, అగ్ని, వాయు, కుబేరుల అస్త్రాలకూ నేను భయపడను. కాని, బ్రాహ్మణ కులావమానానికి మిక్కిలి వెఱపొందుతున్నాను. కనుక నీవెవ్వడవో ఎరిగించవలసినది. అసంగుడవు, అపారమహిముడవు అయిన నీవు నిగూఢవిజ్ఞాన వీర్యుడవై సంచరిస్తున్నావు. సూక్ష్మదర్శనులగు మహాత్ములు సహితం నీవచనాలు భేదించజాలరు. ఇక మావంటివారి విషయం చెప్పడం ఎందుకు? ఈ సంసారంలో ఏది శరణ్యమో అడిగి తెలుసుకుందామని నేను ఆత్మతత్త్వవిద్వాంసుడు, యోగీశ్వరుడు, హరిజ్ఞాన కలావతారుడు అయిన కపిలమహామునిని కొలువబోతున్నాను. లోకనిరీక్షణార్థం అవ్యక్త లింగమున సంచరించు ఆ మహాత్ముడవు నీవేనా? గృహానుబంధంలో చిక్కిన నావంటి గ్రుడ్డివానికి యోగీశ్వరుల గతి ఎరుగతరమా? భారవహనాది శ్రమము నీకు లేదన్నావు. లోకంలో భరించేవాడికి భారశ్రమ, నడచేవాడికి, గమనాయాసం కనుపిస్తున్నాయి. అది నేను స్వానుభవంవల్ల కూడా తెలుసుకొంటున్నాను. కనుక అందరికీ

అలాగే ఉంటుందని ఊహిస్తున్నాను. మరిన్ని నీవు ఈ లోక వ్యవహారమంతా, వ్యవహార సంబంధమైనవి సత్యాలు కావన్నావు. కాని కార్యములు లోకప్రసిద్ధములు. అందువలన తత్సాధన వస్తువులకున్నూ ఆ కార్యములకున్నూ సత్యత్వమే సప్రమాణంగా గోచరిస్తున్నది. మరి ఇది అసత్య మనటం ఎట్లో తెలియజాలకున్నాను. అంతేకాక స్వాప్నిక పదార్థములు నీవు లేవని పలికావు. కాని స్వాప్నికమైనవి గిన్నెలు అగ్ని తాపం కలిగినప్పుడు దానిలోని నీళ్లు, ... తన్మధ్యగల బియ్యము లోపలగా ప్రత్యక్షంగా ఉడుకు తున్నవి గదా! అలాగే ఉపాధి నిమిత్తమైన దేహమైనా, దేహాదిసంగము వలన దేహతాపం, ఇంద్రియతాపం, ఇంద్రియతాపంచే ప్రాణతాపం, దానిచే మనస్తాపం, తత్సన్నికర్షమున సంసారానుభవం — ఏలాగనుకున్నా ఎట్లా ఉంటుంది? మరిన్నీ నేను — నా ప్రభువు అన్న భావం సత్యం కాదనియు, ఉన్మత్తునకు ప్రతీకారం ప్రయోజనశూన్య మనియు పలికావు. రాజు — సేవకుడు అనే భేదాలు నిత్యమైనా, అనిత్యమైనా, రాజు ప్రజలను పాలించవలెను, శాసించవలెను — అనునది తప్పదు కదా? మూర్ఖునికి ప్రతీకారం వ్యర్థమే అయినా, 'ఉత్పథ దండనం కర్తవ్యం' అన్న భగవదాజ్ఞను నెరవేర్చుటయే అతనికి భగవదారాధనము, పాపక్షయ హేతువుఅవును కనుక — అది సఫలమే కాని నిష్ఫలం కాదు. ఓ దీనబాంధవా! రాజాభిమానం అనే మదంతో ఉత్తములను తిరస్కరించిన నన్ను అనుగ్రహించి నాతో సఖ్యం నెరపవలసినది. దానివలన ఉత్తములను అవమానించిన

పాపంనుండి ముక్తుడ నగుతున్నాను. లోకాని కంతటికీ సుహృదుడవై అభిమాన వర్జితుడవైన నీకు నేను అవమానించి నందువల్ల ఏమాత్రం వికారం కలుగకపోయినప్పటికీ, మహేశ్వరునికి సహితం కీడుచేయజాలిన పెద్దల అవమానం నే నొనర్చాను. అందుకు ఏమైపోతానో అని వెక్కిలి భీతిల్లుతున్నాను"—— ఈ విధంగా విన్నవించిన రహూగణునితో మహాత్ముడైన భరతుడు మరల ఈరీతిగా పలికాడు :

# 5

"అయ్యా ! నీవు అవిద్వాంసుడవై కూడా విద్వద్వాద తుల్యంగా మాట్లాడుతున్నావు. కనుక నీవు విద్వద్వరిష్ఠుడవు కావు. కానిమహా తెలిసినట్లు మాట్లాడుతున్నావు. లౌకిక వ్యవహారమేదీకూడా సత్యమని తత్త్వవేత్తలు తలపరు. యజ్ఞయాగాదులుకాని, వేదవాదాలుకాని తత్త్వజ్ఞానాన్ని బోధించవు. తత్త్వజ్ఞులైన పెద్దలెవరూ ఈ ప్రపంచం తథ్యమని చెప్పరు. కాని నీవు చెపుతున్నావు. కనుక నీ వేమాత్రం అధికుడవు కావు. ఎంతో ఉత్తమమైన వేదాంతవాక్యాలు సహితం తత్త్వ జ్ఞానానికి చాలవు. పురుషుని చిత్తం సత్త్వ రజ స్తమో గుణాలకు వశమైనట్లయితే - అది నిరంకుశమై జ్ఞానకర్మేంద్రియాలచేత ధర్మాన్నికానీ, అధర్మాన్నికానీ, చేస్తూఉంటుంది. కనుక రజస్తమో గుణాలకు వశవర్తి అయిన చిత్తంతో, పురుషుడు మాయను అధిగమించలేక సంసార చక్రబంధంలోపడి కొట్టుకుంటూ ఉంటాడు. జ్ఞానంతో

[illegible] భేదించి. విము[illegible], [illegible] శత్రువులు ఆరుగురను జయించినవాడైన [illegible] ఎప్పటివలెనే ఆత్మతత్త్వం తెలియకుండా [illegible] ఎప్పటివలెనే ఈ సంసార చక్రంలో పరిభ్రమింపవలె [illegible]. ఈ [illegible] ఉన్నదే – ఇది ఆత్మనకు ఉపాధి శరీరం. [illegible] క్షేత్రం. శోక మోహములు [illegible], మమకారం [illegible]. [illegible] సుఖం. [illegible] యం ఎరింగిన [illegible] [illegible]. [illegible]! [illegible] ఆత్మ చౌర్యంచేసే నీ మదాభిమానం [illegible] వలన పెరిగి నానాటికి వృద్ధిపొందినది. ఆ అభిమానం అనే శత్రువును, గురువును – శ్రీహరి [illegible] ఆశ్రయించుట అనే అస్త్రంతో తెగటార్చి[illegible]. అప్పుడు నీవు ఆత్మజ్ఞానివై ధన్యుడవవుతున్నావు—”

## 6

ఈ విధంగా భరతుడు చెప్పగావిని రహూగణుడు ఆ బ్రాహ్మణశ్రేష్ఠుని, “ ఓమహాత్మా !” నీవు అవధూతలలో శ్రేష్ఠుడవు. కారణజన్ముడవు. ఆత్మజ్ఞానివి. దేహాభిమానం వర్జించి, నిజనిత్యానుభవ నిగూఢ వర్తనుడవై, బ్రాహ్మణ వేషంలో చరిస్తున్న భగవత్స్వరూపుడవు. నీకు ప్రణామం చేస్తున్నాను. జ్వరార్తుడగు రోగికి ఔషధం, గ్రీష్మతాప తప్తునకు చల్లనినీరు, ఎట్లాంటివో కుత్సితమైన దేహాభిమానం,

అహంకారం అనే పాముకాటు పొందిన నాకు నీ వచనాలు అట్లాంటి అమృతమయమైన ఔషధమైనాయి. కనుక నా మనస్సులోని సంశయాలు తీర్చవలసినదిగా వేడుకొంటున్నాను. ఇప్పుడు మీరు చెప్పిన అధ్యాత్మ యోగగ్రథితము నాకు బాగా అవగతం కాలేదు. దానిని నాకు తేటతెల్లమయ్యేటట్లు విశదీకరిస్తే, విన కుతూహల పడుతున్నాను. ప్రత్యక్ష గోచరములైన సకల వ్యవహారాలూ మిథ్య అని మీరు సెలవిచ్చారు, అది ఎట్లాగో ఎరుంగక నా చిత్తం భ్రమిస్తున్నది. ఆ తత్త్వార్థాన్ని తెలియచెప్పండి"- అని అడిగాడు.

అంతట భరతుడు మరల ఈవిధంగా చెప్పసాగాడు"-

"ఓ పార్థివా! ఈ పార్థివ (మంటితో చేసిన) దేహమున్నదే—ఇది నిమిత్తవిశేషాన చలనాదులను పొందినట్లైతే, జను డని పిలువబడుతున్నది. ఈ జడదేహానికి భారవహనాది శ్రమ కలుగదు. కలుగుతుందంటావా—అది పాదములకా లేక వాటిపైన ఉండే చీలమండ, పిక్క, మోకాలు, తొడ, నడుము, రొమ్ము, మెడ, భుజములకా నిరూపించవలసి ఉంటుంది. అట్లా నిరూపించడం సాధ్యంకాదు కనుక దీనికి శ్రమాదులు లేవు. పోతే భుజమున పల్లకీ మోయబడుతున్నది. ఆ పల్లకిలో సౌవీరపతి అను పేరుతో పిలువబడే నీవనే రాజువు కూర్చున్నావు. నీవు 'నేను సింధురాజు'నన్న దుర్మదాంధత్వం వల్ల అతి కష్టప్రాప్తులు, దీనులు, దయార్హులు అయిన యీ జనులచేత నిర్దాక్షిణ్యంగా వెట్టిచాకిరీ చేయించుకుంటున్నావు.

ధూళి శిరమున తాల్చి సేవించడం ఒక్కటే యీ జ్ఞానపము పార్జనకు మార్గం. పరమభాగవతోత్తములను సేవించినట్లైతే-భగవత్కథావర్ణనసులందు ఆసక్తి అలవడుతుంది. ఆ విధంగా గ్రామ్యకథలు విడిచి, నిత్యం వారి పాదసేవ చేస్తే దానివలన ముముక్షువుకు వాసుదేవునిపై అత్యంత భక్తి ఏర్పడుతున్నది. పూర్వం నేను భరతుడనే రాజును. సమస్త సంబంధాలూ త్రెంచుకొని భగవంతుని ఆరాధించాను. కాని మృగసంగమువలన పరమార్థాన్ని పోగొట్టుకొని మృగమై జన్మించాను. అయినా వాసుదేవార్చన మహిమచేత నాకు పూర్వస్మృతి కలిగింది. అందువలన మృగంగా ఉండికూడా భగవద్భక్తి విడనాడక -కర్మక్షయం అయినవెనుక ఆ మృగ శరీరం విసర్జించి ఇప్పు డీ జన్మ ఎత్తాను. జనసంగమునకు భయపడినవాడనై నిగూఢంగా సంచరిస్తున్నాను. కనుక ఓ రాజా ! నరుడు మహాత్ముల సంబంధంవలన జ్ఞానం పొందుతాడు. ఆ జ్ఞానం అనే కరవాలంతో మోహమనే బంధాన్ని త్రెంచివేస్తాడు. హరికథాశ్రవణ కీర్తనాలవల్ల స్మృతి లాభం పొందుతాడు. సంసారసాగరాన్ని దాటి శ్రీహరి సన్నిధికి చేరుకొంటాడు.''

## 7

"ఓ రాజా ! దాటరానిదగు ఈ సంసారమార్గంలో మాయచేత ప్రవేశపెట్టబడిన జీవుడు, సత్త్వ రజస్తమో గుణములచే విభక్తములైన శుభాశుభకర్మలు చేస్తూ సుఖాన్ని ఆశిస్తుంటాడు. వర్తకుడు ధనార్జనకోసం సంచరిస్తూ అర

ణ్యంలో ప్రవేశించినట్లుగా, సంసారాటవిలో ప్రవేశించి సుఖాన్ని పొందకున్నాడు. ఈ సంసారాటవిలో ఆరుగురు దొంగలున్నారు. వారే జ్ఞానేంద్రియాలు. వారు ధర్మమనే ఈధనాన్ని దొంగిలిస్తారు. నక్కలు, క్రూరజంతువులు మేకను పట్టుకొని హింసించినట్లు హింసిస్తారు. నూరిన్ని తీగల చేత, పొదలచేత ప్రవేసింప నలవికాని ఈ మహారణ్యంలో ఆ జీవుడు భయంకరములగు ఈగలచేత, దోమలచేత బాధింపబడినట్లు పరుగులుతీస్తాడు. ఒకచోట, గంధర్వ నగరంవలె ఆశాశ్వతమగు మనుష్యశరీరం చూచి శాశ్వతమని భావిస్తాడు. మరొకచోట కొరివిదెయ్యాన్ని చూస్తాడు. ఆవిధంగా ఈ సంసారారణ్యంలో సంచరిస్తూ ఒకచోట సుడిగాలికి ధూళిరేగి దిక్కులన్నీ చీకట్లు క్రమ్ముకొనగా, ప్రక్కనున్నట్టి తన త్రోవ తెలియలేడు. మరొకచోట కనులు కనపడకుండా, చెవులు అవిసిపోయేట్లు అరిచే గ్రుడ్లగూబల అరుపులు వింటాడు. విని మిక్కిలి చింతిస్తాడు. ఆ పుణ్యఫల వృక్షాలపై ఎగబ్రాకి ఒకచోట ఎండమావులనుచూచి నీళ్ళని భ్రమిస్తాడు. ఆకలి, దప్పిగొని, నీళ్ళులేని నదులదగ్గరకు పరుగెత్తి నీళ్లు దొరకక, అన్నం లభించక అలమటిస్తాడు. ఆవిధంగా ఈజీవుడు సంసారంలో పడి తిరుగుతూ, వేరొకచోట కార్చిచ్చులో ప్రవేశించి సంతాపం చెందునట్లు, నిష్ఫలములైన పాషండాశ్రమాలను చేరి అన్నపానాదులు లేక వెతచెందుతాడు. యక్షులవంటి రాజు తనధనాన్ని అపహరించగా, ప్రాణ సమానమైన ధనం పోగొట్టుకొని నిర్వేదము నొందుతాడు, ఓ రాజా! ఆవిధంగా రాజభటులు తనద్రవ్యం అపహరించు

కొని పోగా, జీవుడు నిర్విణ్ణచిత్తుడై దుఃఖాతిశయంతో మూర్ఛపోతాడు. మరొకప్పుడు గంధర్వ నగరంవంటి అస్థిరమైన బంధువర్గంలో ప్రవేశించి సుఖవంతుడనైతినని ఒక్క నిముషంసేపు సంతసిస్తాడు. ఇంకొకప్పుడు, బాటసారి పర్వతాలు ఎక్కదలచి, కటికిముళ్లు, కోసరాళ్ళు, కాళ్ళల్లో గుచ్చుకోగా బాధపడి తుదకు వాటిని ఎక్కలేక విచారంతో విమనస్కుడైనట్లు, జీవుడు ఎన్నెన్నో కర్మలకు పూనుకొని అవి విఘ్నమైపోగా లోలోపల దుఃఖంతో తపించిపోతూ, కుటుంబం భారమైతోచగా, భార్యా బిడ్డలపై కోపం చూపుతాడు. మరొకప్పుడు ఈజీవుడు కొండచిలువ వంటి నిద్రకు వశుడై ఏమీ తెలియకుండా, పాములు కఱవగా గుడ్డివాడై తమోపూరితమైన అంధకార కూపంలో పడిఉన్నట్లు పడి ఉంటాడు. ఒకప్పుడు క్షుద్రరసాలకోసం వెదకుతూ తేనెటీగలు కఱచి బాధించగా, మిక్కిలి దుఃఖంలో మునిగేవానివలె, పరదార ధనాదులను అపేక్షించి, తదధిపతులు పీడించగా అవమానంతో క్రుంగి కృశించిపోతూ, అదే సుఖమని భావిస్తాడు. ఒకవేళ పరదార ధనాదులను పొందగలిగినను వారు వచ్చి అతన్ని వంచించి ఆ సుఖమున్నూ లేకుండా అపహరించుకొని పోతారు. అప్పుడు మరల ఈజీవుడు దుఃఖిస్తాడు. మరొకప్పుడు ఈదేహి ఎండకూ, చలికీ, వానకూ, గాలికీ తాళజాలక ఆబాధలు తొలగించుకోడానికి, వస్త్రాలు, గృహాలు సంపాదించ బూనుకొంటాడు. కాని అవి లభ్యంకాక ఆబాధలలోనే క్రుంగుతుంటాడు. వేరొక సమయాన ద్రవ్యాసచే, స్వల్పధనమైనా ఆర్జించనెంచి అనేకులతో

విరోధం పెంచుకొంటాడు. మనోరథప్రాయమైన సంసారాన్నే, ఉండ ఇల్లు లేక, పండే మంచం లేక, పిలుచుకునే దిక్కులేక, ఇతరుల వలన తన కోర్కెలు నెరవేర్చుకోలేక, పరధనంపై ఆశమాత్రం పెంచుకొని అవమానాలు పొందుతాడు. ఈ విధంగా పరస్పర ద్రవ్యసంబంధం వలన శత్రుత్వం పెంచుకొంటూ పరస్పరం వివాహాది సంబంధాలు పెట్టుకొంటూ సంచరిస్తాడు. అధిక శ్రమలు, ధన నాశాలు, పరస్పర ద్వేషాలు, క్లేశాలు, —— ఇవన్నీ తరచుగా, వచ్చినవానితో సమాధవుతాడు. విరోధం వచ్చిన వారిని వదలి క్రొత్త క్రొత్త వారిని చేర్చి కలుపుకొంటాడు. ఇట్లా చేస్తాడే కాని, వారిలో ఒక్కణ్ణి అయినా ఇంతకు మించి సుఖపడిన వాణ్ణి చూడలేడు! దిగ్విజయాలను జయించిన మహా శూరులైనప్పటికీ మమతాభిమానం వల్ల భువిలో వైర బంధం పాటించి సమరంలో పడిపోతారే కాని, విరోధ భావం లేని సన్యాసికి ప్రాప్తమైన ఆ పరమపదాన్ని మాత్రం సాధించ లేరు. ఓ రాజా! ఇంకా చెప్తాను, విను. ఆ నరుడు ఒక చోట ఆసక్తితో తీగలవంటి కామిని భుజములను ఆశ్రయించి తదాశ్రయములైన తియ్యని పలుకులుగల పక్షులవంటి బిడ్డలను ఆశించి, అధిక మోహంతో సంసారమందు సంచరిస్తుంటాడు. జనన మరణాదులకు భయపడుతూ, తత్పరిహారం చేయడానికై, కొంగలు గ్రద్దలను బోలిన పాషండ దైవతములను ఆశ్రయిస్తాడు. చివరకు వాటివలన ఫలం లేదని తెలుసుకొని హంసజాతిని చేరబోయినట్లు బ్రాహ్మణ జాతిని చేరబోతాడు. ఆ విధంగా పవిత్రమైన బ్రాహ్మణ

వంశంలో జన్మిస్తాడు. కాని దుష్కర్మవాసనచేత, ఆ బ్రాహ్మ
ణులకు విహితమైన ఆచారాది కర్మలు అతనికి రుచించవు.
అంతట సదాచార భ్రష్టుడై, కోతులతో సమానమైన శూద్ర
జాతిలో ప్రవేశిస్తాడు. ఆవిధంగా ఆ జాతివారినికూడి, వారి
స్త్రీలను పెండ్లాడి, వారితో విహరిస్తూ, రహస్య సంభాష
ణలు సాగిస్తూ, పరస్పర భావలోకనం ఒనర్చుటవలన
ఇంద్రియ సుఖం అనుభవిస్తూ, మరణకాలాన్నికూడా మరచి
పోయి చెట్లుగుంపులవంటి గృహాలలోపడి క్రీడిస్తూ, అధికమైన
సురతేచ్ఛవలన మిక్కిలి దీనుడై, భార్యా పుత్త్రులందు
వాత్సల్యం చూపుతూ సంసారబంధంలో చిక్కుకొని
దానినీ తప్పించుకోజాలక బాధపడతాడు. మరొక సమయాన
జీవుడు, మృత్యుభయం అనే ప్రమాదం వలన పర్వతగుహాల
వంటి భయంకరములగు రోగముల పాలపడి, దుఃఖమునే ఏను
గులకు భయపడి, తీగెలను పట్టుకొని ప్రాకులాడినట్లు కర్మ
వాసనలను పట్టుకొని ప్రాకులాడు తుంటాడు. చివరకు ఎంతో
కష్టంమీద ఆ దుఃఖాన్ని తప్పించుకొన్నప్పటికీ తిరిగీ,
వెంటనే నర్తకులను చేసుకొన్నట్లు వర్ణాశ్రమాచార నిష్ఠ
లకు జన్మాన్ని చేసుకొంటాడు: అంతేకాని ఈ మార్గంలో
మాయావేషంతో నొరబడినవాడు అందులోనేప రిభ్రమిస్తూ
అంతు కనుగొనలేడు. ఓ, రహూగణా! అందుచేత నీవునూ్నా
భూతకోటిని దండించక, సమస్త భూతములందునూ మిత్ర
త్వం పాటించవలసినది. విషయ సంబంధాలను పరిత్యజించ
వలసినది. భగవదారాధన అనే తీవ్రమగు జ్ఞానఖడ్గంతో,
ఈ సంసారమార్గాన్ని ఛేదించుకొని ముక్తి కాంచవలసినది"-

ఈవిధంగా భరతుడు జ్ఞానబోధ చేయగా విని, రహూగణుడు——

"ఓ మహాత్మా! జన్మలలోకెల్ల మానవజన్మ శ్రేష్ఠమైనది. స్వర్గలోకజన్మలు కూడా దీనికి సరిరావు. ఈ మానవజన్మలో, మహాత్ములైన భాగవతోత్తములతో స్నేహం అలవడినంతగా తక్కిన దేవాదిజన్మలలో అలవడదు. కానీ ఆ జన్మలవలన ప్రయోజనం ఏమున్నది? ఎల్లప్పుడూ మీ పాదధూళి సేవించేవారికి హరిభక్తి అలవడటం ఏ సమయంలో చిత్రమేమీలేదు. మీతో ఒక్క ముహూర్తంపాటైన సంబంధం లభించిందో లేదో—అంతలోనే దుస్తర్కమూలమైన నా అవివేకం యావత్తూ అంతరించింది. అవధూతలాంఛనులైన బ్రాహ్మణోత్తములు ఏరూపాన సంచరిస్తారో నేను ఎరుగను. కావున పెద్దలకు, పిన్నలకు నా నమస్కారం! ప్రాయంలో ఉన్నవారికీ, బ్రహ్మచారులకు నా ప్రణామం! బాలురవంటి వారివలన మావంటిరాజులకు శుభమగుగాక!"——అని భరతునకు విన్నవించుకొన్నాడు——

శుకయోగీంద్రుడు, పరీక్షిన్మహారాజుకు ఈవిధంగా జడభరతోపాఖ్యానం వినిపించి మరల యీరీతి చెప్పసాగాడు:

"ఓ, పరీక్షిన్నరేంద్రా! ఆవిధంగా బ్రహ్మర్షి పుత్రుడైన భరతుడు తన ప్రభావం ఇతరులకు ఎరుకపడనీయక, తన్ను ఎరుగని రహూగణునిపై కారుణ్యం వహించి ఆత్మతత్త్వం ఉపదేశించాడు. అతని ప్రణామం గైకొని పరిపూర్ణమైన సముద్రంలా, శాంత కరుణాకల్లోల పరిపూర్ణుడై ఈ భూమిమీద సంచరించాడు. ఆ సాధుపుంగవునివలన రహూ

గణుడు తత్త్వజ్ఞానంపొంది, అవిద్యారోపితమైన దేహాత్మాభిమానాన్ని విసర్జించి కృతార్థుడైనాడు. భాగవతులను ఆశ్రయించినవారి మహిమ ఇటువంటిది!''—

ఇట్లు చెప్పగా విని అంతట పరీక్షిన్మహారాజు —''ఓ, మునీంద్రా! నీవు సర్వజ్ఞుడవు. జీవుల సంసారమార్గ ప్రకారం నీవిప్పుడు పరోక్షంగా బోధించావు. అందువలన అది మహావిద్వాంసులకే విదితమవునుగాని, అవ్యుత్పన్నమతులకు సులభంగా అవగతం కాకున్నది. కనుక ఓ మహాత్మా! అది యీనసారి చక్కగా బోధపడేట్లు దయచేసి వివరించవలసినది''— అని వేడుకొన్నాడు.

## 8

అంతట శుకయోగి మరల ఈ ప్రకారం చెప్పసాగాడు:

''ఓ, పరీక్షిన్నరేంద్రా! సత్త్వాదిగుణ విశేషంవల్ల, పుణ్యాపాపములతో కూడుకొన్న కర్మలు – సాత్త్వికములనీ, రాజసములనీ, తామసములనీ, మూడువిధాలుగా ఉంటున్నాయి. వాటిలో సాత్త్విక కర్మలు సుఖాన్ని, రాజసకర్మలు దుఃఖాన్ని, తామసకర్మలు ప్రమాదాన్ని, ఆలస్యాన్ని చేకూరుస్తాయి. ఈ కర్మల మూలంగానే దేహ ఆత్మాభిమానులకు — నానావిధాలయిన దేహ పరంపరలు సంభవిస్తున్నాయి. ఆ దేహపరంపరకు సంయోగం, వియోగం, బాల్య యౌవనాద్యవస్థలు కలుగుతున్నాయి. ఇదే సంసారం. ఇది అనాదిగా వస్తున్నది. ఈ సంసారం అనుభవించడానికి ద్వారభూత

మాన్య పొలంలో గడ్డిక, నట్టు, తీగెలు, పొదలు పెరిగి బలిసినట్లుగా, గృహస్థాశ్రమ మనే ఈ కర్మక్షేత్రమందు కర్మ బీజాలు ఏనాటికీ నశించక గహ్వరమవుతున్నది. ఇల్లు, మానుషులకు పెట్టె లాంటిది. కర్పూరపు పెట్టెలో కర్పూరం పోయినప్పటికీ ఆవాసనమాత్రం పోదు. అలాగే కర్మక్షేత్ర మైన ఈ గృహాశ్రమంలో దేహి సదా సంచరిస్తుంటాడు. పొలంలోని ధాన్యాన్ని మిడతలు, పిట్టలు, ఎలుకలు, దొంగలు, అపహరించినట్లు గృహక్షేత్రంలో సంచరించే వాడి ప్రాణతుల్యమగు ధనాన్ని నీచులు పీడించి అపహరించుకొని పోతారు. అందులకు దేహి దుఃఖిస్తూ, ఆ ధనంకోసం అందులోనే పడి తిరుగుతుంటాడు. అహంకార మమకారాల చేత, విషయాభిలాషచేత, పుణ్య పాపరూపమగు కర్మ వాసనలచేత కలుషితమైన మనస్సుతో గంధర్వనగరంవంటి అనిత్యములు, అసత్యములు అయిన స్వశరీరాన్ని, భార్యాబిడ్డల శరీరాలను నిత్యములనీ, సత్యములనీ తలంచుతూ, తినడం, త్రాగడం, సంభోగించడం – మొదలైన వ్యసనాలలో తగులొన్నాని అధిక ఆసక్తితో సంచరిస్తుంటాడు. ఎండమావులను చూచి నీళ్ళని ఆశపడినట్లు, విషయాసక్తుడవుతాడు. ఒకప్పుడు చలిబాధకు ఓర్వలేనివాడు నిప్పుకోసం వెదకుతూ కొరవిదయ్యాన్నిచూచి అగ్నిఅని భ్రమించి పరుగిడినట్లుగా, సకల దోషాలకు ఉనికిపట్టు అయిన బంగారం ఆశించి నలు దిశలకూ పరుగులుతీస్తాడు. ఒకప్పుడు గృహములను, పాత్రలను, ద్రవ్యాలను, తనను అనుసరించి బ్రతికేవారి యందును మిక్కిలి అభినివేశం కలవాడై ఈ సంసారాటవిలో అటు –

ఇట్లు గ్రుమ్మరుతుంటాడు. వేరొకచోట సుడిగాలివంటి స్త్రీ యొక్క తోడపై కూర్చొని రజోగుణం అతిశయించగా రాత్రివేళ భూతమువలె కన్నుకానక మతిచెడినవాడై, ధర్మ మర్యాదలను అతిక్రమించినందుకు సాక్షిభూతులైన దేవతలను సయితం కనుగొనలేక ఉంటాడు. ఒకచోట ఈ దేహ శబ్దాది విషయాలు పురుషార్థ తుల్యాలని ఎరింగియు, దేహాభినివేశం వలన స్మృతితప్పి, మృగతృష్ణా జలాలకు సాటి వచ్చు ఆ విషయాలకోసమై పరుగులు తీస్తాడు. మరొకప్పుడు భయంకరములైన గ్రుడ్లగూబల, [illegible] అరుపులవలె అతి పరుషములై, రభసా ఘోషములై, సంభ్రమం కలిగించే శత్రురాజుల అదలింపులను బెదిరింపులను చెవులు గింగురు లెత్తగా, గుండెలవిసిపోగా వింటాడు. ఇంకొకసమయాన పూర్వసుకృతం పొడగట్టుకొన్నవాడై, విషవృక్షాలను, కాకిదొండ మొదలగు విషతీగలను, విష సరస్సులను బోలిన ఐహిక ఆముష్మిక ఫలకామ్యులై, జీవన్మృతులైన అధార్మికులను తాను చావసంసిద్ధమైకూడా ఆశ్రయిస్తాడు. మరొకప్పుడు దుర్జన సాంగత్యం వలన వంచితుడై నీళ్లులేని వాగులవంటి దుఃఖదులైన పాషండులను చేర బోతాడు. వేరొకప్పుడు పరులు తన్ను బాధించగా, అన్న పానాదులు లేక తండ్రులను, కుమాళ్ళను ఆశ్రయిస్తాడు. ఇంకొక సమయంలో భోగ్యపదార్థాలు ఏవీ లేనట్టిన్ని, దుఃఖపరంపరలకు స్థానమైనట్టిన్ని, కార్చిచ్చువంటి గృహాన్ని ఆశ్రయించుకొని యిష్టవస్తువులను పొందలేక, అనిష్టాలను నివర్తించుకోలేక శోకాగ్నిదగ్ధుడై నిర్వేదం చెందు

తాడు. మరొకప్పుడు కాలవశాత్తు ప్రతికూలులైన రాజులు రాక్షసులవలె ప్రియతమ మగు ధనమనే ప్రాణాలను అపహ రించగా చచ్చినవారితో సమానుడై సంతోషం లేక పడి ఉంటాడు.

ఒకప్పుడు గంధర్వపురంలాంటి తండ్రీ తాతలు, భార్యా బిడ్డలతో కూడిన కుటుంబసంబంధం నిజానికి అనిత్యమైనప్ప టికీ—నిత్యమనీ, సత్యమనీ తలచి స్వప్నసుఖంలాంటి ఆ సుఖాన్ని క్షణకాలం అనుభవిస్తాడు. గృహస్థులైనవారికి కర్మవిధులు పర్వతమంత రాశిగా ఉన్నాయి. అధికధనంచేత, అధికశరీర ప్రయాసచేత సాధ్యములైన యజ్ఞయాగాది కర్మకలాపాలను యథావిధిగా ఆరంభించి పూర్తిచెయ్యడానికి పూనుకొం టాడు. కాని మధ్యమధ్య ఎన్నెన్నో విఘ్నాలు, విఘాతాలు అడ్డుతగిలి, కొండగుట్టను ఎక్కబోయినవాడు ముళ్ళు, రాళ్ళు గుచ్చుకొని క్రిందపడినట్లుగా ఆ కార్యకలాపాలు పూర్తి చెయ్యలేక మిక్కిలి ఖేదం పొందుతాడు. దుర్గమక్షేత్రంలో పడినట్లు లౌకికవ్యసనాలలో పడిపోతాడు. ఇంకొకప్పుడు దుస్సహమైన జఠరాగ్నిచే శక్తి ఉడిగినవాడై కృశించి, ఏమీ చెయ్యలేక తన భార్యపై, బిడ్డలపై కోపం వహి స్తాడు. మరొకప్పుడు కొండచిలువవంటి నిద్రకు వశుడై, అంధకారంవంటి అజ్ఞానంలో మునిగి శవంలా దూరంగా పరిహరింపబడి, శూన్యాటవిలో ఏమీ తెలియక పడివుంటాడు. ఇంకొక సమయాన దుర్జను లనే పాములచే కఱవబడి, గర్వం అనే కోఱలు విరిగినవాడై ఒక్క క్షణంకూడా కంటిమీద కునుకులేక, విజ్ఞానం నశించిపోగా గ్రుడ్డివాడై చీకటిబావి

వంటి మహాదుఃఖంలో పడి ఉంటాడు. మరొకప్పుడు సుఖలేశములైన విషయభోగములం దాసక్తుడై, [illegible] పరదార పరధనములను స్వీకరించడానికి ప్రయత్నిస్తాడు. తత్ఫలితంగా వారి భర్తలు, రాజులు పట్టి కొట్టగా, మహాదుఃఖప్రదమై నరకప్రాయమైన కారాగారంలో బద్ధుడవుతాడు. ఓ రాజా! జీవునకు ఇటువంటి దురవస్థలు సంప్రాప్తమవుతాయి గనుక, ఇహలోకంలో కానీ, పరలోకంలో కానీ, [illegible] కర్మమే సంసారానికి జన్మక్షేత్రమని మునీశ్వరులు చెబుతున్నారు. ఓ రాజేంద్రా! ఆవిధంగా [illegible] ఎంతో ప్రయాసపడి దానినుంచి [illegible] లను అనుభవిస్తున్నప్పటికీ అంతలో [illegible] అపహరించుకొని పోతాడు. దానినుంచి మరింత [illegible]. ఆవిధంగా ధనాదులు హస్తగతమైనా [illegible] ఉంటాయి కాని అతనిచే అనుభవింపబడవు. మరొకప్పుడు అతడు ఎండకూ, వానకూ, గాలికీ, చలికీ, ఆధ్యాత్మికములు ఆధిభౌతికములు అగు తక్కిన నానావిధ [illegible] ప్రతీకారం చెయ్య సమర్థుడు కాక, ఎడతెగని దుఃఖాలపాలవుతాడు. ఇంకొకప్పుడు పరస్పర ధనవ్యవహారాలు సాగిస్తూ, విత్తకార్పణ్యంవలన ఇతరులవద్దనుండి చిల్లిగవ్వ అయినా సరే అపహరించి వారితో విరోధం తెచ్చుకొంటాడు. ఒకప్పుడు తన ధనాన్ని యావత్తూ పోగొట్టుకొని భోగానుభవం ఎంతమాత్రం లేనందున విఫలమనోరథుడై విచారిస్తుంటాడు. తిరిగీ వాటిని సంపాదించడానికి యితరుల ధనాన్ని అపహరించ ఉద్యుక్తుడవుతాడు. అందువలన అవమానాలు, కష్టాలు

పొందుతాడు. ఈవిధంగా ధనలోభం వలన అందరితో అంతకంతకు వైరానుబంధాలు వృద్ధి పొందించుకొంటూ తన జాత్యభిమానమైన పూర్వవాసనచే ఆ పైన విష యాలనే వివాహాది క్రియలచే సంబంధాలు చేకూర్చు కుంటూ ఉంటాడు. ఆ విధంగా నానా విధములైన క్లేశ ములచేత, రాగద్వేషములచేత విస్తృతమైన సంసార మార్గంలో అంతులేని ఆపదలు పొందుతూ, చనిపోయిన తండ్రి తాతలను విడిచి, పుట్టిన కొడుకులయందు కూతుళ్ళ యందు మమకారం ఉంచి, తిరిగీ ఏదైనా విపత్తు సంప్రా ప్తంకాగా లోలోపల దుఃఖంతో కుమిలిపోతూ, మోహం లో మునుగుతూ, దీనాలాపాలాడుతూ, కన్నీరు కాల్వలు గట్టి ఏడుస్తూ, మళ్ళీ తనకు పిల్లలు పుట్టినచో అధికంగా సంతోషిస్తూ రాబోయే దుఃఖాలు తలుచుకొని భయపడుతూ ఒక్కొక్కప్పుడు తన భార్యాబిడ్డల గుణగణాలను, వారి చేష్టలను వర్ణించి చెప్పుకొంటూ, ఆనందిస్తూ, నాధుకర్మ లన్నింటినీ వర్జించి ఎప్పటికీ ఈ సంసారమార్గాన్ని దాట లేకుండా సంచరిస్తుంటాడు. ఓ రాజా! ఈ సంసారాటవి నుండి దరి చేర్చేది— ఆధ్యాత్మిక యోగంచేత, కర్మయోగం చేత అను గృహీతమైన ఒక్క భక్తియోగం తప్ప వేరొకటి లేదు. అంతేకాదు; నిరతిశయానందరూపమైన పరమాత్మను పొందడానికి ఉపాయభూతమైన యోగానుశాసనమును, శాంతస్వభావులై మనస్సును జయించి, సర్వభూతహితులైన మహాత్ములు ఆచరింప గలుగుతారేకాని, దాన్ని దిగ్గజాలను జయించగల్గిననూ మనస్సును జయించజాలని రాజర్షు లెంత

మాత్రం పొందలేరు. మనిషిన్ని వారు 'ఈ భూమి నాది' అనే అభిమానాన్ని ఉంచుకొని పరస్పరం పగలు పెంచుకొని, యుద్ధాలుచేసి, ఆభూమిని విడిచి చనిపోతారు. ఓ రాజా! సంసారాటవిలో సంచరించేవారికి సుఖదుఃఖాలు, రాగద్వేషాలు, భయాభిమానాలు, నానాప్రమాదాలు, శోకమోహాలు, ఈర్ష్యావమానాలు, విపత్పరంపరలు, ఆధివ్యాధులు, మదమాత్సర్యాలు, జన్మ జరామరణాలు — ఇవన్ని తప్పక సంభవిస్తూనే ఉంటాయి. ఉదాహరణగా చెప్తే, ఇప్పుడు, భగవంతుని మాయారూపమైన స్త్రీచే స్వయంగా కౌగలించుకొనబడుతున్నారు. ఆ స్త్రీలు పురుషుల వివేకాన్ని జ్ఞానాన్ని నశింపచేస్తున్నారు. అందుచేత వారు ఆ స్త్రీలను క్రీడామందిరాలు నిర్మించ పూనుకుంటారు. వాటిని పూర్తి చెయ్యడం ఎట్లాగా అని వ్యాకులపడతారు. ఆ విహారమందిరాలలో తిరిగే కొడుకులను, కూతుళ్ళను, భార్యలను కళ్ళారా చూస్తూ, నోరారా తియ్యని మాటలు పలుకుతూ, హృదయం ఉప్పొంగి పోగా, ఇంద్రియాలు జయింప సమర్థులు కాక, తమ ఆత్మలను దుఃఖనరకంలో పడద్రోయుచున్నారు. ఓ రాజా! పరమాణువు మొదలుగా ద్విపరార్థ పర్యంతం కలుగు కాలమే స్వరూపంగా కల్గి అతివేగంగా పరిభ్రమిస్తూ, బ్రహ్మ మొదలు తృణమువరకూ గల జీవుల ఆయుర్దాయములు క్షణాలు, ఘడియల రూపంలో లెక్కిస్తూ ప్రమత్తులగు వారి ఆయుర్దాయములను అపహరిస్తున్న భగవంతుడైన మహావిష్ణువుయొక్క కాలచక్రం వలన మరణం సంభవిస్తుందేమోనని భయపడుతూ, ఆ చావును తప్పించుకొని అమరత్వాన్ని

పొందదలచి, ఆకాలచక్రమే ఆయుధంగా గల వాసుదేవుని తిరస్కరించి, రాబందుల లాంటివారు, గ్రద్దలవంటివారు, కొంగలవంటివారు, ఆర్యులు చెప్పిన సిద్ధాంతాలనుండి బహిష్కరింపబడినవారు అయిన పాషండ దేవతలను, పాషండ దేవతా చిహ్నలతో అభిముఖంగా చేసుకొని ఆరాధిస్తుంటారు. చివరకా పాషండ దేవతలవలన ప్రయోజనం పొందలేక, వారిచే వంచితులై, అప్పుడు బ్రహ్మకులంలో జన్మిస్తారు. అట్లా జన్మించినా యజ్ఞపురుషుడైన శ్రీమన్నారాయణుని ఆరాధనరూపములు, బ్రాహ్మణులకు విహితములును అయిన ఉపనయనాది శ్రౌతస్మార్త కర్మలు చెయ్యడానికి ఇష్టపడక తరువాత శూద్రకులాన్ని చేరుతారు. ఆ విధంగా శూద్ర జాతి స్త్రీని పెండ్లాడి దానియందు సంతానాన్ని కని, తత్కుటుంబ పోషణకు పాటుపడుతూ, వానరజాతి లాగా మైథునకర్మ లొనర్చుతూ, గ్రామ్యసుఖా లనుభవిస్తారు. ఆచారవిహీనమైన ఆశూద్ర కులంలో అడ్డూ - ఆపూ ఏమీ లేనందున దేహి, దేశకాలాలను పాటించకుండా క్రీడిస్తూ, నిరంతరం విషయాసక్తుడై వర్తిస్తూ, పరస్పర ముఖావలోకనాదులైన గ్రామ్య కర్మలలో చిక్కి, మృత్యుకాలం ఆసన్న మవుతున్నదని కూడా తెలియక వానరుడు దారాసుతాదులతో చెట్లయందు క్రీడిస్తున్నట్లుగా, భార్యాపుత్ర వత్సలుడై, సంగమోత్సాహుడై ఐహికసుఖాలు కలిగించే గృహాలలో రమిస్తూంటాడు. ఆవిధంగా దేహి సంసారమార్గంలో తిరిగి తిరిగి తుదకు ఏనుగువంటి మృత్యువుకు భయపడి, కొండ

సుహృద్వంటిది గాఢంగా ధ్యానవేళలో పఠిస్తూఉంటాను. నాధ్యానానికి పేరుభూతమైన కర్మరూపమగు తీగలను ఛేదించగా చేస్తున్నాను, ఆ ఆపదలనుండి అతిశీఘ్రంగానే ముముక్షువునకు ప్రవర్తి స్తాను. ఈవిధంగా ఎల్లప్పుడూ, మూలమైన దేహాలు ధరించిన జీవలోకం సంసారమార్గంలో సంచరిస్తూ మొదటి స్వర్గ లోకం అనేది ఎక్కడ ఉన్నదో అనుమానమే ప్రవేశిస్తుంది. కాని ఒక్కనాటికీ మరలిరాలేరు. ఈవిధంగా దివ్య లోకాలు పొందినవారు కూడా సంసారమార్గంలోనే పరిభ్ర మిస్తుంటారు కాని నివృత్తిని పొందలేరు. ఓ, పరీక్షి న్నరేంద్రా! భరతుడు పరోక్షంగా చెప్పిన వాక్యాలలోని అర్థవివరణం ఇది. గరుత్మంతుని గమనవేగాన్ని ఈగలు ఏవిధంగాఅనుసరించలేవో—ఆవిధంగా ఋషభదేవుని కుమా రుడు, రాజర్షి, మహాత్ముడు అయిన భరతుని మార్గాన్ని ఇతర రాజు లెవరూ మనస్సుచేతనైనా సరే అనుసరించ అర్హులు కారు! ఓ రాజా! మహానుభావుడగు ఆ భరతుడు ప్రాయంలో ఉండగానే, చిత్తం భగవదాయత్తం చేసి, విడువతరంకాని అత్యంత ప్రియులైన భార్యాబిడ్డలను, బంధు మిత్రాదులను, రాజ్యభోగాలను పరిత్యజించాడు. వాటిని కేవలం త్యజించడమే కాదు; వాటియందతనికి కొంచెమైనా అభిలాష లేదు! ఓ, పరీక్షిన్మహారాజా! శ్రీహరి పరిచర్యా సక్త చిత్తులగు మహాత్ములకు ముక్తి అయినా సరే తుచ్ఛమై తోచగలదు. ఇక భార్యాబిడ్డలను పరిత్యజించడంలో ఆశ్చర్య మేమున్నది? భరతుడు తన మృగశరీరం త్యజిస్తూ— 'ఓ, దేవదేవా! నీవు యజ్ఞస్వరూపుడవు. యజ్ఞాది ధర్మఫలప్రదు

డవు. ధర్మానుష్ఠాతవు. యోగాత్మకుడవు. ఆ యా అవతారాలచే వర్ణాశ్రమ ధర్మాలను సంరక్షిస్తూ, ధర్మాసక్తులగు వారిని కాపాడుతున్నావు. నీవు ప్రకృతికి నియంతవు. శ్రీమన్నారాయణుడవు. ఆశ్రితుల సంసారబంధాలను తెగ్రెంచే నీ పాదారవిందములకు ఇదే నమస్కరిస్తున్నాను"— అని ఆ శ్రీహరిని ప్రార్థించాడని ఆ మహానుభావుని పుణ్యకీర్తిని మహాత్ములు ప్రస్తుతిస్తారు. ఓ పరీక్షిన్మహారాజా! భగవద్భక్తులచే నుతింపబడు పరిశుద్ధగుణములకును, సకలభూత హితాచరణము ఆదిగాగల సత్కర్మలకు నిలయమును అగు రాజర్షి శ్రేష్ఠుడైన భరతుని చరిత్రం ఇది. దీనిని నీకు వినిపించాను. ఈ పుణ్యచరిత్ర చదివినవారికీ, విన్నవారికీ, పొగడినవారికీ సమస్తశుభాలు, ఆయుర్వృద్ధి, యశస్సు, పుణ్యము, మోక్షము, సకలశ్రేయస్సులు - వాటంతట అవే సమకూరుతున్నాయి"—

అని ఈ ప్రకారం శుకయోగి పరీక్షిన్మహారాజునకు పరమభాగవతోత్తముడైన. జడభరతునిచరిత్ర చెప్పాడు.

—

**ARYA KATHAMALA**
**Price Rs: 2-25**

## ఈ పుస్తకంలో ....

ప్రాచీన భారతీయ నాగరికతకు చేతనాలు అనదగిన సంస్కృత పురాణాలలోని పది హేను ఉత్తమ కథల సంకలనాన్ని ఇప్పుడు మీరు చదువుతున్నారు. సత్యం, ధర్మం, త్యాగశీలం, భక్తి, మాతృప్రేమ వంటి ఉదాత్త భావసమన్వితాలను ఈ కథలు సమర్థంగా ప్రతిపాదిస్తున్నాయి.

శ్రీ శివచరిత్రం, ప్రహ్లాదోపాఖ్యానం, గురుభక్తి మహిమ మొదలైన ఈ కథలు ప్రపంచ సాహిత్యంలో శాశ్వతంగా నిలచి పోదగినవి. సర్వకాలాలలో సర్వదేశాలలో మానవుల ఉదాత్తతామహనీయత లను గెలువగల సమర్థ్యం కలిగి ప్రశంసలు పొందినవి.

జాతీయభావోద్దీపకమైన పవిత్రంమయు శ్రీ వి. కృష్ణస్వామి అయ్యర్ 1907 లో బహు పురాణాలలోని 11 గాథలను ఎన్ని 'ఆర్య చరిత్రం' అనే సంపుటంగా ప్రకటించారు. అందులో ప్రజలకు ఎక్కువగా పరిచితములుకాని ఉత్తమ గాథలను యథామూల సరళానువాదా లివి.

దక్షిణ భాషా పుస్తక సంస్థ
సహకారమున ప్రచురితము.

ఉషా పబ్లిషర్స్,
విజయవాడ - 1.

Wrapper Printed
at Swatantra Art Printers,
Vijayawada - 2.